కర్మయోగం

# వీర శైవ పురోహిత



## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజి


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస


అమ్మ శారదా దేవి


గురు వివేకానంద


గురు సాయిబాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళ స్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..







"ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్" ద్వారా విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందించే సేవా కార్యక్రమంలో బాగంగా ఈ పుస్తకాన్ని భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా) నుంచి సేకరించి అందిస్తున్నాము. ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము.

సాయి రామ్ వారి సేవల విస్తరణలో బాగంగా ఈ ఫౌండేషన్ స్థాపించబడినది. ఈ స్వచ్ఛంద సంస్థ ద్వారానే అన్ని సేవలు అందించబడును. ఇటువంటి పుస్తకాలు మీరు వ్రాసినట్లయితే (లేక) సేకరిస్తే మాకు తెలియచేయండి. మేము ప్రతి విద్యార్థికి ఉచితంగా అందేలా చేస్తాము, తద్వారా ఉన్నత విలువలు, నైపుణ్యాలు కలిగిన విద్యార్థులను మన దేశానికి అందించవచ్చు. మాతో కలిసి నవ భారత నిర్మాణ కార్యక్రమంలో పనిచేయుటకు, భాగస్వామ్యం అగుటకు ఆసక్తి ఉంటే సంప్రదించగలరు.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in
2) ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ వెబ్ సైట్ : www.freegurukul.org
3) సాయి రామ్ వెబ్ సైట్ : https://sites.google.com/site/sairealattitudemanagement
4) మొబైల్ ఆప్: Free Gurukul

గమనిక: భక్తి,జ్ఞాన,ధర్మ ప్రచారార్థం ఉచితంగా eBook రూపంలో భారత ప్రభుత్వపు డిజిటల్ లైబ్రరీ సహాయంతో ఇవ్వడం జరిగింది. ఇది లాభార్జన దృష్టిలేని ఉచిత సేవ. ఈ సేవలో అంతర్జాలంలోని(ఇంటర్నెట్) లైసెన్సు / కాపీరైటు అభ్యంతరాలు లేనివి అనుకొన్న పుస్తకాలను గ్రహించటం జరిగినది. అనుకోకుండా ఏవైనా అభ్యంతరకరమైనవి ఉన్నచో మాకు తెలుపు మనవి, వాటిని తొలగించగలము అని మనవి చేసుకొంటున్నాము.

Website: www.freegurukul.org Mobile App: Free Gurukul email: support@freegurukul.org
Facebook: www.facebook.com/freegurukul Help Line / WhatsApp: 9042020123

" మన లక్ష్యం: విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య అనేది ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందరికి అందించబడాలి "

ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ – Free Gurukul Education Foundation

సర్వం పరమాత్మ పాద సమర్పణమస్తు

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!



మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఐవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

ఓం

"నవీరశైవ సదృశం మతమస్తి జగ

పంచానన తనూద్భూతాన్ - పంచాక్షర వ

పంచసూత్ర కృతోవందే - పంచాచార్యాన్

# వీరశైవ పురోహి



గ్రంథకర్త :

వే॥ పం॥ పెద్దమఠము రాచవీరదేవర



గ్రంథ కర్త, వే॥ పం॥ పెద్దమఠము రా
కావ్య తీర్థ (కలకత్తా), M.O.L. (O
హిందీ "భూషణ", కన్నడ "జా
ఆంధ్రప్రదేశ్ వీరమాహేశ్వర (జంగమ) మ

# విషయ సూచిక

# అభిప్రాయము

ఏ పదార్థమైనను సంస్కారము పొందిన యెడల దాని యందు గల స్వాభావిక లేదా అస్వాభావిక మాలిన్యములు వైదొలగించుకొని ప్రత్యేక స్వరూపస్వభావము సంతరించుకొని అదనపు ఉపయుక్తతను సాధించగలదు. ఉ॥ మట్టికి సంస్కారమిచ్చిన కుండయగును. బియ్యమునకు సంస్కార మిచ్చిన అన్నమగును. సృష్ట్యాది నుండి మానవుడు స్వీయ సంస్కారమును సాధించి, సంస్కృత వస్తుసంచయము నుపయోగించుట వలననే నేటి ఈ 'నాగరికత' సంభవమైనది. జంతుజాలమునకును, మానవునకును గల విశిష్ట భేదము ఈ 'సంస్కరణ' స్పృహలోనే గలదు.

సృష్ట్యాదిలో సంస్థాపితమైన వీరశైవము "సంస్కరణ" యొక్క ప్రాముఖ్యతను గ్రహించి దానిని ధార్మిక జీవనస్రవంతి యొక్క ప్రధానాంతర్గత భాగముగా తీర్చిదిద్దినది. షట్స్థల విజ్ఞానమంతయు ఈ సంస్కార భావనపైననే ఆధారపడి యున్నది. మానవుని మహాదేవునిగా మార్చే మార్గము ఈ షట్స్థల విజ్ఞానములో గలదను విషయమును ప్రతి వ్యక్తి గ్రహించవలెను.

వీరశైవులకు ముఖ్యముగా ఈ క్రింది సంస్కారములు తప్పనిసరిగా పాటించదగినవి.

1) పిండ సంస్కారము (లింగధారణ)
2) జ్ఞాన సంస్కారము (అక్షరాభ్యాసము)

3) లింగాంగ సంస్కారము (దీక్షావిధి)

4) దైనందిన సంస్కారము (ఇష్ట లింగపూజ)

5) జీవన సంస్కారము (గురు - జంగమ పాద పూజ)

పైనుదహరించిన ఆధ్యాత్మిక సంస్కారములతో పాటుగా వైవాహికాది ప్రాకృత సంస్కారములను సామాజిక ప్రభావ ఫలితంగా ఆచరింపబడుచున్నవి. ఈ సంస్కారములన్నియూ ఒక ప్రత్యేకతను సంతరించుకొని అన్యులకు దురూహ్యములై యున్నవి. క్రియాసారము, వీరశైవాచార కౌస్తుభము మొదలగు గ్రంథములలో విషదీకరింపబడిన మన సంస్కారవిధి కాల క్రమేణ ప్రచారరాహిత్యము నొంది సామాన్యులకు అందుబాటులో లేనందువలన మన వీరమాహేశ్వరులందరు ప్రాకృత మార్గమునే అనుసరించుచున్నారు. ఈ దురవస్థ వలన వీరశైవ సంస్కృతి అడుగంటే ప్రమాదము గలదు. బహువిస్తృత స్థాయిలో వెల్లి విరిసిన వీరశైవ సమాజాలు ఈ "వాస్తవ ప్రమాదాన్ని" గ్రహించడము లేదు. వీరశైవ జన సామాన్య సంస్కారాణాదులకై వీరశైవ జగద్గురువులైన రేణుకాది పంచాచార్యులకు వారస పుత్రులుగా నిలిచిన వీరమాహేశ్వరుల సంఘములో ఈ విషయము పలుమార్లు చర్చింపబడినది. ఈ విషయమై ఇబ్రాహీంపట్నం వాస్తవ్యులు వీరమాహేశ్వరాగ్రగణ్యులైన శ్రీ యం. శంకరయ్యగారు "పౌరోహిత" గ్రంథ ప్రచురణావశ్యకతను నొక్కి చెప్తూ, తత్ ప్రచురణ నేటి తరము యొక్క నైతిక బాధ్యతగా నొక్కి చెప్పిరి. విషయము గాంభీర్యమును గ్రహించి నొక సంఘమును

నియమించడము జరిగినది. ఈ సంఘ సభ్యులు వైయక్తికంగా శ్రమించినప్పటికినీ సామూహిక పరిశ్రమకు పూనుకోనందున ఈ సమస్య "అపరిష్కృతము"గా నున్న తరుణములో వీరశైవులెల్లరకు చిరపరచితుడు, పండిత శ్రేష్ఠుడు, వీరశైవ ధార్మిక విజ్ఞాన విశారదుడైన పం॥ రాచవీర దేవరగారు ఈ సవాలును బుద్ధి బలముతోను, అర్థబలముతోను, వైయక్తింగా ఎదుర్కొవడానికి సంకల్పించడము వీరశైవ జనసందోహానికి ముదావహము గాను, వీర మాహేశ్వరులకు ప్రత్యేకంగాను. ఒక అపూర్వ అదృష్టముగా గ్రహించదగినది. శ్రీవారి వజ్రసంకల్ప సంజనిత ప్రభాపటలమే ఈ గ్రంథ రాజము రూపమును తీర్చిదిద్దుకొనినది.

ఈ సద్గ్రంథములోని అంశాలు కేవలము వీరశైవులకే కాకుండ సర్వజన సామాన్యమునకునూ ఉపయుక్తమై ఉండెలా దేవరగారు వ్యవస్థీకరించినారు. ముఖ్యంగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ దేవాదాయశాఖ పరీక్షలకు ఉపస్థితులయ్యే విద్యార్థులకు ఇది అత్యంత అవశ్యమైన గ్రంథము. మానవకల్యాణదాయకమై, మానవుడిని మహాదేవుని స్థాయికి పెంచడానికి ఉపయుక్తమైన పరిశ్రమను సమాజానికి అనుగ్రహించిన శ్రీ రాచవీర దేవరగారు అభినందనీయులు.

ఇట్లు

హైదరాబాద్.

మఠం లింగయ్యాస్వామి

M.A., M.Phil.

జానంపేట (షాద్‌నగర్) బృహన్మఠాధ్యక్షులు

# మున్నుడి

అత్యుత్కృష్టమైన వీరశైవ ధర్మము, సమతావాదమునకు జాతిమత నిర్మూలనకు, సర్వమానవ కల్యాణమునకు ఆదర్శప్రాయమై ప్రపంచమునకే క్రొంగ్రొత్త వెలుగును ప్రసాదించినది. కనుక జాతిమత విచక్షణ లేకుండ సమస్త మానవులు ఒకే మానవజాతికి జెందినవారని జాటిచెప్పిన గౌరవము ఒకప్పుడు వీరశైవధర్మమునకే అంకితమై యుండినది.

ఈ యుత్క్రాంతిలో జైన - బౌద్ధ వైదికాది మతస్థులుగూడ ఈ ధర్మముయొక్క విలువైన అతి సున్నిత తత్వముల కాకర్షితులైనవారే! వీరశైవధర్మము ఒక భారతదేశమునందేగాక ఇతరదేశములందును వ్యాపించి యుండెననుటకు కొన్ని యాధారములున్నవి. ఈ జాతి ముఖ్య చిహ్నమైన లింగము జాతి చిహ్నముగాక జ్యోతి చిహ్నముగా నుండినది.

అట్టి వైభవముతో ప్రకాశించిన వీరశైవ ధర్మము నేడు మన దేశములోనే సన్నగిల్లుచున్నది. నామావశేషమై నిర్వీర్యమైనది. ఇది మన వీరశైవాభిమాను లందరికిని, తలవంపుగా పరిణమించినది. నేటి ప్రజా ప్రభుత్వ హయాములో ప్రతి మతమువారు సుసంఘటితులై తమకు గావల్సిన ఆర్థిక - వైజ్ఞానిక - శైక్షణిక - సామాజిక - ధార్మిక మొదలగు వనరుల హంగులన్నింటిని ప్రభుత్వముతో సహకరించి దానినుండి సమకూర్చుకొనుచున్నారు.

ఇట్టితరి మనవారు మాత్రము మన ధర్మముపట్ల ఉదాసీన వైఖరి నవలంభించి నిర్లక్ష్యము వహించి యున్నారు. దేశసేవ, దైవభక్తి మొదలగు

వాని పేరిట పెడ మార్గముల ననుకరించుచున్నారు. ఇది నిజమైన వీరశైవులకు భరించరాని యవమాన మనక తప్పినదికాదు. తాము నిరంతరము కష్టించి త్యాగమొనర్చిన కృషియంతయు "తేనెగాచి నక్కలపాలు గావించినట్లు". ఇట్టి వారి మనుగడ నిరర్థకమైనదిగానున్నది.

నేడు వీరశైవ ధర్మము యొక్క వైభవము తరగిపోవుటకు మనవారే కొందరు కారకులైయున్నారనుటలో సందేహ మించుకయును లేదు. స్వాతంత్ర్యమును మనము దగిన సమయములో తదనుగుణ్యముగ మలచుకొని, నడచుకొని ప్రభుత్వము నుండి ఫలమును బడసి సుఖముగా ననుభవించే సుయోగము మనకు లేకుండా పోయినది, దీనికి తోడుగా మనలోననైక్యత, పరస్పర ద్వేషము - అసూయ - దురభి మానములు దినదినము పెచ్చు పెరిగిపోవు చున్నవి. ఈదుర్గుణములను దొలగింపజేసికొని, పరమత సహనము గలిగి, తన ధర్మమును (మతమును) తన గృహము తన బంధు మిత్ర పరివారమునకే పరిమితముగావించుకొని, బహిరంగమున లోకమునకను కూలముగా తన విచారములను మలచుకొని తమ మనుగడను సాగించుకునే నేటి మానవుడే ధన్యుడు, అతడే సర్వమానవుల కాదర్శప్రాయుడు తప్పకుండ కాగలడు. "నొప్పించక దానొవ్వక దప్పించుక దిరుగువాడు ధన్యుడు సుమతీ" అన్నారు పెద్దలు.

కావునమన వీరశైవులు గూడ ఇకమున్ముందైన మెలకువతో లోకము తీరుతెన్నులు సక్రమముగా గుర్తించి యనుష్ఠింతురనే పేరాశతో మన ధర్మమనే గృహము శిథిలము గాకుండ భద్రపరచుకునే బాధ్యత మనందరిపై యున్నది. దీన్ని గుర్తించే నేను నా యథాశక్తి వీరశైవ ధర్మమునకు "ఉడుతా భక్తితో" నాసొంత ధనము వెచ్చించి గూడ వీరశైవ సాహిత్యమున కొన్ని యుద్గ్రంథములను వ్రాసి ముద్రించి ప్రకటించి యున్నాను.

వీరశైవ సాహిత్య సంస్కృతులను సంరక్షించే కాంక్షతోనే నీకృషికి బూనుకుంటిని. "వీరశైవధర్మ" అను పత్రిక నొకదానిని పదిసంవత్సరములు సమస్త కష్టనిష్ఠూరముల కోర్చి నిర్వహించాను. ఈ పని ధనవంతులైన భక్తులు, సమాజమువారు, సంస్థాన మఠాధీశులు జేయవల్సినది. నాబోటి శైక్షణిక పండిత వృత్తి నుండి విశ్రాంతి గైకొన్న వయోవృద్ధుడనగు నేను బూనుకొనుట దుస్సాహసమేయగును. ఐనను ఈ వీరశైవ వంశమున జన్మించినాడను గనుక దీనికై నేనంకితముగావల్సిన కర్తవ్యము నాయది. "సాగరమున వర్షము గుర్సిన ఫలమేమి ? ఎక్కడైతె పైరులు శుష్కించు చున్నవో వాటిపై వర్షము గుర్సిన లాభకారియగును గదా !" కావున దినదినము క్షీణించుచున్న నా వీరశైవ ధర్మమునకై నేనంకితము గావల్సి యున్నది. ఈసద్బుద్ధిని పరమశివుడు సమస్త వీరశైవులకును బ్రసాదించు గాక యని యహర్నిశలు ఆ భగవంతుని ప్రార్థించుచున్నాను.

ఇక పోతే ప్రస్తుత విషయమును గురించి ప్రస్తావిస్తాను. వీరశైవ సాహిత్యము విషయమై క్లుప్తముగా వివరించనైనది. ఇఁక సాంస్కృతికముగా నా యథాశక్తి వీరశైవ ధర్మమునకు సంబంధించిన షోడశ సంస్కారముల నుట్టంకిస్తు "స్వయం పురోహితమును"ని జిలు పొత్తము నొకదానిని చాలా వ్యయ ప్రయాసముల కోర్చి ప్రాచీన ఆధార గ్రంధాలలోని విషయములను క్రోడీకరించి, ముద్రించి వీరశైవ వీరమాహేశ్వరు లెల్లరకందించు చున్నాను. యేతద్గ్రంథ సహాయముతో, సమస్త వీరశైవుల గృహములలో జరిగె శుభాశుభకార్యములను సునాయాసముగా యథావిధి నేరవేర్చుట కత్యంతోపయుక్తముగా నుండినది.

ఇతోధికముగా పురోహితులకు ప్రత్యక్షముగా తోడ్పడుటకై విధి విధానముగా వివరించుటకై కొద్దికాలము ప్రశిక్షణ గఱుపుటకు

తేది 10-10-1990న శ్రీ డి. ఎలమందగారి యౌదార్య బుద్ధితో నాకవకాశమొసఁగిన తమ "వాణి" స్కూలు, మలకపేట, మున్సిపల్ కాలనీలో పాఠశాల నొకదానిని గూడ నెలకొల్పియున్నాను. కాని ప్రారంభించినను యింత వరకు మనవారధికసంఖ్యలో అందు పాల్గొని దానిని ప్రోత్సహించుట లేదు. ఇది కడుఁగడు విచారకరమైన సంగతి. సమాజమును సుధారించే కార్యక్రమమును మనవారు చేపట్టరు. చేపట్టిన వారికి చేయూత నొసఁగి ప్రోత్సహించరు. ఇట్టిది మరి ఘోరమైన విషయమని నాయనుభవముతో నేనిట ప్రస్తావించుచున్నాను.

కావున యధిక శ్రమకోర్చి వ్యయప్రయాసములకులోనై యీ స్వయం పురోహితమను నీ గ్రంథ రాజమును ముద్రించి యున్నాను. దీనిని యధిక సంఖ్యలో విలచి(కొని) వీరశైవులందరిని యథాశాస్త్రముగ దీని యాధార ముతో సమస్తశుభాశుభకార్యములను పురోహితులు తప్పకుండ నెరవేర్చి తృప్తి పరచగలరని నేను అభిలషించుచున్నాను. అప్పుడే నా యీ శ్రమ సార్థకమగునని దలచుచున్నాను. ఇది ప్రథమ ముద్రణము కనుక ఇందులోని ముద్రాణా రాక్షస జనితములైనవిగాని అథవా ఇంకేవియైన దొసగులు నేత్రగ్రంథమునందు దొరలిన వాటిని సహృదయులు, సద్భావముతో మాకుదెలిపిన యెడల వాటిని రెండవ ముద్రణలో తప్పకుండ కృతజ్ఞతా పూర్వకముగా స్వీకరించి ముద్రించుటకు ప్రయత్నించెదనుగాక,

"ఇతి శివయ భూయాత్"

ఇట్లు గ్రంథకర్త

**పం॥ పెద్దమఠము రాచవీరదేవర "తీర్థ" M.O.L.**
ఇంటి నెం. 3-3-139, నెహ్రూ హైస్కూలు వద్ద, కాచిగూడ,
హైదరాబాదు-500 027.

# మదీయ వంశావళి

(శివశరణ శ్రీ బండారు తమ్మగారిచే బరిష్కృతము)

దండకము :- శ్రీకరంబైనయాంధ్రప్రదేశంబునన్ మధ్య మాణిక్యమున్‌బోలి బోనంబుకాధారమైనట్టి జిల్లాకు (మెదక్) తాలూక యందోలునన్ జేవళాఖ్యాపురంబందునన్ ముఖ్యుడై సన్మఠాధీశ్వరత్వంబు గైకొన్న శ్రీ సంగమేశాఖ్య మాహేశ్వరుండొప్పు వీర గోత్రోద్భవుండై సదాచార సంపన్నశీలుండు, ధీరుండు నౌనాతడా శ్రీమతిన్ శివ్వ మాంబాఖ్య సాధ్వీమణిన్ బెండ్లి యాడెన్ మహావైభవో పేతుడై, కొన్ని నాళ్ళిట్లు మాహేశ్వరాచారా శీలంబులం దొప్పుచున్‌దాను సంసార నిర్వాహ మున్ జేయగా గల్గిరవ్వారికిన్ బుత్రరత్నంబురాలాచయార్యుండునున్ శంకరార్యుండు, పంచాక్షరాఖ్యుండునున్, శ్రీ షడక్షర్యభిఖ్యుండునున్ వీరయార్యుండు నానేవురున్ బేర్మివర్ధిల్లగానందు(బంచాక్షరీ నాముడై క్యంబునొందంగ శేషించు నావల్వురన్ జేష్టు(డౌ రాచయాఖ్యుండు రాణించె నింటన్ వహించెన్ స్వసంసార భారంబు, శ్రీ శంకరార్యుండు పాపన్న పేటన్ మఠాధీశుడైయుండి రాజిల్లగా స్వామియౌ శ్రీ షడక్షర్యభిఖ్యుండు తా జోగిపేటన్ స్థితుండై సదాశివ్వపేటన్ మఠాధీశతన్‌బూని రాజిల్లి వైరాగ్య తేజోవిశేషంబు మన్నించుచున్ భక్తబృదంబు పాదార్చనల్ సేయగా శీలతన్ దక్షతన్ బూజ్యతన్ గ్రాలుచున్, దానధర్మాది సత్కార్యముల్‌సల్పు పుణ్యాత్ముడై (గొల్లళా నామమున్ జెంద(గా) కొల్లగా కీర్తులన్ జెంద(గా, వీరలన్ జిట్టితమ్ముండు వీరయ్యకున్ జేష్టు(డౌ పుత్రురాచయ్యనున్ దాన్వ పీఠంబునన్‌నిల్పెనీరీతి సామాజిక శ్రేయమున్ గోరుచున్ వేడ్కమై లింగ పూజా ధురీణుండునైయుండగానంత నాశంకరుండున్ సదా మోదకారున్ నిజాధీనమున్ జేర్చి కైలాసవాసున్ దగన్ జేసె(దాన్॥

సీ॥ పరమేశుఁజేరెనా భ్రాతయని తలంచి
వగచి వీరయతన భ్రాతృపదవి ।
కైలాతివారు రాజాలరని గణించి
తన పుత్రుని గొనినిల్పెనుముదమున ।
వేడ్కనతడిటులా వీరసుతుని గూడి
తనదు భక్తులమదుల్ తనియఁజేసె ।
బాలుండుః ముద్దుతో పలుకులు వినిపింపఁ -
వత్సలతనతనిఁబంపె బడికి ॥౧॥

తే॥గీ॥ పిదపఁతల్లిదండ్రి పెద్దకొమరుఁజూచి ।
నెనరుతో యతీశ్వరునకొసంగ ।
నతఁడు స్వీకరించి కుతుకమ్ముతోఁబెంచి ।
కారణాలు జరుపఁజేరె శివుని ॥

తే॥గీ॥ యతికి సోదరుఁడైన వీరయ్య యంత ।
అన్నదివికేఁగ బాలుని నాదరించు ।
వారులేరని తాఁ దెచ్చి గారవమునఁ ।
బెంచుచుండెనుదాజోగిపేటఁజేరి ॥

లిం॥ డాకూరుమతం శ్రీ సిద్ది వీరయ్య గారి పద్యద్వయంబు

గీ॥ శ్రీకరుఁడు వీరశైవాబ్ధి శీతకరుఁడు
ప్రథిత గుణుఁడు శ్రీ వీరయాహ్వాయ బుధుండు
తనదు పుత్రురాచయకు విద్యలనునేర్పి
యరిగెఁగైలాసమునకుఁదానంత మందు ॥

కం॥ శ్రీవీరయాఖ్య సుగుణికి
పేరిమి పుత్రుండు రాచవీరయ కరమున్
గూరిమి తోడను విద్యల
నేరిచి పితృభక్తిగల్గి నెగడెడు నెపుడున్ ॥

* * *

శ్లో॥ జీయాత్ శ్రీ రేణుకాచార్యో - శివాచార్య శిఖామణిః।
యోమాహేశ్వర సిద్ధాంతం - స్థాపయామాసభూతలే ।

## స్వీయ రచనలు

శా॥ వి॥ తోరంబౌనుదరంబు దాల్చి కడు సంతోషంబు గల్గింపఁగన్
భారంబౌ నిజ వక్త్రతుండమున దంతంబెంతో శోభిల్లఁగా
సారంబౌ ఫలమూలపాయసములనాస్వాదించుచున్ బ్రీతిమైఁ
గారుణ్యంబునఁ బ్రోచునీకిదె నమస్కారంబు విఘ్నాధిపా ॥౧॥

అనుష్టుప్ :- నమో ఉగ్ర స్వరూపాయ, నమో జిష్ణ్వాది శత్రవే ।
దక్షయజ్ఞ వినాశాయ, వీరభద్రాయతే నమః ॥౨॥

శా॥ వి॥ శ్రీకల్యాణపురాన బిజ్జలుని మంత్రి శ్రీ పదం బొందియున్
రాకా చంద్రుని గాంతిమించు యశముల్ రాజిల్లగా ధారుణిన్
లోకారాధ్యుడవైన శ్రీ బసవ సుశ్లోకుండవై నట్టినిన్
నాకా వాసులు భక్తిఁగొల్తుమదిలో నన్నిల్చినన్నేలుమా ! ॥౩॥

కం॥ శ్రీ కంఠనామము సదా
యే కంఠమునందు నుచ్చరింపంబడునో
యా కంఠముగల వారికి
శ్రీ కంఠుండిచ్చుగాత, శివముల సతమున్ ॥ ॥౪॥

కం॥ మలహర ! నినునేఁగొలిచెద
కలిసంతరణంబుఁగోరి కాల విభేదీ ।
సులలితమగు మత్కృతిన
త్వరితముగాఁ జేయుమయ్య, ఫాలాక్ష శివా ! ॥ ॥౫॥

కం॥ వరకవి పద పద్మములన్
స్థిరముగ ధ్యానించి నేను ధన్యుడనగుచున్ ।
నిరతము తదనుగ్రహమున
విరచించితి వీనినిట్లు వేడుకతోడన్ ॥ ॥౬॥

కం॥ చిరకాలము గను మనకై
వరవీరకవులు కరుణను వ్రాసిన కృతులన్ ।
గురుతర భక్తిని జదువుతు
గురతింపుఁడు వానిలోని, గురుధర్మములన్ ॥ ॥౭॥

కం॥ వరుస నాంధ్రదేశమ్మునను
దొరలిన మన వీరశైవ, దుర్దశకెంతేన్ ।
దురపిల్లుచు దన్మతీయులఁ
గరముద్బోధించి వ్రాయఁగడఁగితి దీనిన్ ॥౮॥

శ్లో॥ ఈశ్వరాఖ్యా మహాసాధ్వీ - సంగాఖ్యా విదుషీమణీ ।
తయోః ప్రాణపతి రహం - రాచవీరాఖ్యదేవరః ॥

ప్రథమ పుత్రోమే - బసవరాజాఖ్య దేవరః ।
ద్వితీయోమే - ప్రభులింగాఖ్యదేవరః ॥

తృతీయా పుత్రీమే - శివరాణ్యాఖ్యాహిసా ।
జనకస్తేషామహం రాచవీరాఖ్య దేవరః ॥

"మీ పాదకమలముల దలదాల్తు నెపుడు ।
మీ పాదసేవకుని రక్షింపుమెపుడు ॥

ఎల్లకాలములందు భజియింతు నిన్ను ।
ఎల్లయిడుములన్‌బాపి రక్షింపు నన్ను ॥"

## సూచన

పురోహిత వృత్తి నాచరించువారు తెల్సికొనవల్సిన ముఖ్యమైన విషయములు :-

1. పంచోపచారములు :- గంధము - పుష్పములు - ధూపము - దీపము - నైవేద్యము.

2. అష్టోపచారములు :- గంధము - అక్షతలు - పుష్పము - వస్త్రము, ధూపము - దీపము - నైవేద్యము - తాంబూళము.

3. షోడశోపచారములు :- ఆవాహనము - ఆసనము - పాద్యము - అర్ఘ్యము - ఆచమనీయము - స్నానము - వస్త్రము - ఉపవీతము - గంధము - అక్షతలు - పుష్పము - ధూపము - దీపము - నైవేద్యము - ప్రదక్షిణము - నమస్కారము.

# ప్రాణాయామము చేయు విధానము

తర్జని - మధ్యమ ఈ వ్రేళ్ళను వదలి అంగుష్ఠ అనామిక - కనిష్ఠ ఈ మూడు వ్రేళ్ళతో ముక్కును బట్టుకొని, ఈ దిగువ మంత్రము నుచ్చరించాలి.

"ఓం భూః ఓం భువః ఓగ్ం సువః ఓం మహః ఓం జనః ఓం తపః ఓగ్ం సత్యం ఓం తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి । ధియో యోనః ప్రచోదయాత్ । ఓం మాపోజ్యోతిరసోమృతం బ్రహ్మ భూర్భువస్సువరోం ॥

అను మంత్ర పఠన పూర్వకముగా చంద్ర స్వరమైన ఎడమ నాసా పుటము నుండి వాయువును పూరించి, అదే మంత్రముచేత కుంభించి, సూర్య స్వరమైన దక్షిణ నాసా పుటము నుండి అదే మంత్రము నుచ్చరిస్తు రేచకము జేయవలెను. ఈ విధముగా పూరకము - కుంభకము - రేచకముల ననుష్ఠించిన ఒకసారి ప్రాణాయామమగును.

న్యాసము :- కరన్యాసము - దేహన్యాసము - అంగన్యాసము అని మూండు రకాలు.

వాటిలో 1) కరన్యాసము 2) దేహన్యాసములు 3) ప్రత్యేకముగా 1. సృష్టి, 2. స్థితి, 3. సంహారములని మూండుమూండురకాలుగా నున్నవి. అంగన్యాసమొ కేవిధముగా నున్నది. సాధకుడు మొదట కర న్యాసమును పిదప 2. దేహన్యాసమును తదుపరి 3. అంగన్యాసమును జేయవలెను.

పారమేశ్వరాగమములో :- అంగుష్ఠాంగులి మొదలుకొని, కనిష్ఠాంగులి వరకు జేయునది సృష్టి, మధ్యమము - అనామిక - కనిష్ఠిక - అంగుష్ఠము - తర్జని - ఈవిధముగా జేయునది స్థితి యనఁబడును. అంగుష్ఠాంతమైనచో సంహారన్యాసమగును.

వీనిలో గృహస్థులు, సృష్టిన్యాసమును, బ్రహ్మచారి స్థితి న్యాసమును, సన్యాసి సంహారన్యాసమును జేయవలయునని ఆదేశింపఁబడినది.

1) దేహన్యాసము :- శిరస్సు - ముఖము - కంఠము - హృదయము - గుహ్యము - పాదము, ఈ స్థలములందు క్రమముగా బీజాక్షరములను ప్రణవసహితముగా న్యాసము జేయవలెను. సృష్టి పాదాది మూర్ధ పర్యంతముగావించినచో సంహారము. హృదయము, గుహ్యము, పాదము, శిరస్సు, ముఖము, కంఠము, ఈ విధముగా న్యాసము గావించుట స్థితియనఁబడును.

2) అంగన్యాసము :- తరువాత ప్రణవము మొదటగల షడక్షరములను, హృదయము, శిరస్సు, శిఖ, కవచము, నేత్రము, అస్త్రము, ఈ స్థానములందు న్యాస మొనర్పవలయును.

సూచన :- క్రియాసారమునందు :- వీరశైవులకు విధించిన మేరకు దీక్షాది కర్మలయందాచరించవలయును.



## జపించే క్రమము ; రేఖాజపము

కుడిచేతికి భస్మమును లేపించుకొని మధ్యమానామిక వ్రేళ్ళ మధ్య పర్వముల రెండింటిని మేరువు (శిఖామణి-మధ్యమణి)గా కల్పించి అచట శక్తి విశిష్ట పర శివ బ్రహ్మస్వరూపమగు ప్రణవమును బొటవ్రవ్రేలి కొస భాగముతో మూఁడు సార్లు వ్రాసి, అద్దానికి ప్రదక్షిణ క్రమముచేత మధ్య వ్రేలు క్రిందినుండి ప్రారంభించి బొటన వ్రేలి రెండు పర్వములను గలిపి కొని (౧౨) పండ్రెండవ సంఖ్య వరకు తొమ్మిది (౯) సార్లు జపించిన యెడల నూటాయెనిమిది (౧౦౮) జపము పూర్తియగును. ఇట్లు జపించు నప్పుడు ఆయా మంత్రాధిష్ఠిత దేవతను (తాను విశ్వశించిన) ఏకాగ్ర చిత్తముతో మనోనేత్రమునకు లక్ష్యముగా నుంచుకొని జపించవలెను. మంత్ర ఉచ్చారణలో 1. వాచక మనియు 2. ఉపాంశువనియు 3. మాన సికములని మూఁడు విధములుగా నుండును. వీనిలో నుత్తరోత్తరమైనదే శ్రేష్ఠమైనది.

ఇఁకమాలికా జపవిధము :- భోగాపేక్షగలవారు స్థూలమణి (శిఖామణి - మధ్యమణి)తో నారంభించి జపమాలికను క్రిందికి లాగవలెను. మోక్షాపేక్షయున్నవారు సూక్ష్మమణితో నారంభించి పైకి ద్రోయవలెను. అత్యంత వేగముగా గాని, అత్యంత మెల్లిగా గాని జపించగూడదు. జప కాలమున జపమాలికను మడి గుడ్డలో గుప్తముగా నుంచి జపించవలెను.

## అర్ఘ్య - పాద్య - ఆచమానములను గల్పు వస్తువుల వివరణము

1. పాద్యము :- తెల్లావాలు, కుంకుమ, కేసరి, గరిక, చంగల్వ కోష్ఠ, లావంచ, (సుగంధ వ్రేళ్ళు) పచ్చకర్పూరము.

2) అర్ఘ్యము :- దర్భ, తెల్లనువ్వులు, తెల్లగసాలు, జవగోధుమలు, వరి ధాన్యము, ఆవుపాలు.

3) ఆచమనీయము :- జాజికాయ, గంధ కచూరాలు, పచ్చకర్పూరము, చంగల్వకోష్ఠ, కుంకుమ, కేసరి, ఏలుకులు.

4) మధుపర్కము :- ఆవుపాలు, ఆవు పెరుగు, నెయ్యి, తేనె, శర్కర.

5) పంచామృతము :- ఆవుపాలు, ఆవుపెరుగు, ఆవు నెయ్యి, తేనె, శర్కర.

6) పంచగవ్యము :- గోమూత్రము, గోమయము, గోక్షీరము, గోదధి, గోఘృతము.

ఆచమనము జేయు క్రమము :- ఉద్ధరణితో కుడిచేతిలో గోధుమ గింజ మునుగునట్లు నీటినివేసికొని, ఆ నీటిని నాలుకతో స్పర్శించి చేయి కడుగు కొనవలెను.

1. మానసిక పూజ :- మనస్సు మరియు భావనామూలకమైన సమస్త పూజా ద్రవ్యములను సంకల్పించుకొని అనుసంధానము జేయు పూజ అంతరపూజయనబడును. (శివ మానస స్తోత్రములో జూడదగును.)

2. మరోవిధమైన పూజ :- ఆధారము, స్వాధిష్ఠానము, మణి పూరకము, అనాహతము, విశుద్ధి, ఆజ్ఞేయ, సహస్రార, శిఖ, మరియు పశ్చిమ చక్రములందు క్రమముగా ఆచార - గురు - శివ - చర - ప్రసాదము - మహాలింగము - ఇష్ట - ప్రాణ - భావలింగములను క్రమముగా శ్రద్ధాది భక్తితో, నిరహంకారము - సద్వాసన, నిర్మోహము, సుస్పర్శ - జ్ఞానము - శమ - దమ - శాంతి - ఆనందము - సద్భావన - తృప్తి - సద్గుణములను పూజాద్రవ్యములుగా మార్చుకొని పూజించునదే అంతరంగలింగార్చన యనబడును.

# నా రచిత గ్రంథద్వయ ప్రశస్తి

వి. సూ. :- నారచిత గ్రంథముల (పదింటి)లో నీదిగువ పేర్కొనబడిన రెండు గ్రంథములను గురించి "ఆనంద బృంద" అను సాహిత్య మాస పత్రిక తెలుగు (సంపుటి : 15, సంచిక : 7, 8,)లో నాకు దెలియని వారు నాయందలి వారికి గలిగిన అభిమానము సద్భావములతో సమీక్షించి యున్నారు. పఠితలు ఈ రెండు గ్రంథముల సమీక్షలను తప్పకుండ జదువగలరు.

ఆనందబృంద పుట సంఖ్య 14 నవంబరు-డిసెంబరు-1990
అధ్యాత్మిక గ్రంథ పరిచయము

## జగద్గురు శ్రీ రేణుకాచార్య చరితా మృతము

గ్రంథకర్త : పండితరత్న ధర్మనిరతి వేద॥ పం॥ పెద్దమఠము రాచవీరదేవర సంస్కృత తీర్థ(కలకత్తా) MOL తె (ఉస్మానియా) 19+4+118 పుటలు మూల్యము-20 రూ॥లు ప్రతులకు :- వీరశైవ గ్రంథమాల 3-3-139, కాచిగూడ, హైద్రాబాదు-500 027.

హిందీభూషణ, కన్నడజాణ, భాషప్రవీణ, బిరుదాంకిత శ్రీ పం॥ రాచ వీరదేవర పెద్దమఠంవారు భక్తిభావముతో తెలుగున వెలయించిన రేణుకా చార్యుల చరితామృతం 5 ఆశ్వాసాలకృతి-శివతత్త్వ శక్తి విశిష్టాద్వైత సిద్ధాంత అష్టావరణ పంచాంగ సామరస్య మహాత్మ్యములు సామాజికుల కుపయుక్తముగా సాహిత్యక్షేత్రాన ఒకసిధిగా వీరశైవ ఉద్వేగ ఉగ్రశక్తిగా - శివుని పంచముఖముల నుండి ఉద్భవించిన పంచాచార్యులు ప్రతియుగము నందునూ భూపథగామియై వీరశైవ అభ్యుదయ భావాలను విస్తరిల్ల జేసినవారిలో ప్రథముడు. శ్రీ రేణుకభగవత్పాదులు మన త్రిలింగదేశమందలి కొలనుపాక క్షేత్రంలోని సోమేశ్వర స్వయంభూ లింగమునుండి ఉద్భవించిన

వారలు. ప్రాచ్యకాలమునాటి శివాగమాలలో రేణుకుల ప్రసక్తి రామాయణ కాలంలో విభీషణ ప్రీత్యర్థం ముక్కోటిలింగములను అన్వేషణా శీలియగు రేణుకులు ప్రతిష్ఠించినట్లున్నది. మహాభారత గాథలోనూ క్రీ. శ. 8వ శతాబ్దికి చెందిన శ్రీపతి పండితుల శ్రీకరభాష్యము క్రీ.శ. 9వ శతాబ్ది సిద్ధ నాథుని సంస్కృత రేణుకవిజయము. ప్రథమ కన్నడ బసవేశ్వర చరిత్ర కర్త యగు 12వ శతాబ్దికి చెందిన హరిహరుడు రేణుకుల చరిత్రను గ్రంథస్థ మొనర్చారు.

శ్రీ కాశీనాథశాస్త్రి కన్నడమూలంలోని మౌళికాంశములను వినూత్న యుతమొనర్చి సాహిత్యంలోని హితాన్ని సామాజికస్ఫృహగా మలచిన సవ్యసాచి రాచవీరదేవర యిదొక స్వతంత్ర రచనగా స్ఫురింపచేశారు. తమ కుటుంబంకోసం బ్రతికేవారు సామాన్యులైతె సామాజంకోసం జీవించేవారు మేధావులు. వారిలో గాయకులు కవులు రచయితలు ప్రముఖులు. వీరశైవ ధర్మవ్యాప్తికై తమజీవితాన్ని అంకితమొనర్చిన శ్రీ రాచవీరదేవర రేణుకా చార్యుల చరిత్ర వాఙ్మయ చరిత్రలో చిరస్థాయిగా నిలచిపోగలదు.

—ఏ. సత్యనారాయణ, ధర్మావరం, అనంతపురం జిల్లా ఆం. ప్ర.

## ప్రాచీన వీరశైవము

కన్నడమూలము : వే॥ పం॥ చెన్నబసవశాస్త్రి (రాయచూరు) 4 + 14 + 108 పుటలు మూల్యము 20 రూ॥లు లెనుగు సేతః వే॥ పం॥ పెద్దమఠము రాచవీరదేవర తీర్థ సం॥ (కలకత్తా) MOL తె॥ (ఉస్మానియా) ప్రతులకు – వీరశైవ గ్రంథమాల 3-3-139, కాచిగూడ హైద్రాబాదు-500 027.

6 వేల యేండ్లకు పూర్వం తామ్రయుగమునకు ముందు నుండియే లింగార్చన యుండేదని సర్జాన్‌మార్షల్ పేర్కొనియున్నారు. భారతమందే

గాక రోం, యునాన్, మిస్రఅరబ్, ఫ్రాన్స్, జపాన్ చైనాలందునూ వీర శైవము వ్యాప్తిలో యుండి లింగరూప శిలావిగ్రహము పూజలందుకునేదనీ యిందుకు బైబిల్ నందలి "శివున్" పదమునుసాక్ష్యముగా పేర్కొనియున్నారు. కైలాసపతియగు శంకరుడు వీరశైవమతోత్పత్తికై శివాగమ ప్రమాణమును బట్టి..."రేవణో మరుల శైవ ఏకోరామః పండిత ఏవచ-విశ్వారాధ్య ఇతిప్రోక్తాః కలావపి మమప్రియే-74...వీరశైవమతోత్పత్తి హేతావై గాంశ్చ పంచకాసి-మమ్మభేచ్యః సముత్పాద్యత్తై రేవాకర్ష మంజసా-55" [వీరశైవ సదాచార సంగ్రహము-ప-1] ఈ పంచాచార్యుల నంపియున్నారు. K. H. హేరాస్ 'మొహంజొదారో'లో చిత్రించియున్నట్టి 2 రకాల క్లోడియు (కలయుటకూడు) అర్ధమునుదెల్పు పురుష ప్రకృతుల ఐక్యతకు సంకేతం కాగా-2 త్రికోణముల కలయికే షట్కోణముల భావన వ్యవహారికమునుబట్టి దీనినే షట్స్థల చిహ్నమనబడినది.

పారమేశ్వరా గమమునుబట్టి వీరశైవమే మహోత్కృష్టమైనది. ఆగమములు పేర్కొంటున్న వీరశైవ మతిప్రాచీనమైనదనియే అయ్యినూ యిది సాహితీజగాన ప్రాముఖ్యత నొందలేదు. ఇట్టి స్థితిలో వేదమంత్రార్థములు ఆగమ సిద్ధాంతాలు వీరశైవ ప్రముఖత్వాల ప్రచారణకు చారిత్రక ఆధారాలతో శ్రీ పం॥ రాచవీరదేవరగారి "ప్రాచీన వీరశైవము" ముచ్చటైన ముద్రణ చక్కని గెటప్‌లతో ఆస్తిక అదర్శవీరశైవ ధర్మాన్ని ఆసక్తికరంగా వెల్లడించినది-భావితరాలవారి భవితవ్యాన్ని ముందుగనే ఊహించి వారి అవసరాలకు తగ్గ మార్గదర్శక సూత్రాలను తమ రచనల ద్వారా వెల్లడించేవారే సంఘ సంస్కర్తలగు రచయితలు అట్టివారిలో ప్రథములు శ్రీ రాచవీరదేవర.

—ఎమ్. ఎస్. విజయకుమార్, ఆదోని, కర్నూలు జిల్లా, ఆం. ప్ర.

* * *

: హరః ఓం :

"పంచాచార్యః ప్రసీదంతు"

# లింగధారణ విధిః ప్రారంభః

శ్లో॥ వీరశైవ స్థితానాంచ, స్త్రీణాంగర్భాష్టమేగురుః।
పంచసూత్ర కృతం లింగం, ధారయేద్విధివచ్ఛుభం॥
అర్ధోదయేవాప్యథవా స్యాత్సూతనె చైవ దేశికః।
పూర్వం సంస్కారితంలింగం, శిశోః కంఠేచ ధారయేత్॥

తా॥ గురువు స్త్రీకి గర్భాష్టమమాసమందే లింగధారణ జేయవలెను.

శ్లో॥ లింగవృత్త సమాంపీఠం, దీర్ఘం విస్తారమేవచ।
తదర్ధం గోముఖంచైవ, పంచ సూత్రము దాహృతం॥

తా॥ ఈ ప్రకారముగా లింగ ధారణమొనర్చిన పిదప ఆ లింగమును విధి పూర్వకముగా ధరించవలెను. మరియు ప్రసవ కాలమునందుగాని, అథవా అర్ధపిండోదయ కాలమునందుగాని, మరియి భూపతమైన తరువాతగాని, ఈ మొదలే గర్భాష్టమ మాసమున ధరింపజేసిన లింగమును మరల సంస్కరించి దానినే శిశువు కంఠమునందు ఈ దిగువ వ్రాయబడిన లింగధారణ విధి మేరకు ధరించవలెను, ఇది సాధ్యముగాని పక్షమున శిశువు జన్మించిన 3. వ. దినమునందు తప్పకుండ లింగ ధారణ జేయవలెను. వీరశైవుల గృహములో శిశువు జన్మించిన 3. వ. దినములో శివపూజ గృహమును షట్సమ్మార్జనము గావించి రంగవల్లితో ముగ్గులువేసి, గురువేదికను సిద్ధపరచి సమస్త పూజాసామగ్రిని ఆయత్త పరచికొని, శ్రీగురువును రప్పించి, ఆ వేదికపై గూర్చుండబెట్టి,

పాదార్చన యొనర్చి అట్టి ధూళిపాదోదకమును గృహములోని అన్ని వైపుల ప్రోక్షించి ముందు ధరించబోవు పంచసూత్ర ఘటితంబైన లింగముపైన యొరచి ఆలింగముయొక్క పీఠము కదలకుండ భద్రముగ ఒక దారమును జుట్టి వేదిక (గద్దె)పై నిడుకొన వలయును. తదుపరి గురువు యొక్క కుడి ప్రక్కన క్రింద బియ్యమును బరచి ఒక కలశమును స్థాపించి ఆ కలశమునకు సూతికా గృహమునందలి శిశువు ఉండిన స్థానమునకు సూత్రమును దగిలించి (బంధించి) ఆ పిదప నాయింటి యెజమానిగాని అథవా ఇతరులెవరైనను సరె వారు గురువునకు సాష్టాంగ ప్రణామంబు నాచరించి గురువు ఏదుట గూర్చుండి దిగువ (క్రింద) అభిషేక పాత్రను బెట్టించి ధరింపజేయు లింగమును ఎడమ హస్తతలమున ఉంచి, పంచామృతము మున్నగు వాటితో ३ సార్లు అభిషేకమును జేసి భస్మము, గంధము, పత్రి, పుష్పము, అక్షతలు-ధూప-దీప-నైవేద్యాదులతో ३ సార్లు బూజింపవలెను.

## పంచామృతాభిషేకము (విధి)

గోక్షీరము, గోదధి, తేనె, గోఘృతము, శర్కర (చక్కెర) ఈఅయిదింటిని ఒక స్థాలి (పాత్ర)లో వేసి ఈ దిగువ మంత్రమును పఠిస్తు అభిషేకమును జేయించవలెను.

మంత్రము :- ఆప్యాయస్వసమేతుతే, విశ్వతః సోమవృష్ణియం ।
భవావాజస్య సంగథె ॥

"ఇతి పంచామృతేన స్నాపయామి"

ఇట్లు పంచామృతముతో నభిషేకించిన బిదప శుద్ధోదకముతో అభిషేకము సల్పవలెను.

మంత్రము :- సద్యోజాతం ప్రపద్యామి, సద్యోజాతాయవై నమోనమః భవేభవేనాతి భవే । భవస్వమాంభవోద్భవాయనమః ॥

"ఇతి శుద్ధోదకేనస్నాపయామి"

ఈ విధముగ శుద్ధోదకముతోనభిషేక మొనర్చి తదుపరి భస్మము, గంధము, అక్షతలు, పత్రి, పుష్పము, ధూపము, దీపము, నైవేద్యము, తాంబూలము, మొదలగు వాటితో ౫ సార్లు పూజించి తరువాత లింగమునకు ప్రాణ ప్రతిష్ఠ గావించవలెను.

## లింగ ప్రాణ ప్రతిష్ఠా విధి

పైన ఆదేశించిన ప్రకారముగా లింగమును పూజించిన పిదప ఈ దిగువ వ్రాయబడిన మంత్రములతో లింగమునకు ప్రాణప్రతిష్ఠ జేయవలెను.

మంత్రము :- ఓం అస్యశ్రీ శివ ప్రాణప్రతిష్ఠాపన మంత్రస్య బ్రహ్మ ఋషిః దేవీగాయత్రీచ్ఛందః ఓం బీజం, హ్రీం శక్తిః క్రాం కీలకం, శివలింగ ప్రాణప్రతిష్ఠార్థం । జపేనినియోగః । ఓం హ్రీంక్రాం, యం, రం, లం, వం, శం, షం, సం, హం, హంసః, అముష్యం ప్రాణయిహస్థితః । అముష్యజీవ ఇహస్థితః । అముష్య సర్వేంద్రియాణి. కాయ వాఙ్మనశ్చక్షుఃషో శ్రోత్రాజిహ్వాఘ్రాణ ప్రాణ ఇహై వాగత్యసుఖం చిరం తిష్ఠంతు స్వాహా ఇతి లింగ ప్రాణప్రాతిష్ఠాపనం కుర్యాత్ ॥

ఈ ప్రకారముగా లింగమునకు ప్రాణప్రతిష్ఠాపన యొనర్చి అట్టి లింగమును ఒక మడి వస్త్రమునందు బంధించి ఉంచి పిదప నాశిశువును మొదలు జుట్టిన సూత్రమును విడువకుండ దీసికొనివచ్చి గురువు

సమ్ముఖమున (ఎదుట) గూర్చుండవలెను. శ్రీగురువు ఆశిశువునకు పాదోదక పంచగవ్యాదులతో (పంచామృతముతో) సంప్రోక్షణయొనర్చి, శిశువు యొక్కనుదట భస్మమును ధరించి ఆ శిశువు యొక్క రెండు కర్ణములందును (చెవుల్లో) పంచాక్షరీ మంత్రమును జెప్పి ఈ దిగువ (క్రింది) వ్రాయబడిన మంత్రములతో శిశువు యొక్క కంఠమునందు లింగధారణమును జేయవలెను.

మంత్రము :- ఓం లింగధారణంత్రయోవేధాః శివలింగంధారయంతి తస్మాద్దేవా శివలింగంధారయంతి । యోవై లింగధారణంకుర్యాత్ । సమల్కా శోభవంతి । నస్వవచోభవతి, శుకాద్యాః లింగం ధారయంతి, అజ హరిప్రముఖాశ్శివలింగంధారయంతి । సురేంద్రాః దైత్యాః శివలింగంధారయంతి । తస్మాద్దేవా శివలింగంధారయంతి । యితఃప్రోవాచాధర్వణ శిఖా ఓం నమోబ్రహ్మణే లింగధారణం వేఽస్మిన్ నిరాకరణెధారయే ధాఃభూయాస్సంకర్ణయేశృతం । మాచ్ఛోర్ధ్వాం, మమాయుష్యం ఇత్యనేన మంత్రేణ శిశోఃకంఠే శివలింగంధారయేత్॥

ఆశీర్వాద మంత్రము :-

శిశువు కంఠమునందు లింగధారణమును గావించి, తరువాత గురువు శిశువునకు ఈ దిగువ (క్రింద) వ్రాయబడిన మంత్రముతో నాశీర్వదించ వలయును.

మంత్రము :- నమోనమో భవతిజాయ మానోన్వాం । కేతు రుష సామేత్యగ్రే భాగందెవేభ్యో, వితధ్యాయన్వచంద్రమాః స్థిరతర దీర్ఘమాయుః ॥ ఇతి వేదవాక్యే నాశీర్వాదం దద్యాత్ ॥

ఇట్లు ఆశీర్వదించిన పిదప పాదార్చనా విధి యందు చెప్పిన ప్రకారముగా గురువు యొక్క పాదార్చన గావించి, ఆ శిశువునకు పాదోదకము నొసంగి, మిగతా వారందరు స్వీకరించి, గణతృప్తి యొనర్చి, దక్షిణ తాంబూలములతో మహేశ్వరులను సత్కరించి వారిని సాగనంపవలెను.

ఇది లింగధారణ విధి సమాప్తము.

* *

## దీక్షావిధి ప్రారంభము

శ్లో॥ గర్భాష్టమే కృతా దీక్షా, సాముఖ్యో షోడశావధిః |
గౌణంతదూర్ధ్వమధమం, వీరశైవాన్వవాయినా ॥

తా॥ వీర మాహేశ్వరవటువులకు జన్మించిన ఎనమిదవ సం॥మునసే దీక్షా సంస్కారము (కారణాలు లేదా అయ్యాచారము)లు గఱుపుట అత్యంత శ్రేష్ఠమైన పద్ధతి. పదునారవ సం॥ము వరకు జేయుట మధ్యమము, ఆ తరువాత జేయు దీక్షా సంస్కారము అధమమైనది. అందుచేత ఎనిమిదవ సం॥మునసే దీక్షా సంస్కారము జేయవలెను.

శ్లో॥ ఉపదేశం స్వగోత్రాణాం, కర్తవ్యో గురుసత్తమైః |
ఉపసూత్రాణాంచ కర్తవ్యం, మహాసూత్రావ లంబికైః ॥

తా॥ గురుశ్రేష్ఠులు తమకు సంబంధించిన సూత్రము వారికే దీక్షోపదేశము జేయవలెను, స్వగోత్రములవారు సమయమునకు లభింపమి (దొరకమి) ఉపసూత్రము వారికి మహాసూత్రమువారు దీక్షా కార్యమును జేయవలెను.

శ్లో॥ పుష్పాక్షిం కర్ణఛిద్రంతు, బధిరం కలహప్రియం ।
వ్యాధిగ్రస్తమంగ హీనం, తస్యాచార వివర్జయేత్ ॥
అన్య(మ్య)తెజార జంకుండం, వ్రతే భక్తరి గోళకం ॥

తా॥ దీక్ష జేయబోవు వటువు యొక్క నేత్రములు, చెవులు, మొదలగునవి అంగవైకల్యముండుట, తండ్రియుండియు జారునకు బుట్టిన, విధవరాలికి జన్మించినట్టి, వటువునకు దీక్షాసంస్కారమును జేయగూడదు. ఈ మేరకు వటువు యొక్క అవయవములను చక్కగా బరిశీలించి దీక్షా సంస్కారమును జేయవలెను.

## దీక్షా సంస్కారము జేయు విధానము

మొదలు :- మఠములోనే గాని, అథవాతనగృహమునందే గాని, దీక్షోపదేశమును జేయవలెను. అది యెట్లనగా ఆ గృహములోని ఒక ఉత్తమ స్థానమున చతురశ్రపు మంటపమునువేసి, పదునారు స్థంబములతో గాని, పండ్రెండు స్థంబములతోగాని, అలంకరించి, చక్కగా చౌకముగా జేసి, దర్భ, ధ్వజము, ఘంట, తోరణము, పుష్పమాలా, మామిడాకులు మొదలగు వాటితో నలంకరించబడిన మండపమును సిద్ధగింపజేసి. అట్టి మంటపము యొక్క మధ్యభాగములో గుండ్రని యాకారమున గోమూత్రము, గోమయము, మొదలగు పంచగవ్యములతో సమ్మార్జన మొనర్చి, రంగవల్లి ముగ్గులను బరచి, పిదప నాచార్యులు. రుద్రసూక్తములతో సమస్త అంగములందు భస్మమును ధరించి, రుద్రాక్షలను ధరించి, పంచకలశములను స్థాపించవలెను. ఆవిధానమెట్టిదనిన, పంచా చార్యులలోనేఆచార్యుడైతే గురువేదిక (గద్దుగె) పై గూర్చుండి యుంటాడో అట్టి ఆచార్యుడె వటువుకు గురువు అవుతాడు. మిగతా నలుగురు ఉపదేశమునకు సాక్షి

త్రాతముగా నుందురు. తరువాత ఆ వేదికపైన గురువు బియ్యమును బరచి, దానిపై మధ్యభాగములో తనకు సంబంధించిన కలశమును స్థాపించవలెను. మిగత నాలుగు కలశములను స్థాపించి, ఇట్టి పంచ కలశములకు దారమును (సూత్రమును) జుట్టి ఆ కలశములలో పాదోదక మిశ్రితమైన నీరును నింపి. మామిడి ఆకులను, గరికను, పోకలు, అరటిపండ్లు, తమ్మలపాకులను, మున్నగువాటితో నలంకరించి రత్నములను (రజత రూప్యములను) అందుంచి, పిదప నాకలశములను, భస్మము, గంధము, పుష్పాక్షకలతో విధ్యుక్తముగా భూజించి నైవేద్యము, తాంబూలము, దక్షిణ మొదలగునవి. క్రొత్తబట్టలలో బాపతులను (హక్కు) గట్టిఉంచి ఒక క్రొత్త వస్త్రమును పంచకలశముపైన గప్పి, ఈ విధముగ సిద్దగించి, తరువాత దీక్షను స్వీకరించె శిష్యుడు తన హస్త ద్వయ సమన్వితుఁడై పూర్ణ కుంభమును గ్రహించి, పరిశుద్ధమగు వస్త్రములను దాల్చి విభూతితో గూడిన ఫలపుష్పాదులను దీసికొని, భయభక్తియుక్తుడై గురు సమీపమునకు వచ్చి, సాష్టాంగ ప్రణామంబు నాచరించవలెను. ఆ శిష్యుని పక్షమున ఈ విధముగ చెప్పించవలెను.

"ఓ గురూ ! నేను పాప సహితుఁడను. నన్ను ఈ పాపము నుండి యెడము సేయుము. (పాపముక్తుడిని జేయుము) ఓ దయా సాగరా ! నా హృదయమున గురు చిహ్నము లంకురించినవి. కావున నో దేవా దయామయా ! నాకు ముక్తి నొసఁగు మంత్రమును బోధించి సంసార సాగరమునుండి తరింపఁజేయుము. అని ఈ విధముగా చెప్పించవలెను. ఆ మీదట శిష్యుని హస్తతలమునందు దర్భ ఉంగరమును గట్టిన సూత్రమును (దారమును) బట్టించి, గురువు లింగమును, మరియు శిష్యుని పంచగ వ్యాదులతో పరిశుద్ధుడిని గావించి, మొదలు శిష్యుని హస్తమును ఆతని మస్తకమును బూజించి, తరువాత లింగపూజను క్రమముగా ఏడుమారులు.

హస్తమునకు మరియు ఏడుమారులు, మస్తకమునకు ఏడుమారులు, బూజించి, మరల లింగమునకు ఏడుమారులు, ఇట్లు ఇరువది యొక్క పూజలను విధ్యుక్తముగా పదునొకండు స్థాలిలలో (పాత్రలలో-గ్లాసుల్లో) మిశ్రిత మొనర్చిన వస్తుసామగ్రితో క్రమముగా నీదిగువఁదెల్పిన విధముఁగా నాయాయామంత్రోచ్చారణలతో బూజ జేయించినంతరము నలుగురు ఆచార్య పుంగవులతో నామోదమును బడసిన వాడై. శ్రీగురువు పంచాక్షరీ మంత్రమును దన శిష్యునికి యుపదేశించి, అట్టి లింగాన్ని కంఠమునందు ధరించి, పాదతీర్థము నొసఁగి, దర్భ సహితముగా సూత్రమును కంకణముగాఁజేసి, కుడి ముంజేతికిగట్టి దండ-కమండల (జోలెను)మును జేతికిచ్చి భిక్షాటనజేయు వర్సిందిగా నాదేశించి అక్కడికాసమయములో ఉపస్థితులైయున్న భక్తమాహేశ్వరుల నుండి భిక్షనడిగి గురువునకు సమర్పించి నమస్కరించి వెళ్ళవలెను.

ఈ ప్రకారముగా మిగత శిష్యులకు నాచరింపఁజేసి మధ్యాహ్నము గణ తృప్తి జేయించవలెను.

## 3. వ.ది. లింగార్చనా విధిః

శ్రీ మద్విభూతి రుద్రాక్షలను మేనదాల్చి, పంచాక్షరీ జప పరాయణుడైయున్న లింగధారి. ప్రతిదినము తన ఇష్ట లింగమును విధ్యుక్త ప్రకారముగా బూజించవలయును. లింగ పూజాసక్తుడు మొదలు జలము పత్రి పుష్పాక్షతాదులను సంగ్రహించుకొని (సిద్ధపరచుకొని) పిదప స్నానముజేసి, మడివస్త్రములను ధరించి నీటితో నింపిన చెంబును ఎడమ చేత బట్టుకొని కుడిచేత అందులోని నీరును శివపూజాగృహము వరకు సంప్రోక్షణము జేసూ వెళ్ళి ఆసనమును యథారీతిని బూజించి దానిపై గూర్చుండి ప్రథమలింగార్చన కొరకు సంకల్పమును బఠించవలెను.

సంకల్ప మంత్రము :- "మమకాయిక, వాచిక, మానసిక, జ్ఞాతాఽజ్ఞాత సకల పాప విమోచనార్థం, శివభక్తి, శివజ్ఞాన సంపద భివృద్ధ్యర్థం శ్రీమద్గురు, జంగమప్రసాసిద్ధ్యర్థం, శ్రీ మత్ప్రాణలింగ, భావలింగ, అధిష్ఠాన శ్రీమదిష్టలింగ పూజామహంకరిష్యే"

-: అథవా :-

హరః "ఓం, శివశివ శంభోరాజ్ఞేయ ప్రవర్తమానస్యాద్యబ్రహ్మణః ద్వితీయ పరార్థే శ్వేత వరహ కల్పే వైవస్వతమన్వంతరే కలియుగె ప్రథమ పాదే జంబూద్వీపే మేరోర్దక్షిణదిగ్భాగే భరతఖండే, భారతవర్షే దండకారణ్యే శ్రీశైలస్య ఈశాన్య ప్రదేశే గంగా గోదావర్యోర్మధ్యదేశేదక్షిణకూలె శాలివాహనశకె శ్రీవీరభద్రావతారె శివక్షేత్రే అస్మిన్ వర్తమానే స్వస్తిశ్రీ వ్యవహారిక చాంద్రమానె ప్రభవాదిషష్ఠి సంవత్సరాణాం మధ్యే అస్మిన్( ) వత్సరే, అస్మిన్( ) ఆయనె, అస్మిన్( ) మాసె, అస్మిన్( ) పక్షే, అస్మిన్( ) వాసరే, అస్మిన్( ) నక్షత్రే, అస్మిన్( ) యోగే, అస్మిన్( ) కరణే, ఏవం గుణయుక్తాయాం, అస్మిన్( ) శుభతిథౌ, అస్మిన్ ( ) గోత్రోత్పన్నోఽహం మమ ఉపాత్త దురితక్షయ ద్వారా శ్రీ పార్వతీపరమేశ్వర ప్రీత్యర్థం శ్రీ గురు-లింగ-జంగమ ప్రసాదసిద్ధ్యర్థం శ్రీమదిష్టలింగ-ప్రాణలింగ-భావలింగ-పూజా మహాంకరిష్యే॥

ఈ విధముగా సంకల్పమును బఠించి పిదప లింగాభిషేకమును జేసికొనవలెను. తన ఇష్టలింగమును ఎడమ హస్తమందు లింగముయొక్క గోముఖమును ఎడమచేతి బొటనవ్రేలి వైపున ఉంచి ఒక తాలి(గ్లాసు) లేదా పాత్రలో భస్మోదకమును జేసికొని అభిషేకమును జేసికొనవలెను.

# అ భి షే క ము

మంత్రము :- హరః ఓం సద్యోజాతం ప్రపద్యామి, సద్యో జాతాయవై నమోనమః। భవేభవేనాతిభవే, భవస్వమాం భవోద్భవాయ నమోనమః ॥ వామదేవాయనమః, జ్యేష్ఠాయనమః, శ్రేష్ఠాయనమః, రుద్రాయ నమః, కాలాయ నమః, కలవికరణాయ నమః, బలాయనమః, బలవికరణాయ నమః, బలప్రమథాయనమః, సర్వభూత దమనాయనమః, మనోన్మనాయ నమః, అఘోరేభ్యోఽథ ఘోరేభ్యోఘోరఘోరతరేభ్యః, సర్వేభ్యోఽథ సర్వసర్వేభ్యోనమస్తే అస్తురుద్రరూపేభ్యః ॥ తత్పురుషాయ విద్మహే, మహాదేవాయ ధీమహి, తన్నోరుద్రః ప్రచోదయాత్ । ఈశానః సర్వ విద్యానా మీశ్వరస్సర్వభూతానాం। బ్రహ్మాధిపతి, బ్రాహణోధిపతి, బ్రహ్మ శివోమేఅస్తు సదాశివోం శాంతి శ్శాంతి శ్శాంతిరస్తు॥ ఈ మంత్రముచేత అభిషేకమును జేసికొని భస్మమును ధరించవలెను.

భస్మధారణ మంత్రము :- (ముందుగా పదునొకండు స్థాలిలలో అర్ఘ్య-పాద్య-ఆచమనాదులకు సంబంధించిన వస్తు సామాగ్రిని శుద్ధోదకములో గల్పి ఉంచుకోవాలి)

వి. సూ. | ఇది విశేష అర్చనా విధానమునకు మంత్రములను విస్తరించాను
| ఇందులో దన కనుకూలముగా అభిషేకించుకోవాలి.

( వి శే షో ప చా ర ము )

1) ఆవాహన మంత్రము :-

"ఆగచ్ఛ దేవదేవేశ, తేజోరాశే జగత్పతే ।
క్రియమాణాంమయా పూజాం, గృహాణ సురసత్తమ॥

(ఆవాహయామి)

2) ఆసన మంత్రము :-

"నానారత్న సమాయుక్తం, కార్తస్వర విభూషితం ।
ఆసనందేవ దేవేశ, ప్రీత్యర్థం ప్రతి గృహ్యతాం॥
(ఆసనార్థే బిల్వపత్రిం సమర్పయామి)

3) పాద్య మంత్రము :-

"యద్భక్తి లేశసంపర్కాత్పర మానంద సంభవః ।
తస్మైతే చరణాబ్జాయా, పాద్యం శుద్ధాయ కల్పయే" ॥
(ఇతి పాద్యం సమర్పయామి)

4) ఆర్ఘ్య మంత్రము :-

"తాపత్రయ హరందివ్యం, పరమానంద లక్షణం ।
తాపత్రయ వినిర్ముక్త్యై, తవార్ఘ్యం కల్పయామ్యహం" ॥
(ఇతి అర్ఘ్యం సమర్పయామి)

5) ఆచమన మంత్రము :-

"వేదానామపి వేదాయ, దేవానాం దేవతాత్మనె ।
ఆచమ్యం కల్పయామీశ, శుద్ధానాం శుద్ధి హేతవే ॥
(ఇతి ఆచమనీయ సమర్పయామి)

6) స్నాన మంత్రము :-

"గంగా సరస్వతీరేవా, పయోష్ణి నర్మదాజలైః ।
స్నాపితోఽసిమయాదేవః, తథాశాంతి కురుష్వమే॥
(శుద్ధోదకేన స్నాపయామి)

7) ఆసన మంత్రము :-

"నానారత్న సమాయుక్తం, కార్తస్వర విభూషితం ।
ఆసనం దేవదేవేశ, ప్రీత్యర్థం ప్రతిగృహ్యతాం ॥
(ఆసనార్థే బిల్వపత్రం సమర్పయామి)

8) మధుపర్కం మంత్రము :-

"సర్వకాలుష్యహీనాయ, పరిపూర్ణ సుఖాత్మనే
మధు పర్కం మహాదేవా, కల్పయామి ప్రసీదమే" ॥
(ఇతి మధుపర్కం సమర్పయామి)

9) పంచామృత మంత్రము :-

"ఆప్యాయ స్వసమేతుతె, విశ్వతః సోమవృష్ణియం ।
భవా వాజస్య సంగథే" ॥
(ఇతి పంచామృతేన స్నాపయామి)

10) భస్మోదక మంత్రము :-

"త్ర్యంబకంయజామహె, సుగంధిం పుష్టివర్ధనం ।
ఉర్వారుకమివ బంధనాత్ మృత్యోర్మోక్షీయ మామృతాత్" ॥
(ఇతి భస్మోదకేన స్నాపయామి)

11) గంధోదక మంత్రము :-

"తదేవ శుక్రమమృతం, తద్బ్రహ్మ తదాపస్సప్రజాపతిః ।
సర్వేనిమేషా జజ్ఞిరేవిద్యుతః, పురుషాదధికలాముహూర్తాః
కాష్ఠాశ్చాహోరాత్రాశ్చ సర్వశః" ॥
(ఇతి గంధోదకేన స్నాపయామి)

12) పుష్పోదక మంత్రము :-

"యాఃఫలినీర్యా అఫలా, అపుష్పాయాశ్చ పుష్పిణీః ।
బృహస్పతి ప్రసూతాస్తానో, ముంచంత్వగ్ంహసః ॥
(ఇతి పుష్పోదకేన స్నాపయామి)

13) స్వర్ణోదక మంత్రము :-

"ఋతగ్ంసత్యం పరంబ్రహ్మ-పురుషం కృష్ణపింగళం ।
ఊర్ధ్వరేతం విరూపాక్షం-విశ్వరూపాయవై నమోనమః ॥
(ఇతి స్వర్ణోదకేన స్నాపయామి)

14) రత్నోదక మంత్రము :-

"సహిరత్నానిదాశుషే - సువాతి సవితాభగః ।
తంభాగం చిత్రమీమహె ॥
(ఇతి రత్నోదకేన స్నాపయామి)

15) మంత్రోదక స్నాన మంత్రము :-

"తరత్సమందీధావతి, ధారాసుతస్యాంధసః ।
తరత్సమంధీ ధావతి" ॥
(ఇతి మంత్రోదకేన స్నాపయామి).

16) వస్త్ర సమర్పణ మంత్రము :-

"మయాచిత్ర పటచ్ఛన్న-నిజగుహ్యోరు తేజసె ।
నిరావరణ విజ్ఞాన-వస్త్రంతే కల్పయామ్యహం ॥
(వస్త్రం సమర్పయామి)

17) యజ్ఞ సూత్రము :-

"దేవదేవ సమస్తేస్తు - త్రాహిమామేవ సాగరాత్ ।
బ్రహ్మసూత్రం సోత్తరీయం - గృహాణ పరమేశ్వర॥
(యజ్ఞ సూత్రం సమర్పయామి)

వి.సూ. :- ఒక పాత్రలో పాదోదక మిశ్రితముజేసిన శుద్ధోదకముచేత ఆయా యా మంత్రముల తరువాత ఈ శుద్ధోదకముతో నభిషేకించాలి. ఆ పిదప భస్మ-గంధ-అక్షత-పత్రి-పుష్పాదులతో పూజించాలి.

## 4. వ. ది. పాదపూజా విధానము

ప్రతి యొక్క వీరశైవుడు ఈ మొదలు వివరించిన ప్రకారముగా ప్రతి దినము తప్పకుండ లింగార్చన జేసికొని, పరిశుద్ధుడైన సద్గురువును తన గృహమునకు రప్పించుకొని, వేదికపై గూర్చుండబెట్టి ఆ గురువు యొక్క పాద ప్రక్షాళన మొనర్చి, మొదట ధూళిపాదోదకమును స్వగృహ మంతటను సంప్రోక్షించి పిదప నా పాదములను మడిగుడ్డతో బాగుగా తడియొత్తి, గురువు ఎదుట సమస్త పూజా ద్రవ్యములను (నీరు-భస్మము-గంధము-అక్షతలు - పత్రి - పువ్వులు - ధూప - దీప - నైవేద్యములను) సమకూర్చుకొని, ఒక గ్లాసు (పాత్ర) నిండ నీరును దీసికొని, అందులో మంగళకరమైన (ఓం) అను ప్రణవమును వ్రాసి, ఆ పాత్రను పూజించి తరువాత నా గురుమూర్తి యొక్క పాద ద్వయమును ఆ నీటి పాత్రపై నుంచి తన ఐదు వ్రేళ్ళతో

మంత్రము :- ప్రథమం భస్మ సంస్పృత్య-ద్వితీయం మంత్రసం యుతాః
తృతీయం పాదస్పర్శంచ - త్రివిధోదక మితిస్మృతాః ॥

అను విధముగా వెనుక మడమ నుండి కుడిపాదాంగుష్ఠము వరకు ౩ సార్లు ఎడమ పాదాంగుష్ఠము వరకు ౩ సార్లు ఉదకమును స్పర్శించి,

అట్టి పాదోదక పాత్రను (గ్లాసును) ప్రత్యేకించి ఉంచి, పిదప గురువు యొక్క ఇష్టలింగమును బూజించి, తరువాత పాదపూజను జేసికొనవలెను.

మంత్రము :- "అంగుష్ఠే భావయే ద్రుద్రం, తర్జన్యాం శంకరం స్మరేత్।
మధ్యమేచ మహాదేవం అనామికాయాం త్రియంబకం ।
కనిష్ఠే కామనాశంతు, పాదోపరి కపర్దినం ॥
పాదాధః పంచవదనం, గుల్ఫయోర్భీమభర్గకా ।
సర్వం లింగమయం ధ్యాత్వా, పాదం జంగమలింగినః" ॥

ఈ విధముగా భావించి తన ఎడమ హస్తమందు "ఓం" కారప్రణవముము వ్రాసికొని, గురువు యొక్క రెండుపాదములను ఎడమ హస్తముపై ఉంచుకొని, గురువు యొక్క కుడి పాదమును 5 వ్రేళ్ళపైన, ఎడమపాదము 5 వ్రేళ్ళపైన (నమఃశివాయ) అను పంచాక్షరములను వ్రాసి, పాదాంగుష్ఠముల మధ్యలో (ఓం బసవ) అని వ్రాసి, ఆ గురుమూర్తి పాదములను భస్మము, గంధము, పత్ర పుష్పాక్షతాదులతో పూజ యొనర్చి, ముమ్మారు నమస్కారము గావించి, మంగళాష్టకముల నుచ్చరిస్తు కర్పూరముతో నీరాజనలు మొనర్చి, టెంకాయనుగొట్టి నైవేద్యమును నివేదించి తదుపరి ధరించిన పుష్పములను దీసి మరల నమస్కార మొనర్చి క్రియాగిన్నెలో భస్మముతో షడక్షరీ మంత్రమును (ఓం నమశ్శివాయ) వ్రాసి ప్రత్యేకముగా ఉంచిన పాదోదకపాత్రను జేతిలోకి దీసికొని కుడి పాదాంగుష్ఠముపై ఆరుసార్లు. "షడక్షరిమంత్రము" చేత ఈ పాదోదకమును ఎరచి, తదుపరి ఎడమ పాదాంగుష్ఠముపైన 5 సార్లు పంచాక్షరీమంత్రముతో ఎరచి, ఆ మీదట పాదాంగుష్ఠముల రెండిటి మధ్యన 3 సార్లు (బసవా) అను మంత్రముతో పాదోదకమును ఎరచి (పోసి-వడ్డించి) బాగుగా ద్రవమును దూడ్చి, ఒకే ఒక పుష్పాన్ని సమర్పించి

పాదాంగుష్ఠములపైన బెట్టి పూజించి నమస్కరించి, క్రియా పాదోదకము యొక్క పాత్రను (గిన్నెను) చేతితో మూసి యుంచుకొనవలెను. తరువాత గురువు ఆ వ్రేళ్ళతో శివమంత్రము నుచ్చరించుచు పాదోదకమును 3 సార్లు తన లింగముపై యెరచి (పోసి-వడ్డించి) సావధానముతో స్వీకరించవలెను.

ఆ పిదప మిగత శిష్యులు.

## అథ గురు ప్రార్థన

"హరహరా ! కాలహరా ! కర్మహరా !
దురితహరా ! మహ ప్రసాద, పూర్వజన్మ-
కర్మ నివారణ, దీక్షా గురో, మోక్షా గురో;
గురోర్గురో, పరమగురో, పరమారాధ్య,
భో ! మహాస్వామిన్ ! ప్రసీద, భవతః,
పాదపద్మయోః, సాష్టాంగ నమస్కారం, కరోమి,
దేహి తీర్థ స్వీకారార్థం అనుజ్ఞాం ॥

అని ప్రార్థించి ప్రణామం బాచరించి, పాదతీర్థమును స్వీకరించవలెను. అక్కడున్న వారందరు ఇదేవిధముగా ప్రార్థించి సాష్టాంగ ప్రణామం బాచరించి పాద తీర్థమును స్వీకరించవలెను.

శ్లో॥ ఉచ్ఛిష్టం కల్ప్యతే తస్మిన్, సోయాతినరకార్ణవం ।
గంగా ఇవ పవిత్రంతు, నిత్యం కైవల్యదాయకం ॥

తా॥ ఎవరైతే ఇట్టి పవిత్రమైన పాద తీర్థమునందు ఉచ్ఛిష్టమని (ఎంగిలి అని) భావింతురో అట్టివారు తప్పకుండ నరకమును బొందుదురు. ఈ పాదతీర్థము గంగా తీర్థమునకంటెను పవిత్రమైనదిగాను, శాశ్వతమైన ముక్తి నొసఁగునదిగాను, భావించవలెను.

ఇది పాదపూజా విధానము సమాప్తము.

# 5. వ.ది. వివాహవిధి ప్రారంభము

లగ్న కార్యమును జరిపే గృహములో యోగ్యమైన (పరిశుద్ధమైన) స్థలమునందు వివాహ మంటపమును నిర్మించి, ఆ మంటపములో గోమయముతో సమ్మార్జనము (అలికి) రంగవల్లి ముగ్గులతో నలంకరించి, దాని మధ్యభాగమున బియ్యము పరచి, పంచ కలశములను స్థాపించి, పిదప నా కలశములను మామిడి యాకులతో బొందుపరచి, దారముతో కలశములకు జుట్టి అందుండి ఒక సూత్రమును గురువు గూర్చుండే వేదిక (గద్దెగె) వరకు మరో సూత్రమును పెండ్లిపిల్లలు గూర్చుండే స్థలమునకు దీసికెళ్ళి అట్టి సూత్రములకు దర్భ ఉంగరములను గట్టి సిద్ధగించి మంత్రోకముచేత ఆ కలశములను నింపి, క్రొత్త వస్త్రముతో గప్పి యుంచవలెను. తరువాత ముత్తయిదువలు వచ్చి పెండ్లిపిల్లలు గూర్చుండిన చోట ఒక కంబలము (గొంగడిని) బరచి దానిపై తెల్ల ఆవాలు కొద్దిగా వేసి వధూవరులను తోడ్కొని వచ్చి కలశము ఎదుట గూర్చుండబెట్టి మఠాధికారులు కలశమునకు గప్పిన వస్త్రమును దీసి సూత్రమును వరుని చేతికిచ్చి వధువు హస్తమును వరుని చేతిక్రింద ఉంచి, మంత్రోక్తముగా హస్తపూజ కంకణపూజ యొనర్చి, తరువాతక్రమముగా దశకర్మలను ఆచరింప జేయవలెను.

శ్లో॥ తదేవలగ్నం సుదినం తదేవా। తారాబలం చంద్రబలం తదేవా।
విద్యాబలం దైవబలం తదేవా। గౌరీపతే తేంఘ్రియుగం స్మరామి॥

ఈ మంత్రమును లగ్న కార్యము పూర్తి అయ్యేవరకు చెప్పవలెను.

## ౧ కంకణధారణ విధి

రెండు మూడు కొమ్మలుండిన, భిన్నముగాని పసుపుకొమ్మను దీసికొని కలశమునకు జుట్టిన దారముతో కంకణమును సిద్ధగించి పూజించి

మంత్రము :- "వివాహకర్మ కర్తుమాదౌ శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం
కౌతుక బంధనం కరిష్యామి ॥

మంత్రము :- సర్వకాలె మహానాథ, భక్తిరస్తు క్రతోమమ ।
తస్మాబద్ధ్వాః కంకణశ్చ, నిశ్చయం శివసాక్షితః ।
కాశ్మీరే వసతెకన్యా, లంకాయాం వసతె వరః ।
అకటో వికటశ్చైవ, గురుద్బధ్నాచకంకణం ॥

ఈ మంత్రముతో వధూవరులకు కంకణమును ధరింపజేయవలెను.

వధూవరులకు బాసింగధారణ మంత్రము :- "శుభకే శిరఆరోహ శోభయంతి ముఖం మమ। ముఖగ్ంహిమమశోభయా-భూయాగ్ం సంచభగంకురు॥ ఇతి శుభసూచకం (ఫాలఫలకంధారయామి)

మదుపర్కం :- కన్యార్థినె గృహమాగతాతాయాస్మైవరాయ కన్యాదానాంగ భూత మధుపర్కం మధుపర్కం కరిష్యే ॥ "పాద్యం, పాద్యం, పాద్యం ప్రతిగృహ్యతాం" అర్ఘ్యం, అర్ఘ్యం, అర్ఘ్యం ప్రతిగృహ్యతాం ఆచమనీయం, ఆచమనీయం ప్రతిగృహ్యతాం॥

## ౨ వ. ది. గుడజీరక మంత్రము

మంత్రము :- సత్యేనోత్తభితా భూమిః । సూర్యేణోత్తభితాద్యౌః ॥
భూతేనా దిత్యస్తిష్ఠంతి । దివిసోమో అధిశ్రితః ॥

ఇతి మంత్రేణ వధూవర కరయోః గుడజీరకం సంస్థాప్య, శిరసి సంప్రోక్షయేత్ ॥ ఈ మంత్రము నుచ్చరిస్తు వధూవరుల హస్తములందు జిలుకర-బెల్లమును బెట్టి ఉభయుల శిరస్సులం దుంచవలెను.

## కన్యాదానము జేయు క్రమము

కన్యాదానము జేయు వరుని అత్తమామలిద్దరు గల్సి శుద్ధోదకమున బిల్వదళము, గరిక, అక్షతలువేసి, కలమునుబట్టి దిగువ (క్రింది) భాగములో ఒక పాత్రను ఉంచి వరుని కుడి యరచేతిపై వధువుయొక్క రెండు చేతులను బెట్టించి అత్తమామ లుభయులద్వారా

మంత్రము :- అహం కన్యాం సంప్రదదే,

శ్లో॥ కన్యాం కనకసంపన్నాం, సర్వాభరణభూషితాం ।
దాస్యామిశంభవేతుభ్యం, శివలోకం జిగీషయా ॥
దేవభక్తర్గణోర్మధ్యే, అశేషజన సమ్మతం ।
స్వపుత్రీం దీయతెదత్తం, దారాదత్తస్తు నిశ్చయం ॥
మమవామ పార్శ్వేతిష్ఠతాం, మమదక్షిణ పార్శ్వేతిష్ఠతాం,
ఆగతాయోవరాయ సువర్ణపూర్వకం దక్షిణపూర్వకం
జలధారా పూర్వకం, నకుసుమ, బిల్వదళసాక్షేణ-
కన్యాదానం కరిష్యే ॥

ఈ సంకల్పముతో జలధారను విడువవలెను. ఇమాం కన్యాం ప్రతి గృహ్ణామి, అని వరునిచేత జెప్పించి రెండుసార్లు ధారను వదలవలెను.

## 3 వ. ది. మాంగల్యధారణము

శ్రీ పార్వతీ మహాలక్ష్మీశచీభ్యో నమః, ధ్యాయామి ।
ధ్యానం సమర్పయామి । (మంగళసూత్రమును పూజించి)

శ్రీ పార్వతీ నమస్తుభ్యం, శ్రీ కంఠప్రియ భామినీ ।
వివాహభాగ్య మారోగ్యం, పుత్రలాభంచ దేహిమె ॥

మంత్రము :- "సర్వమంగల మాంగల్యే, శివే సర్వార్థసాధకే ।
శరణ్యే త్ర్యంబకాదేవి ! నారాయణీ నమోఽస్తుతే ॥
ఇట్లు ప్రార్థించి

మంత్రము :- మాంగల్యతంతునానేన, మమజీవన హేతునా ।
కంఠేబధ్నామిసుభగే, త్వంజీవ శరదాంశతం ॥

యదా బధ్నందాక్షాయణీ హిరణ్యంస దేవేషు కృణుతే దీర్ఘమాయుః॥ అని మంత్రము నుచ్చరిస్తు ముత్తయిదువలతో ముట్టించి వరునిచేత మంగళసూత్రమును వధువు మెడలో గట్టించవలెను.

పాణిగ్రహణ మంత్రము :- "ప్రతిగృహితామస్యాం భార్యాత్వసిద్ధియే ఉమామహేశ్వర పూజాం కరిష్యే ॥ వ్యోమ వ్యోమాయ విద్మహె సూక్ష్మ సూక్ష్మాయ ధీమహి । తన్నో శివ ప్రచోదయాత్ "ఓం గృహ్ణామితే సౌభాగత్వాయ హస్తం మయాపత్యాజరదష్టిర్యథాసః । భగో అర్యమాసవితా పురంధిర్మహ్యంత్వా దుర్గార్హపత్యాయ దేవాః ॥

## ౪వ. డి. ఆజ్య క్షీర మంత్ర క్రమము

మంత్రము :- భర్తా స్వక్రీయ మాణోఽపి, క్షీరాజ్య స్పర్శనం భవేత్ ।
పాత్రేక్షీ రాజ్య సంయుక్తం, వాక్కికాన్యేషణం వదేత్ ॥
సాక్షిణ్యాస్సర్వ దేవాశ్చ, తరుగుల్మలతాదయః ।
పశుపక్షిమృగాద్యశ్చ, సాక్షిసాక్షిప్రమాణయోః ॥
తవసంరక్షణార్థంచ, తవమానస పాలనే ।
క్షీరశర్కరహస్తంచ, సాక్షిత్వాం పాలయామ్యహం ॥
తవభక్తి మహాశ్రద్ధా, తవపూజా పరాయణే ।
తవధ్యానామరక్తాహం, నిశ్చయం శృణునిశ్చయం ॥

ఒక పాత్రలో ఆవుపాలు, నెయ్యివేసి, మూఁడుసార్లు వధువరుల హస్తములను పైన జెప్పిన మంత్రము నుచ్చరిస్తు అద్దించవలెను. ఆ మీదట అదే పాలు నెయ్యిలో ఒక ముత్యమును వేసి మూడు సార్లు వరునితో వధువుతోను వెదకించి పేర్లు చెప్పించవలెను.

## ౨౫. సప్తపది పాద సంఘట్టన మంత్రము

మంత్రము :- ఏకపదీ చద్విపదీ త్రిపదీచ. చతుష్పదీ వధూవతా పంచపదీచ।
పాదోత్థాపన మాచరేత్ ॥

మంత్రము :- "ఇష ఏకపదీభవ సామామనువ్రతాభవ ।

1) పుత్రాన్విందావహై, బహూంస్తే సంతు జరదష్టయః ॥౧॥

2) మం॥ ఊర్జే ద్విపదీభవ సామామనువ్రతాభవ ।
పుత్రాన్విందామహై - బహూంస్తే సంతు రజరదష్టయః॥ ॥౨॥

3) రాయస్పోషా త్రిపదీభవ సామామనువ్రతాభవ ।
పుత్రాన్విందామహై-బహూంస్తే సంతు జరదష్టయః ॥ ॥౩॥

4) మాయోభవ్యాయ చతుష్పదీభవ సామామనువ్రతాభవ ।
పుత్రాన్విందామహై - బహూంస్తే సంతు జరదష్టయః ॥ ॥౪॥

5) ప్రజాభ్యః పంచపదీభ - సామామనువ్రతాభవ ।
పుత్రాన్విందామహై - బహూంస్తే సంతు జరదష్టయః॥ ॥౫-

6) ఋతుభ్యః షట్పదీభవ - సామామనువ్రతాభవ ।
పుత్రాన్విందామహే - బహూంస్తే సంతు జరదష్టయః॥ ॥౬॥

7) సఖా సప్తపదీభవ - సామామనువ్రతాభవ ।
పుత్రాన్విందామహే - బహూంస్తే సంతు జరదష్టయః॥ ॥౭॥

వధూవరులకు ఆపోహిష్టా దర్భతోనీరు ప్రోక్షించి

మంత్రము :- "అనాధృష్టమిత్యస్య వామదేవ ఆపోబృహతీ ఉదకాభి మంత్రణే వినియోగః" (అనాధృష్టమస్య నాదృష్యం దేవానాణో౽ మోఖి శస్తిపాః । అనభిశస్త్యంజసాహసత్యముపగేషస్వితే మాధాః) ॥ గరిక, దర్భలతో వధూవరుల తలపైన ప్రోక్షించాలి.

ఈ మంత్రముచే వరుని పాదాంగుష్ఠము నుండి వధువుయొక్క పాదాంగుష్ఠమునకు దాకించవలెను, వధువుచేత వరునికి నమస్కారమును జేయించవలెను.

## ౨ వ. ది. అక్షతారోపణ మంత్రము

మంత్రము :- "తండులం హస్తకం జిష్ఠ, యుక్తాపతి శిరఃపురే ।
ప్రమాణం తవ భక్తాచ, తస్మాదంజలిభిః పయః ॥

ఈ మంత్రముతోను మరియు "తదేవలగ్నం సుదినం తదేవ, తారాబలం చంద్రబలం తదేవ,- విద్యాబలం దైవబలం తదేవ, గౌరీపతే తేంఘ్రియుగం స్మరామి, సుముహూర్తస్సావధానం । పార్వతీ పరమేశ్వర ధ్యానోత్సవ స్సావధానం ॥

ఇట్లు చెప్పి ఒక పాత్రలో బియ్యమును ఉంచి (బోసి) పసుపు, ఆవుపాలు, నెయ్యిగూడ అందులో వేసి, కర్పి వరుని హస్తముతో మూడు సార్లు వధువు తలపై పైన వ్రాసిన మంత్రము నుచ్చరిస్తూ వేయించవలెను. తరువాత వధువుయొక్క రెండు చేతులతో వరుని తలపై మూడు సార్లు బోయించవలెను.

## ౭ వ. ఢి. నాసికా భూషణ మంత్రము

మంత్రము :- "మహేశ్వర మహాదేవి, శారదా భువనేశ్వరీ ।
ఇదం సర్వమాయుః శాంతి స్తుష్టి శ్చాస్తు పుష్టి శ్చాస్తు ॥

ఈ మంత్రముతో (ఇతి మంత్రేణ నాసికాభరణం ధారయేత్) వధువు నాసికమునకు ముత్యమును ముట్టించవలెను.

## ౮ వ.ఢి. ఫలదాన మొసఁగు మంత్రము

### ఫ ల పూ జ

మంత్రము :- "శుద్ధి వృద్ధ్యభ్యుదయ సిద్ధి ద్వారా ఫలదేవతాంతర్వర్తి శ్రీ సాంబ సదాశివ ప్రీత్యర్థం ఫలపూజామహం కరిష్యే" సంకల్పమును జెప్పి ఫలపూజను జేయించాలి.

మంత్రము :- ఫలం మనోరథ ఫలం, ప్రదదాతి సదానృణాం ।
పుత్ర పౌత్రాభివృద్ధ్యర్థం, అతః శాంతి ప్రయచ్ఛమే ॥
హిరణ్య గర్భ గర్భస్థః హేమబీజం విభావసోః ।
అనంత పుణ్యఫలదం, అతః శాంతి ప్రయచ్ఛమే ॥

ఈ మంత్రముచేత వధూవరులతో మహేశ్వరులకు టెంకాయను దక్షిణ సహితముగా దానమిప్పించవలెను. పిదప వరునిచేత రెండు టెంకాయలను (కొబ్బరికాయలను) వధువు యొక్క ఉడిలో బెట్టించవలెను.

## మహేశ్వరులు ఆశీర్వదించే మంత్రము

మంత్రము :- శ్రియాం వర్ధస్వ మాయుష్యమారోగ్యం ।
ఆయుధాత్మే భాయనూనం । మహీతే ధన-
ధాన్యపశు, బహుపుత్రలాభం శతసంవత్సరం
దీర్ఘమాయుః ॥ వధూవరుల నాశీర్వదించవలెను.

## ౯ వ. డి. ధాతుబద్ధ మంత్రము

మంత్రము :- "హరిద్రశృంగ పూగంచ, గుడ జీరకపంచధా ।
వధూవరాంబరాగ్రేణ, బధ్వాశీర్వాదపూర్వకం ॥
ధృవం తెనందికేశోయోగణాధిపాః ।
ధృవంతే సాంబికేశానో, మంగలం ధారయేధ్రువం ॥
ఇతి శృతి స్మృతిభ్యాం, వివాహవ్రత రక్షణార్థం ।
తాని హరిద్రఖండయుతాని, పూగీఫలాని శివమనుస్మరాన్
పంచ పంచ దంపత్యో రుత్తరీయాంతయోర్బధ్నీయాత్ ॥

ఈ మంత్రముచేత పోక, పసుపుకొమ్ము, బంగారుముక్క, బెల్లము, జీలుకర, వీటిని వధూవరులయొక్క కొంగుల్లో గట్టి ఇద్దరి కొంగులను ముడి వేయవలయును.

## నా క బ లి

వరుడు ప్రాణాయామము నాచరించి

మంత్రము :- మమవధ్వా మిశ్రిత విశ్వావసు సంజ్ఞక గంధర్వ నిరసనార్థం ఆవయోః స్వస్త్యభివృద్ధి ద్వారా శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం నాకబల్యుత్సవప కరిష్యే" సంకల్పించి

మంత్రము :- "అప్సరస్సుయో గంధో గంధర్వే షుచయద్యశః । దైవో యోమానుషో గంధసమాగంధః। సురభిర్ముషాతాం" రెండింటిలో ఒక నీటి కలశమందు పసుపు పుడివేసి కల్పవలెను. ఉత్తర దిక్కునమున్న కలశములో దాక్షాయణినాహ్వానించి,

మంత్రము :- "దాక్షాయణీ మహాదేవీ సర్వసంపత్ప్రదాయినీ। వరపాశాం కుశయుతాం తథాచా భయశాలినీ। రత్నకేయూర తాటంక ముకుటాద్యై రలంకృతా । విచిత్ర వసనోపేతాం సర్వలక్షణ లక్షితాం । విలాసినీ సహస్రౌఘైః సేవ్యమాన మహర్నిశం। దేవాసురై రపి సదా వందమాన పదాంబుజాం ॥ అణిమాది గుణోపేతా అష్టైయిశ్వర్య ప్రదాయినీ ॥ అని ఆహ్వానించి బూజించవలెను. అన్నమును కొద్దిగా కలశములో వేసి, నలుదిక్కులకు గూడ కొద్దిగా జల్లవలెను. పిదప పురోహితుడు పూర్వపుదిక్కున బూజించిన కలశములోని జలమును గరిక, దర్భలచేత వధూవరుల తలపై వేస్తు (ప్రోక్షిస్తు)

మంత్రము :- "స్వాదింతాం స్వాదునాతీవ్రాం తీవ్రేణామృతా మమృతేన మధుమతీం మధుమతా ॥ ఆభిర్గ్భిర్యదతోన ఊనమప్యాయ హరవో వర్ధమానః । యదాస్తోతృభ్యో మహిగోత్రారుజాసి భూయిష్ఠ భాజో అధతేస్యామ । బ్రహ్మప్రావాదిష్మతం సోమాహాసీత్ ॥

ఓం, శాంతిః శాంతిః శాంతిః ॥ అని ప్రోక్షించవలెను.

తరువాత మొదట బూజించి అంకురారోపణము యొక్క ఐదు (పాపాలను)..." పూజించి

మంత్రము "గచ్ఛ గచ్ఛసుంశ్రేష్ఠ..." మహేశ్వర ॥ అని యుచ్చరించి, విసర్జన గావించి వాటిని ఏరు, వాగు, చెర్వు, బావి పవిత్ర స్థానములో వదలవలెను. పిదప వధూవరుల కంకణములను బూజించి,

మంత్రము :- "కంకణమోచయామ్యద్య రక్షాస్మిన్నకదాచ్య ।
మయిరక్షాం స్థిరాంబధ్వా దేవత్వంగచ్ఛకంకణ ॥ అని చెప్పి కంకణములను విడువవలెను. తరువాత వధూవరుల పక్షాన వీర మాహేశ్వరుల (మఠాధిపతికి) పాదపూజ గావించి తత్తీర్థప్రసాదములను సేవించి వారిని భోజన తాంబూలాదులతో సత్కరించి వారిచేత మంగలా శిస్సులను బొందవలెను.

## ౧౦ వ.డి. అరుంధతీ దర్శన మంత్రము

మంత్రము :- "పతివ్రతా లక్షణలక్షితాంగి, సన్మార్గగామీ శుభసౌఖ్యదాయా।
అరుంధతీనామ వశిష్ఠపత్నీ వధూవరాభ్యాం వరదాభవంతు ॥
"శివస్య పత్నీ గిరిరాజపుత్రీ, వధూవరాభ్యాం వరదా భవంతు ।
రామస్య పత్నీ జనకస్య పుత్రీ, వధూవరాభ్యాం వరదా భవంతు ॥
బసవేశ పత్నీ, బలదేవ పుత్రీ, వధూవరాభ్యాం వరదా భవంతు

ఒక తాంబాళములో బియ్యమును బోసి మధ్యభాగంలో ముత్యము నుంచి పైన చెప్పిన మంత్రముతో దంపతులను అరుంధతి దర్శనమును జేయించవలెను.

ఈ ప్రకారముగా దశవిధకర్మలను జేయించిన పిదప వధూవరులను లేపి దేవ గృహమునకు కొనిపోయి నమస్కరింపజేయవలెను.

# (పరడి) హక్కు-బాపతులను పంచే విషయము

శ్లో॥ పూర్వభాగం మహాచార్యా, శ్వహరేయుర్యథాక్రమం ।
ఉపసూత్రై స్సమాయుక్తా, శ్చైవమేవ వినిర్ణయః ॥
తదర్థం చైవ గృహ్ణీయా దుపాచార్యస్తతః పరం ।
ఏకస్య భాగమేకశ్చ, గ్రహీతుం నైవచార్హతి ॥
బలాదపిచ గృహ్ణీయాత్సమానస్కందతా భవేత్ ।
తేన దోషఫలం భుంక్త్వా, నరకానేవ విందతి ॥
ఉపాచార్య పదార్థంతు, మహాచార్య యదాహరేత్ ।
తదాతేషాంచ మహతాం, న్యూనతా భవతి ధృవం ॥
పంచపూర్ణా మహాచార్యా, ఉపాచార్యాశ్చ పంచధా ।
ఏవం దశవిధానాంతు, భాగాశ్చ పరికల్పితాః ॥౨॥
తస్మాత్ దశవిధం తత్ర, ఫల నైవేద్యకంన్యసేత్ ।
పంచపూర్ణాంచ నిక్షిప్య, తదర్ధం పంచధాక్షిపేత్ ॥

తా॥ దీక్షా వివాహ కార్యములందు పంచ కలశములను స్థాపించిన సమయములో మహాచార్యులకు ౫ (పరడీలను) హక్కు బాపతులను ప్రత్యేకముగా వేర్వేరు క్రొత్త వస్త్రములలో గట్టి ఉంచి, వాటిని గ్రమముగా మహాచార్యుల సూత్రములకు సంబంధించినవారు పంచుకొన వలెను. ఆ పిదప ఉప సూత్రములవారు క్రమముగా బంచుకొనాలి, ఇతర సూత్రములవారి కివ్వకుండ బలాత్కారముగా ఒక్కరే దీసికొనినయెడల మహా దోషమునకు ఒడిగట్టిన వారవుతారు. (గురికాగలరు) అందుచేత అందరు తమతమ సూత్రప్రకారముగానే పంచుకొనఁదగును.

ఇది వివాహవిధి, సంస్కార ప్రకరణము సమాప్తము.

# ప్రాయశ్చిత్తవిధి అథవా శుద్ధి సంస్కారము

ఎవరైన అపవిత్రులైన (బహిస్కృతులు) ను, (అకస్మాత్తుగా) తెలిసి తెలియకగాని, అన్యజాతీయుల అన్న పానీయాదులను, మద్య మాంసాదులను సేవించడము వల్లగాని, మానవ సమాజమునుండి వెలివేయ బడుటవల్లగాని, అట్టి వారిని గురువర్గము వారిచేగాని, అథవా సమాజము యొక్క ప్రముఖులనుండిగాని, దోషిగా నిర్ధారించి స్వజాతినుండి వెలివేయ బడినచో అట్టి వారిని సమస్త జనుల అంగీకారముచేత లేదా బహుజన సమ్మతితో పరిశుద్ధులుగా (నిర్దోషులుగా) జేయదలచిన యెడల ఈ దిగువ దెల్పిన విధముగా ఆచరించవలెను.

ప్రాయశ్చిత్తమున కంగీకరించిన వారినుండి దేశకాలాదులను జెప్పించి "మమకాయక, వాచక, మానసిక, సాంసర్గిక దోష నిరసన పూర్వకం సర్వకర్మ సంశుద్ధి సిద్ధ్యర్థం శ్రీ గురుచరణోదకేన ప్రాయశ్చిత్త స్నాన మహం కరిష్యే"

అని సంకల్ప పూర్వకముగా గురు పాదోదకముచేత స్నానమొనర్చి శుచియై, మడి వస్త్రమును ధరించి, విభూతి ధారణము గావించుకొని, లింగార్చన (శివపూజ) గురు పాదపూజలు జేసి, తీర్థ ప్రసాదములను భక్తి మీర సేవించి, గురువర్గము వారికి, సమాజ ప్రముఖులకు, తనకు గలిగిన దోషమునకు బ్రాయశ్చిత్త పూర్వకముగా క్షమాపణను గోరవలెను. గురువు సభికులందరుగల్సి యేకకంఠముతో క్షమింతురు. తరువాత పరిశుద్ధుడైన వ్యక్తి యథాశక్తి భక్తా మాహేశ్వరారాధనను ఆచరించి మాహేశ్వరులకు మరియు సమాజోద్ధార కార్యములకుగాను తన శక్తికొలది ద్రవ్యమును దానమొసంగవలెను.

## ధా న్యా ధి వా స ము

మంత్రము :- "ఏవం గుణవిశేషణ...అస్యాం శుభతిథౌ శివలింగస్య దేవతా బీజత్వ సిద్యర్థం ధాన్యాధివాసం కరిష్యే"

అని సంకల్పించి, శివకలశముయొక్క జలముతో ఈశాన్య దిగ్భాగమున షట్సమ్మార్జనతో భూశుద్ధిగావించి, ఆ స్థలములో రంగవల్లిచేత అష్ట దళముల కమలమును వ్రాసి, దానిపైన బియ్యముతో నింపిన పాత్రనుంచి శివలింగమును రెండు దర్భలను, రెండు వస్త్రములతో చుట్టి పూర్వపు దిక్కుకు లింగము యొక్క సిరస్సునుంచి, గోముఖమును అధోముఖముగా నుండునట్లుంచి,

మంత్రము :- "తత్పురుషాయ విద్మహే, మహాదేవాయ ధీమహే। తన్నోరుద్రః ప్రచోదయాత్" ॥

ఈ మంత్రమును బఠిస్తూధాన్యపు పాత్రలో పరుండబెట్టి, దానిని ఎడమ చేయితో బట్టుకొని ప్రాణాయామము నాచరించి. వేయి అథవా నూటావకటి సార్లు శివపంచాక్షరీ మంత్రము చేతనభి మంత్రించవలెను. తదుపరి ఆ శయన స్థలమునుండి శివలింగమును దీసికొని (పూ॥ ప॥ చెప్పిన విధముగా) పంచామృతముచేత వేర్వేరుగా అభిషేకమొనర్పవలెను. అది (అభిషేకము) జేయువిధము.

క్షీరాభిషేక మంత్రము :- ఓం, ఆప్యాయ...సంగథే" ఓం శివలింగాయ నమః క్షీరేణ స్నాపయామి

అని పాలతో నభిషేకించి, ఆపిదప శుద్ధోదకముతో నభిషేకింపవలెను.

మంత్రము :- "ఈశానః సర్వవిద్యానామీశ్వరః సర్వభూతానాం, బ్రహ్మాధిపతి, బ్రహ్మణోధిపతిబ్రహ్మా శివోమే అస్తు సదాశివోమ్" ఓం, శ్రీ శివలింగాయనమః శుద్ధోదకేన స్నాపయామి ॥

అని యుచ్చరించి శుద్ధోదకముతో నభిషేకించి ఆ మీదట పెరుగుతో నభిషేకించవలెను.

మంత్రము :- "ఓం దధిక్రావ్ణో అకారిషం..." ఓం శ్రీ శివలింగం దధ్నా స్నాపయామి

అని పెరుగుతో నభిషేకించి, తదుపరి శుద్ధోదకముతో అభిషేకించవలెను.

మంత్రము :- "తత్పురుషాయ విద్మహే, మహాదేవాయ ధీమహి। తన్నోరుద్రః ప్రచోదయాత్" ॥ఓం॥ శ్రీ॥శివలింగం॥ శుద్ధోదకేన స్నాపయామి ॥

అని శుద్ధోదకముతో నభిషేకించవలెను. ఆ మీదట నెయ్యి గల్పిన జలముచేత నభిషేకింపవలెను.

మంత్రము :- "శుక్రమసి...సూర్యస్యరశ్మిభిః" ఓం ॥శ్రీ॥శివలింగం॥ ఘృతేన స్నాపయామి ॥

అని ఘృతముతో నభిషేకించి, పిదప శుద్ధోదకంతో నభిషేకింపవలెను.

మంత్రము :- "అఘోరేభ్యో థఘోరేభ్యో ఘోరఘోరతరేభ్యః, సర్వేభ్యో సర్వ శర్వేభ్యోనమస్తే అస్తు రుద్రరూపేభ్యః ॥ఓం॥శ్రీ॥శివలింగం॥ శుద్ధోదకేన స్నాపయామి ॥

అని శుద్ధోదకముతో నభిషేకింపవలెను. పిదప తేనె గల్పిన జలముతో నభిషేకించవలెను.

మంత్రము :- "ఓం మధువాతాఋతాయతె, మధుక్షరంతి సింధవః, మాధ్వీర్నస్సంత్వోషధీః మధునక్తముతోషసి। మధుమత్పార్థివగ్ంరజః। మధుద్యౌరస్తునః పితా, మధుమాన్నోవనస్పతిః। మధుమాగ్ం అస్తు సూర్యః మాధ్వీర్గావోభవంతునః" ॥ఓం॥ శ్రీ ॥శివలింగం॥ మధునా స్నాపయామి ॥

అని తేనె గల్పిన జలముతో నభిషేకించిన పిదప శుద్ధోదకముతో నభిషేకించునది.

మంత్రము :- "వామదేవాయ నమోజ్యేష్ఠాయనమో రుద్రాయనమః। కాలాయనమః కలవికరణాయనమో బలవికరణాయనమో బల ప్రమథనాయ నమస్సర్వభూతదమనాయ నమో మనోన్మనాయ నమః" ॥ఓం॥ శ్రీ ॥శివలింగం॥ శుద్ధోదకేన స్నాపయామి ॥

అని శుద్ధజలముచేత అభిషేకింపవలెను. ఆ పైన శర్కర మిశ్రితమైన జలముతో నభిషేకించవలెను.

మంత్రము :- ఓం స్వాదుః...అదాభ్యః ॥ఓం॥ శ్రీ ॥శివలింగం శర్కరోదకేన శుద్ధోదకేన స్నాపయామి ॥

మంత్రము :- "సద్యోజాతం ప్రపద్యామి సద్యోజాతాయవై నమః। భవే భవేనాతి భవే భజస్వ మాంభవోద్భావాయనమః ॥ శ్రీ శివలింగాయ నమః శుద్ధోదకేన స్నాపయామి ॥

అని యుచ్చరించి శుద్ధోదకముతో నభిషేకింపవలెను. (ఇట్టి శుద్ధ జలాభిషేక మంత్రములకు పంచబ్రహ్మ మంత్రములని పేరు) ఈ విధముగా పంచామృతా భిషేకమొనర్చి ప్రాణప్రతిష్ఠ జేయవలెను.

## స్త్రీ దేవతను ఆరాధించునప్పుడు మంత్రములు

హరిద్రా ధారణ మంత్రము :-

"హరిద్రా స్వర్ణవర్ణాభా - సర్వసౌభాగ్యదాయినీ ।
సర్వాలంకారముఖ్యాహి - దేవీత్వం ప్రతిగృహ్యతాం ॥
(ఓం...నమః) హరిద్రాం సమర్పయామి.

కుంకుమధారణ మంత్రము :-

"హరిద్రాచూర్ణ సంయుక్తం - కుంకుమం కామదాయకం ।
వస్త్రాలంకారణం సర్వం - దేవీత్వం ప్రతిగృహ్యతాం ॥
(ఓం...నమః) కుంకుమం సమర్పయామి.

కజ్జల ధారణము (కాటుక) :-

"కజ్జలం కామికం రమ్యం - కామినీ కామసంభవం ।
నేత్రయోర్భూషణార్థాయ - కజ్జలం ప్రతిగృహ్యతాం ॥
(ఓం...నమః) కజ్జలం సమర్పయామి.

సింధూర ధారణము :-

"ఉదితారుణ సంకాశం - జపాకుసుమ సన్నిభం ।
సీమంత భూషణార్థాయ - సింధూరం ప్రతిగృహ్యతాం ॥
(ఓం...నమః) సిందూరం సమర్పయామి.

కంఠసూత్ర ధారణము :-

"మాంగల్యం తంతుమణిభి - ర్ముక్తా ఫలవిరాజితం ।
కంఠస్య భూషణార్థాయ - ప్రీత్యర్థం ప్రతిగృహ్యతాం ॥
(ఓం... నమః) కంఠసూత్రం సమర్పయామి.

కంకణ ధారణము :-

"కాచస్యనిర్మితం దివ్యం - కంకణంచ సురేశ్వరీ ।
హస్తాలంకరాణార్థాయ - కంకణం ప్రతిగృహ్యతాం ॥
(ఓం... నమః) కంకణం సమర్పయామి.

తాళపత్ర ధారణము (కర్ణకుండలాలు - కమ్మలు) :-

"నానాభరణ శోభాఢ్యం - నానారత్నోపశోభితం ।
అర్పితంచమయాదేవి - కుండలం ప్రతిగృహ్యతాం ॥
(ఓం... నమః) కర్ణకుండలం సమర్పయామి.

నాసికా భూషణ మంత్రము :-

"మహేశ్వర మహాదేవి - శారదా భువనేశ్వరీ ।
ఇదం స్వర్ణం ప్రదాస్యామి - శాంతిస్తుష్టిశ్చాస్తు పుష్టిశ్చాస్తు ॥
(ఓం... నమః) నాసికాభరణం సమర్పయామి.

(ఇది స్త్రీ దేవతా విశేషోపచారము)



# విశేశోదక స్నానము

మధుస్నాన మంత్రము :-

"సర్వౌషధి సముత్పన్నం - పీయూష సదృశం మధు ।
స్నానార్థంతే ప్రయచ్ఛామి - గృహ్యతాం పరమేశ్వర ॥
(ఓం...నమః) మధునా స్నాపయామి.

శర్కరాస్నాన మంత్రము :-

"స్వాదుః పవస్వదివ్యాయ - జన్మనేస్వాదురింద్రాయ। సుహవీతునామ్నే।
స్వాదుర్మిత్రాయ వరుణాయవాయవే – బబృహస్పతయే మధుమాగ్ం
అదాభ్యః॥ (ఓం...నమః) శర్కరోదకేన స్నాపయామి.

ఇక్షురస మంత్రము :-

"ప్రజాపతేర్వావతాని పక్ష్మాణియదశ్వవాలా ఐక్షవీ తిరశ్చీయదా-
శ్చీవాలః ప్రస్తురోభవత్త్యైక్షవీతిరశ్చీ ॥
(ఓం...నమః) ఇక్షురసేన స్నాప, అనం...శు...స్నాప ॥

నారికేళోదకస్నాన మంత్రము :-

"ఆపోవా ఇదమాసన్ సలిలమేవ సప్రజాపతిరేకః। పుష్కరపర్ణే సమ-
భవత్ । తస్యాంతర్మనసి కామస్సమవర్తత ఇదగ్ం సృజేయం ॥
(ఓం...నమః) నారికేళ రసేన స్నాపయామి. అనం...శు...స్నాప ॥

కుశోదక స్నానము :-

"దేవస్యత్వాసవితుః ప్రసవేశ్వినోర్బాహుభ్యాం ।
పూష్ణోహస్తాభ్యామాదదే ॥
(ఓం...నమః) కుశోదకేన స్నాపయామి. అ...శు...స్నాప ॥

భస్మోదక స్నానము :-

"త్రియంబకం యజామహే - సుగంధిం పుష్టివర్ధనం ।
ఉర్వారుకమివబంధనా - న్మృత్యోర్మోక్షీయ మామృతాత్ ॥
(ఓం...నమః) భస్మోదకేన స్నాపయామి. అనం-ఉ-స్నాపయామి.

పుష్పోదక స్నానము :-

"యాః ఫలినీర్యా అఫలా అపుష్పయాశ్చ పుష్పిణీః ।
బృహస్పతి ప్రసూతాస్తానో ముంచత్వగ్ం హసః॥ (ఓం...నమః) పు.స్నా.

పల్లవోదక స్నానము :-

"పావమానీర్దిశంతున ఇమం లోకమధోఅముం ।
కామాం సమర్ధయంతునో దేవీర్దేవై సమాహితా ॥
(ఓం...నమః) పల్లవోదకేన స్నాపయామి.

స్వర్ణోదక స్నానము :-

"ఋతగ్ం సత్యం పరంబ్రహ్మ - పురుషం కృష్ణపింగలం ।
ఊర్ధ్వరేతం విరూపాక్షం - విశ్వరూపాయవై నమః ॥
(ఓం...నమః) స్వర్ణోదకేన స్నాపయామి.

మంత్రోదక స్నానము :-

"తరత్సమందీ ధావతి ధారా సుతస్యాంధసః ।
తరత్సమందీ ధావతి ॥ (ఓం...నమః) మంత్రోదకేన స్నాపయామి.

వస్త్ర సమర్పణ మంత్రము :-

"మయాచిత్రపటభన్న - నిజగుహ్యోరుతేజసే ।
నిరావరణ విజ్ఞాన-వస్త్రంతే కల్పయామ్యహం॥ వస్త్రం సమర్పయామి.

యజ్ఞ సూత్ర సమర్పణము :-

''దేవదేవ నమస్తేఽస్తు - త్రాహిమామేవ సాగరాత్ ।
బ్రహ్మసూత్రం సోత్తరీయం - గృహాణ పరమేశ్వర ॥
(ఓం...నమః) యజ్ఞసూత్రం సమర్పయామి.

గంధసమర్పణ మంత్రము :-

''పరమానంద సౌరభ్యం - పరిపూర్ణ దిగంతరం ।
గృహాణ పరమం గంధం - కృపయా పరమేశ్వర ॥
దివ్యగంధం ధారయామి.

## ప్రాణ ప్రతిష్ఠా క్రమము

మంత్రము :- ''ఓం అస్యశ్రీ శివలింగ ప్రాణ ప్రతిష్ఠాపన మంత్రస్య బ్రహ్మ - విష్ణు - రుద్ర - ఈశ్వర - సదాశివ - ఋషయః ఋగ్యజు సామాథర్వణ చందాగ్ంసి సకల జగత్సృష్టికారిణీ ప్రాణశక్తిః పరా దేవతా । ఆం బీజం హ్రీం శక్తిః క్రౌం కీలకం అమృతలింగ మధ్యే మహాదేవ ప్రాణప్రతిష్ఠా సిద్ధ్యర్థం జపేవినియోగః ॥

అని జెప్పిన పిదప

మంత్రము :- ''ఓం ఆం హ్రీం క్రోం ఆకాశవాయు వహ్ని సలిల పృథివ్యాత్మనే, అం, కం, ఖం, గం, ఘం, ఙం, అం హ్రీం క్రోం ఆం ఓం అంగుష్ఠాభ్యాం నమః । ఆం హ్రీ క్రోం శబ్ద, స్పర్శ, రూప, రస గంధాత్మనే ఇం చం ఛం జం ఝం ఞం ఆం హ్రీం క్రోం ఈం ఓం తర్జనీభ్యాం నమః । ఓం అం హ్రీం క్రోం త్వక్చక్షుః శ్రోత్ర జిహ్వా ఘ్రాణాత్మనే ఓం టం ఠం డం ఢం ణం ఓం ఆం

హ్రీం క్రాం ఓం మధ్యమాభ్యాం నమః । ఓం అం హ్రీం క్రాం వాక్పాణి పాదపాయూపస్థాత్మనె ఓం తం థం దం ధం నం ఓం ఓం అం హ్రీం క్రాం ఓం అనామికాభ్యాం నమః । ఓం అం హ్రీం క్రాం మనోబుద్ధ్యహంకారచిత్త విజ్ఞానాత్మనే నమః ఓం పం ఫం బం భం ఔం అం హ్రీం క్రాం కనిష్ఠికాభ్యాం నమః । ఓం అం హ్రీం క్రాం వచనాదానగమన విసర్జనానందాత్మనేనమః అం యం రం లం వం శం షం సం హం ళం క్షం అం హ్రీం క్రాం అం కరతల కర పృష్ఠాభ్యాం నమః ॥

అని కరన్యాసము జేసి, ఇదేవిధముగా హృదయన్యాసమును జేయ వలెను. ఎట్లనగా

మంత్రము :- ''ఓం ఆం హ్రీం క్రాం...అం ఓం హృదయాయ నమః
ఆం హ్రీం...శబ్ద స్పర్శ...ఓం శిరసేస్వాహా ।
ఓం అం హ్రీం...హ్రీం క్రాం ఓం శిఖాయై వషట్ ।
ఓం అం...వాక్పా...క్రాం ఓం కవచాయహుం ।
ఓం అం...మనో...హ్రీం క్రాం నేత్రత్రయాయవౌ షట్ ।
ఓం అం వచనాదాన...క్రాం అం అస్త్రాయఫట్ ।
ఓం భూర్భువస్సరోమితి దిగ్బంధః ॥

(హృదయన్యాసము జేయునపుడు కరన్యాసములో చెప్పిన మంత్రములనే చెప్పి చివరిలో మాత్రము పైన జెప్పఁబడిన విధముగా ''సిరసేస్వాహ'' శిఖాయై వషట్ అను వాక్యములను చెప్పవలెను. దానికొరకు వైదిక గ్రంథములలో కరన్యాసమును మాత్రమే వ్రాసి ''ఏవం హృదయాదిన్యాస్యః'' అని వ్రాసి వదలేతురు) తదుపరి ధ్యానము.

మంత్రము :- "రక్తాంభోధిస్థపూతోల్లసదరుణ సరోజాధిరూఢా కరాబ్జైః
పాశం కోదండమిక్షూద్భవమళిగుణమప్యంకుశం పంచబాణాన్ ॥
బిభ్రాణాసృక్కపాలం త్రిణయన విలసత్పీనవక్షోరుహాఢ్యాదేవీ
బాలార్కవర్ణా భవతు సుఖకరీ ప్రాణః శక్తిః పరానః ॥

అని బాగుగా ధ్యానించి, ఉతికిన క్రొత్త వస్త్రమును మునుగువేసికొని
మంత్రము :- "ఓం అముష్యప్రాణా ఇహప్రాణాః స్వోహం స్వోహం"
ఇట్లుచ్చరించి పాదమునుండి నాభివరకు బ్రహ్మ భాగమునందును.

మంత్రము :- "ఓం అముష్యజీవ ఇహస్థితః స్వోహం స్వోహం"
ఇట్లుచ్చరించి నాభి నుండి హృదయపర్యంతము విష్ణుభాగములోను.

మంత్రము :- "ఓం అముష్య సర్వేంద్రియాణి వాఙ్మనశ్చక్షుః
శ్రోత్ర జిహ్వాఘ్రాణా ఇహై వాగత్య సుఖంచిరంతిష్ఠంతు స్వాహా ॥

ఇట్లుచ్చరించి హృదయము నుండి మస్తకము వరకు రుద్ర భాగములోను న్యాస (స్పర్శ)ము జేయాలి. ఆ మీదట :—

మంత్రము :- "ఓం ఆం హ్రీం క్రోం అముష్యప్రాణా ఇహప్రాణాః
సోఽహం సోఽహం । ఓం ఆం హ్రీం క్రోం అముష్యజీవ ఇహస్థితః
సోఽహం సోఽహం । ఓం ఆం హ్రీం క్రోం ఓం అముష్య సర్వేం
ద్రియాణి సోఽహం సోఽహం। ఓం ఆం హ్రీం క్రోం వాఙ్మనశ్చక్షుః
శ్రోత్రజిహ్వా ఘ్రాణా ప్రాణాపాన వ్యానోదాన సమాన నాగ కూర్మ
కృకర దేవదత్త ధనంజయాది దశప్రాణా ఇహాగత్యాగత్య ఆగచ్ఛాగచ్ఛ
ఆకర్షయాకర్షయ । సుఖం చిరం తిష్ఠంతు స్వాహా ॥

అం హ్రీం క్రొం టం ఠం డం ఢం ణం ఉం వాక్పాణి పాద పాయూపస్థాత్మనె। ఓం అం హ్రీం క్రొం ఐం తం థం దం ధం నం తక్చక్షుః శ్రోత్ర జిహ్వా ఘ్రాణాత్మనె। ఓం అం హ్రీం క్రొం ఓం పం ఫం బం భం మం ఔం మనోబుధ్యహంకార చిత్తవిద్యానాత్మనే। ఓం అం హ్రీం క్రొం యం రం లం వం శం షం సం హం ళం క్షం వచనాదాన గమన విసర్జనా నందాత్మనే। అముష్య ప్రాణా ఇహప్రాణా అముష్యజీవ ఇహస్థితః అముష్య సర్వేంద్రియాణికాయ వాఙ్మనశ్చక్షు శ్రోత్ర జిహ్వా ఘ్రాణ వాక్పాణి పాదపాయూపస్థాస్సృక్మేదోస్థిమజ్జా శుక్లమనోబుద్ధ్యహంకార చిత్తాని ఇహోమృతలింగమధ్యే సమాశ్య సుఖంచిరం తిష్ఠంతుస్వాహా ॥

ఈ మంత్రము నుచ్చరించి ప్రాణేంద్రియములను ప్రతిష్ఠాపనమొనర్చి

మంత్రము :- "అనునీతెపునరస్మాసుచక్షుః పునః ప్రాణమిహనోదేహిభోగం।
జ్యోక్పశ్యేమసూమసూర్య ముచ్చరంతమనుమతె మృడయాన శ్వస్తి ॥

అం క్రీం హ్రోం ఓం। మహా పద్మవన్నాతస్థకారణానంద విగ్రహా। సర్వభూత హితేమాతె ఏహ్యేహి పరమేశ్వరీ। ఓం అం హ్రీం క్రొం। ఆవాహితోభవ ఆసీనోభవ। అవకుంఠితోభవ। ప్రసీదోభవ। సుప్రసన్నోభవ। అస్మిన్ అమృతలింగమూర్తి మధ్యే మహాదేవం ప్రసన్నం కురు కురు స్వాహా ॥ హంస్లాం హంస్లీం హంస్లూం హంస్లైం హంస్లౌం హంస్లః ॥ ఆగచ్ఛాదిత్య మధ్యస్థ పార్వతీ సహిత ప్రభో। అస్మిన్ బింబె ప్రతిదినం సన్నిధిర్భవ శంకర ॥

అని ప్రార్థించి అర్ఘ్యపాద్యాచమనములను సమర్పించి, ముసుగువైచిన వస్త్రమును దీసి పంచబ్రహ్మాన్యాసము నాచరించవలెను. ఎటులనగా :—

మంత్రము :- "ఓం హ్రాం నం సద్యోజాతాయనమః"

అని యుచ్చరించి పాదములందును,

మంత్రము :- "ఓం హ్రీం మం వామదేవాయ నమః"

అని గుహ్య స్థానమందును,

మంత్రము :- "ఓం హ్రూం శిం అఘోరాయ నమః"

అని హృదయమందును,

మంత్రము :- "ఓం హ్రైం వాం తత్పురుషాయ నమః"

అని ముఖమునందును,

మంత్రము :- "ఓం హ్రౌంయ ఈశానాయనమః"

అని శిరస్సునందు పంచబ్రహ్మన్యాసము నొనర్చి పిదప

మంత్రము :- "ఓం సాంబ సదాశివాయనమః"

అని నా మమంత్రముచేత పంచోపచార (సమయావకాశ ముండిన యెడల షోడశోపచార)ములతో బూజించి

మంత్రము :- "ఓం నిధనపతయే నమః"

అని ఇష్ట లింగమును దీసికొని వామహస్తమున నిడుకొని మొదలు బూజించిన కలశోదకముతో రుద్రసూక్తమును అథవా పురుష సూక్తముతో నభిషేకించవలెను. పిదప గురు పాదోదకముచేత నభిషేకించునది.

మంత్రము :- "చరణం పవితతం పురాణం యేన పూతస్తరతిదుష్కృతాని।
తేన పవిత్రేణ శుద్ధేన పూతాః। అతి పాప్మాన మరాతింతరేమ"
అని యభిషేకించి, పిదప శోడషోపచారములతో యజించి

మంత్రము :- "యస్యస్మృత్యాచనామోక్త్యాతపః పూజాక్రియాదిషు ।
న్యూనం సంపూర్ణతాం యాతి సద్యోవందే సదాశివం ॥

మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం మహేశ్వర ।
యత్పూజితం మయాదేవ పరిపూర్ణం తదస్తుమే ॥ అనయాధ్యానాది షోడశోపచార పూజయా భగవాన్ సర్వాత్మక శ్రీ సాంబసదాశివ సుప్రీత స్సుప్రసన్నో వరదోభవతు ॥

అని యుచ్చరించి అక్షంతలతో గూడిన హిరణ్యోదకమును వదలవలెను. తరువాత :

మంత్రము :- "అంగాదంగాత్సంభవసి, హృదయాదధిజాయసె ।
ఆత్మావై పుత్రనామాసి సజీవశరదశ్శతం ॥

అని యుచ్చరించి శిశువుయొక్క కుడిప్రక్క చెవిలో బంగారమును (స్వర్ణము) ముట్టించి ఆ మంత్రముతోనే శిశువు ఎడమచెవిలోను ముట్టించవలెను.

మంత్రము :- "అశ్మాభవ పరశుర్భువ హిరణ్యమస్తృతంభవ ।
పశూనాంత్వాం హింకారేణాభిజిఘ్రామి ॥

అని పఠించి శిశువుయొక్క రెండు భుజములపై బంగారముతో (స్వర్ణము) ముట్టించవలెను. ఆ పిదప గురువుగారు :

మంత్రము :- "ఓం భూర్భువఃస్వః । తత్సవితుర్వరేణ్యం
భర్గోదేవస్య ధీమహి । ధియోయోనః ప్రచోదయాత్" ॥

అను గాయత్రీ మంత్రముతో శిశువుపై కలశోదకమును మూఁడు సార్లు ప్రోక్షించి,

మంత్రము :- "త్ర్యంబకం యజామహే, సుగంధిం పుష్టివర్ధనం।
ఉర్వారుకమివబంధనాత్ మృత్యోర్మోక్షీయమాఽమృతాత్"।

అను మంత్రముచేత భస్మమును ధరించి శిశువు కంఠమున (రేష్మి వస్త్రమునందు లింగమును బంధించి)

మంత్రము :- "యజ్ఞోపవీతం పరమం పవిత్రం, ప్రజాపతేర్యత్సహజం పురస్తాత్ । ఆయుష్య మగ్ర్యం ప్రతిముంచశుభ్రం, యజ్ఞోపవీతం బలమస్తు తేజః ॥"

అని యుచ్చరించి లింగమును ధరింపఁజేసి, శిశువు యొక్క కుడి చెవిలో మహా మంత్రము నుపదేశించి పాదోదకము నొసఁగవలెను.

తదుపరి శిశువు తండ్రి ఒక కంచుపాత్రలో నెయ్యి, తేనె వైచి (తల్లి తొడపై పూర్వదిక్కునకు ముఖము జేసిన శిశువునకు) శిశువు యొక్క మస్తకమును అఘ్రాణించి

మంత్రము :- మేధాంతే దేవస్సవితా మేధాం దేవీసరస్వతీ । మేధాంతే అశ్వినౌ దేవా వాధత్తాం పుష్కరస్రజాత్వయి మేధాం త్వయి ప్రజాత్వయ్యగ్నిస్తేజోద ధాతు । త్వయి మేధాం త్వయి ప్రజాం త్వాయి సూర్యోభ్రాజోద ధాతు ॥

ఈ మంత్రము నుచ్చరించి, శిశువు యొక్క నోటిలో నెయ్యి, తేనెలను కొద్దిగావేసి

మంత్రము :- (ససిరాజాతవేదాః అక్షరం పరమం పదం । దేవా నాగ్ంశిర ఉత్తమంజాతవేదసెశిరసి మాతవే (బ్రహ్మా భూర్భువస్సు వరోం) అని చెప్పి తల్లి యొక్క కుడి స్తనముపై దర్భతో ప్రోక్షించి

మంత్రము :- "(అయంకుమారోజరాంధయత్ । దీర్ఘమాయుః యస్మైత్వగ్ం స్తనప్రప్యాయాయుర్వర్చో యశో బలం)

అను మంత్రమును జెప్పి శిశువునకు మొదలు కుడి కుచము యొక్క పాలు గుడిపించవలెను. ఇకముందు వృద్ధాచారాను సారముగా నాచరించ వలెను. ఆ దినమునందు యధాశక్తి భక్త-మాహేశ్వరులకు భోజన దక్షిణాదులను సమర్పించి సంతృప్తిజేయవలెను.

॥ఇది జాతకర్మ యొక్క లింగధారణా విధిః॥

## నామ కర్మణ విధానము : ఆందోళారోహణం

జ్యోతిశ్శాస్త్రోక్త శుభ దినమునందు బిడ్డతోబాటు దంపతులు మంగళస్నానము నాచరించి, శుభాసనములో గూర్చుండి ఆచమన ప్రాణాయామములంజేసి, దేశకాలాదులనుబేర్కొని

మంత్రము :- ఏవంగుణ...శుభ తిథౌ అస్యశిశోః ఆయు ష్యాభివృద్ధ్యర్థం వ్యవహారార్థమావాం నామకరవావహై"॥

అని సంకల్పమును జెప్పి, ఒక కంచు పాత్రలో బియ్యమునునింపి దాన్నిదీసికొని అందు ఏమాసములో శిశు జననమో ఆ మాసముయొక్క పేరు, పుట్టినదినము, నక్షత్రము, పేరును ఉన్నదున్నట్లుగా వ్రాయుట,

మాసము పేరు, నక్షత్రనామము, వ్యవహారనామము, వీటిని వ్రాసి (అందులో వ్యవహారనామము మగశిశువుకు శివ, రుద్ర, మొదలగునవి సమాక్షరములను, ఆడబిడ్డకు పార్వతీ, రుద్రాణి, మున్నగు అసమాక్షరములతో నుండవలెను.) పేరునకు మొదలు చివరకి శ్రీకారము వ్రాసి

మంత్రము :- "మాసనామ, నక్షత్రనామ, వ్యవహార నామాధిష్ఠిత దేవతాభ్యోన్నమః" ॥

అను నామ మంత్రమును గంధాక్షతాదులతో బూజించి, శిశువు తండ్రి ఇది శిశువుయొక్క పేరని అందరికి తెలుపవలెను.

అందరు "తథైవాస్తు" అని చెప్పవలెను.

ఆ పేరునే శిశువుయొక్క కుడిప్రక్క చెవిలో జెప్పి, అదే పేరుతోనే గురువులకు, మాహేశ్వరులకు శిశువుచేత నమస్కరింపఁ జేయవలెను. ఆ మీదట (జాతకకర్మలో జెప్పిన)

మంత్రము :- "అంగాదంగా త్సంభవసి...శరదశ్శతం"

అనే మంత్రముతో మరల మరల మూఁడు సార్లు అభిమంత్రించి శిశువుయొక్క మస్తకమును ఆఘ్రాణించవలెను. పిదప మాస నామాదుల నుచ్చరిస్తూ గురు-లింగ-జంగములకు బిడ్డతో నమస్కరింపఁ జేయవలెను. తరువాత

మంత్రము :- "అగ్నిరాయుష్మాంత్సవనస్పతిభిరాయుష్మాన్ తేనత్వాయుషా యుష్మంతం కరోమి ॥౧॥ సోమ ఆయుష్మాంత్స ఓషధీభి రాయుష్మాన్తేన త్వాయుషా యుష్మంతం కరోమి ॥౨॥ యజ్ఞ

ఆయుష్మాంత్సదక్షిణాభిరాయుష్మాన్ తేన త్వాయుషా యుష్మంతం కరోమి ॥3॥ బ్రహ్మాయుష్మత్తద్బ్రాహ్మణై రాయుష్మత్తేన త్వాయుషా యుష్మంతం కరోమి ॥4॥ దేవా ఆయుష్మంతస్తే ఽమృతే నాయుష్మం తేస్తేన త్వాయుష్మంతం కరోమి ॥5॥

ఈ యైదు మంత్రములను శిశువు చెవిలో ఉచ్చరించవలెను. స్త్రీ (ఆడ) శిశువైతే

మంత్రము :- "సర్వస్మాదాత్మనః సంభూతాని సాజీవః శరదః శతం"

అను మంత్రము చేత నభిమంత్రించ వలెను. తరువాత మాహేశ్వరు లందరు

మంత్రము :- "శతమానంభవతి శతాయుః పురుషశ్శతేంద్రియః ।
ఆయుష్యేవేంద్రియే ప్రతి తిష్ఠతి"

అని ఈ ఆశీర్వాద మంత్రమును బఠిస్తు శిశువు నాశీర్వదించ వలెను. తదుపరి శక్త్యానుసారముగా మాహేశ్వరులకు భోజన దక్షిణా తాంబూలాదులతో తృప్తిపరచవలెను. ఆమీదట అదేదినమునందు వృద్ధాచారము ననుసరించి ముత్తయిదువలతో ఆందోళారోహణ (తొట్లలో బెట్టుట) కార్యమును నెరవేర్చి, పూర్వోక్త నామమును ముత్తయిదువలతో జెప్పించవలెను. మరియు ముత్తయిదువలకు భోజనము జేయించి వాయినము లొసఁగి వారిని దృప్తిపరచవలెను.

(ఇది నామకరణము-ఆందోళనారోహణ విధము) సమాప్తము.

# అన్న ప్రాశనము

శిశువు జన్మించిన 6-8 మాసములలో దంతములు వచ్చినపిదప శిశువుకు అన్న ప్రాశనము జేయించవలెను. అన్నమును దినిపించుటకు మొదటి దినము పుణ్యాహవాచనము, నాంది సమారాధనము నాచరించి, అన్నప్రాశన దినమున ప్రాతఃకాలము స్నానము ఇష్టలింగార్చన ముగించుకొని దేశ కాలాదులనుచ్చరించి

మంత్రము :- "ఏవంగుణ ... శుభతిథౌ ధర్మాపత్న్యాంజాతస్య మమ కుమారస్యాయుష్యాభి వృద్ధ్యర్థం ఇ(...) శర్మాణం కుమారం అన్న ప్రాశనేన కర్మణాసంస్కరిష్యే" అని చెప్పి

మంత్రము :- "అన్న ప్రాశనాంగత్వేన ఆచమనాధికార సిద్ధ్యర్థం రక్షాబంధనం కరిష్యే" అని శిశువుచేతికి (రక్ష) కంకణమును గట్టాలి.

కంకణధారణ మంత్రము :-

మంత్రము :- "బృహత్సామచక్ర భృద్వృద్ధవృష్ణియం । త్రిష్టుభోజః శుభిత ముగ్రవీరం ఇంద్రం సోమేన పంచదశేన మధ్యమిదం వాతేన సగరేణరక్ష ॥

పై మంత్రము నుచ్చరించి (రక్షా) కంకణ బంధనమును గావించి తదుపరి ఆచమనము ప్రాణాయామము నాచరించి, ఒక పాత్రలో పెరుగు, నెయ్యి, తేనె, అన్నమునుగల్పి దీసికొని

మంత్రము :- "భూరపాంత్వౌషధీనాగ్ం రసం ప్రాశయామి శివాస్త్వ ఆప ఓషధయస్సంతు । అనమీవాస్త్వ ఆపఓషధయస్సంతు ।...శర్మన్ ॥

భూరపాంత్వోషధీనాగ్ంరసం ప్రాశయామి। శివాస్త్వప ఓషధయస్సంతు।
శర్మన్ సువరపాంత్వోషధీనాగ్ం రసం ప్రాశయామి ।
శివాస్తా ఆప ఓష్షధయస్సంతు ...శర్మన్ ॥
ఓం భూర్భువస్సువరపాం త్వోషాధీనాగ్ం రసం ప్రాశయామి ।
శివాస్తా ఆప ఓపధయస్సంతు అనమీవాస్తా ఆప ఓష్షధయస్సంతు
...శర్మన్ ॥

అను మంత్రము నుచ్చరించి శిశువు నోటిలో బుక్కపెట్టవలెను. మిగత అన్నమును మౌనముతో (మంత్రము నుచ్చరించకుండ) దినిపించవలెను.



# సంస్కార ప్రకరణము

వేదము, ఉపనిషత్తు, ఆగమ, పురాణ, స్మృతిపథానుసారముగా వర్తించువారే హిందువులు అథవా ఆర్యులు అనబడుచుందురు, ఇట్టి హిందుధర్మ శాస్త్రములో గృహస్థులకు సంబంధించిన ధర్మ-కర్మములు ఇక్కడ వివరించబడినవి.

వీటన్నిటికిని షోడశ సంస్కారములు, ఈ సంస్కారములు మొత్తము 16 గలవు. వీటిపేర్లు క్రమముగా 1. గర్భాధానము, 2. పుంసవనము, 3. సీమంతోన్నయము, 4. అనవలోమనము, 5. జాతకర్మము, అథవా లింగధారణము, 6. నామకరణము, 7. ఆందోలారోహణము, 8. దుగ్ధప్రాశనము, 9. సూర్య చంద్రావలోకనము, 10. నిష్క్రమణము, 11. కర్ణవేధనము, 12. అన్న ప్రాశనము, 13. చౌలము, 14. విద్యారంభము, 15. దీక్షా, 16. వివాహము, అను షోడష కర్మములున్నవి.

# 1. గర్భాదాన విధి

జ్యోతిష్కులచే నుండి నిశ్చయింపఁబడిన శుభదినమునందు దంపతులు మంగళస్నానము నాచరించి పూజా సామగ్రిని సంగ్రహించుకొని ఒక భద్రాసనమున గూర్చొని

మంత్రము : హరిః ఓం తదేవ లగ్నం, సుదినము తదేవ-తారాబలం చంద్రబలం తదేవ-విద్యాబలం దైవతదేవ, గౌరీపతే తేంఘ్రి యుగం స్మరామి ॥ "యశ్శివో నామ రూపాభ్యాం, యాదేవీ సర్వమంగళా । తయోస్సంస్మరణా త్పుంసాం, సర్వతో జయ మంగళం, ॥ సుముహూర్తమస్తు ॥ సుప్రతిష్ఠిమస్తు ॥

అని యీశ్వరుని ప్రార్థించి వెనుక సర్వపూజా ప్రకరణమునందలి మంత్రములను బఠించి, వెనుక జెప్పిన సమస్త పూజా ప్రకరణమునందు జెప్పఁబడిన మంత్రమును బఠించి ఘంటానాదము నాచరించి

మంత్రము :- "ఋగ్వేదాయస్వాహా । యజుర్వేదాయస్వాహా । సామ వేదాయ స్వాహా । అథర్వణ వేదాయస్వాహా । ఇతిహాస పురాణాయస్వాహా । అనంతాయ నమః । సూక్ష్మాయనమః । శివోత్తమాయ నమః । ఏక నేత్రాయ నమః । త్రిమూర్తయే నమః । శిఖండినే నమః । శ్రీ కంఠాయ నమః । హృదయాయ నమః । శిరసే స్వాహా । శిఖాయై నమః । కవచాయ నమః । నేత్రత్రయాయ నమః । అస్త్రాయ నమః ॥

ఈ వాక్యములను జెప్పి, ఆచమనము నాచరించి । జలముతో నేత్రాది జ్ఞానేంద్రియములను ముట్టి, ప్రాణాయామము నాచరించి,

మనస్సును స్థిరపరచవలెను ॥ అనంతరము వెనుక జెప్పిన మంత్రముల నుచ్చరించి దేశకాలాదులనుచ్చరించి

"ఏవంగుణ విశేషణ శిష్టాయామస్యాం శుభతిథౌమమధర్మపత్న్యాః గార్భిక భైజిక దోష పరిహారార్థం, ఆధార, ఈ పంక్తులు వదలినారు. చూ, తిధౌఉపాత్తదురతక్షయ ద్వారా శ్రీ సాంబసదాశివ ప్రీత్యర్థే ॥ (       ) గోత్రోద్భవయోః ఆవయోః సత్సంతాన సౌభాగ్య ఫల సిద్ధ్యర్థం రాత్రౌ గర్భాధానార్థం కర్మ కరిష్యమాణః గర్భాధానాంగభూతనాందీ శోభన దేవతా ప్రీత్యర్థనాందీ సమారాధనాఖ్యం కర్మకరిష్యమాణః । గర్భాధాన లగ్నకాలె ఫల దానానికర్తుం ఫలపూజాఖ్యం కర్మకరిష్యమాణః । తదంగత్వేన తదా దౌషద్ధ్యర్థం వృద్ధ్యర్థం అభ్యుదయార్థం, శాంత్యర్థంచ మాహేశ్వరై సహస్వస్తి పుణ్యాహవాచనం కరిష్యే ॥

తదాదౌని నిర్విఘ్నేన పరిసమాప్తి ద్వారా ఉత్తరోత్తరాభి వృద్ధ్యర్థం శ్రీమహా గణాధిపతి పూజాం కరిష్యే॥

అని సంకల్పమును జెప్పి, మొదలు గణపతిపూజను జేయవలెను. గణపతి పూజను సర్వపూజా ప్రకరణమున జెప్పినట్లుగా జేయవలెను.

## స్వ స్తి పు ణ్యా హ వా చ న ము

సమ్మార్జన (అలికి) మొనర్చి రంగవల్లిలతో నలంకరింపజేసి శుద్ధ ప్రదేశములో

("మహిద్యౌః పృథ్వీచనఇమంమిమక్షతాం । పిపృతాన్నోభరమభిః)

అని జెప్పి, తన యొక్క రెండూ చేతులలో దక్షిణోత్తరముల భూమిని స్పృసించి (ముట్టి) జపించి యాస్థానములందు

("ఓషధయస్సంవదంతేసోమేన సహరాజ్ఞాయస్మైకృణోతి బ్రాహ్మణ స్తగ్ంరాజన్పారయామసి")

అని ఉచ్చరించి అరటి ఆకులను బరచి,

("యైనలో కాయు తనయాయధాన్యం బీజంవహధ్వే అక్షితం । అస్మభ్యంతద్దత్తన యద్వ ఈమహే । రాధో విశ్వాయ సౌభగం")

అని యుచ్చరించి ఆ అరటియాకులపైన ఒక సేరు (బళ్ళ-అడ్డ పరిమితం) బియ్యము గట్టిన రెండు మూటలను ఉంచి,

("ఆకలశేషుధావతిశ్యేనో వర్మవిగాహతేఅభిద్రోణా కన్నిక్రదత్")

అని చెప్పి బియ్యపు గుంపులపైన లోహమయముగాని, లేదా మృణ్మయపు (మట్టివి) రెండు కలశములనుంచి

("ఇమంమేగంగేయమునే సరస్వతి సుతుద్రిస్తోమగ్ంసచతా పరుష్ణియా । అసిక్రియా మరుద్వృధేవితస్తయార్జికియేశృణు హ్యోసు షోమయా ॥)

అని చెప్పి తీర్థోదకముతో నింపి

("గంధద్వారాం దురాధర్షాం నిత్య పుష్టాంకరీషిణీం । ఈశ్వరీగ్ం సర్వ భూతానాంతామిహో పహ్వయేశ్రియం ॥) అని గంధమును లేపించి, పైన నూక లేపించి (పెట్టి) పుష్పమాలికలతో నలంకరింపఁజేసి

మంత్రము :- "సహిరత్నానిదాశుషే-సువాతి సవితాభగః తంభాగంచి త్రమీమహే ॥)

అని యుచ్చరించి పంచరత్నములను ఆ కలశములో వైచి,

మంత్రము :- ప్రవోయజ్ఞేషు దేవయంతో, అర్చ్యంద్యావానగ్ంహోభిః పృథ్వీ ఇషద్వేషిషాం బ్రహ్మణ్యా సవమానివిప్రా విషిగ్వియంతి విని నోనశాఖాం ॥)

అని మామిడి చిగుళ్ళతో (ఆకులతో) నలంకరించి,

మంత్రము :- "కాండాత్కాండా త్ప్రరోహంతి పరుషః, పరుష పరి ఏవానోదూర్వే ప్రతను సహస్రేణ శతేనచ ॥

అని దర్భ (గరిక) లనుంచి

మంత్రము :- "హిరణ్య రూపస్స హిరణ్య సంద్భగపాన్నపాత్సేదు హిరణ్యవర్ణః హిరణ్యయాత్పరియోనేర్నిషద్యా హిరణ్యం దాదత్యం నమస్మై ॥

అని నిష్క(కం తులములకు నిష్కమని పేరు) అథవా అర్ధనిష్కం లేదా యథాశక్తి ననుసరించి సువర్ణమును కలశమునందుంచి

మంత్రము :- "పూర్ణాదర్వి పరాపత సుపూర్ణా పునరాపత ।
వస్నేవ విక్రేణావహా ఇషమూర్జగ్ం శతక్రేతో ।
యాః ఫలినీర్యా అఫలా అపుష్పయాశ్చ పుష్పిణీః ।
బృహస్పతి ప్రసూతాస్తానో ముంచత్వగ్ం హసః ॥

అని కలశములపై టెంకాయలనుంచి...

మంత్రము :- "యువాసువాసాః పరివీత అగాత్యవుశ్రేయాన్ భవతి జాయమానః । తంధీరాస్సకవయ ఉన్నయంతి, స్వాధీయో మనసా దేవయంతః ॥

మంత్రము :- "అనయాపూజయా వరుణాధిదేవతా సుప్రీతా సుప్రసన్నా వరదాభవంతు ॥

అని ఉచ్చరించి అక్షత హిరణ్యాదులతో గూడిన జలమును వదలవలెను.

అనంతరము పవిత్ర పాణిలో ప్రాణాయామము నాచరించి నమస్కరించి (చేతులు జోడించి)

మంత్రము :- "ఉమా మహేశ్వరాభ్యాం నమః । ప్రథమగణేభ్యోన్నమః। భక్తా మాహేశ్వరేభ్యో నమః । దుర్గా గణపతి క్షేత్రపాలకేభ్యోనమః। మాతృభ్యోనమః। పితృభ్యోనమః। ఆచార్యేభ్యోనమః। ఇష్టదేవతాయై నమః। సర్వేభ్యో మాహేశ్వరేభ్యోనమః ॥

అని ఉచ్చరించి నమస్కరించి ఆ మీదట అట్టి కలశముల యెదుట ప్రశస్తులై, సమాధానముజెప్ప సమర్థులై, దానమును బుచ్చుకొననివారై, ఉత్తరీయమును (సెల్లను) గప్పుకొన్నవారై, పవిత్ర పాణులై, (చేతులు) గలవారై యున్న మాహేశ్వరులను గూర్చుండబెట్టి-గంధ, పుష్పాదులతో వారిని బూజించి,

మంత్రము :- "ఆశిషః ప్రార్థయామి" అని చెప్పగా అందుకు మాహేశ్వరులు "సత్యాహ్యేషా ఆశిషస్సంతు దీర్ఘా, నాగనద్యోగిరయస్త్రీణి విష్ణుపదానిచ । తేనాయుః ప్రమాణేన పుణ్యాహం దీర్ఘమాయురస్తు" అని చెప్పి, మాహేశ్వరులచేత ఆశీర్వాదరూపంబైన ప్రత్యుత్తరమును బడసి, పునః ప్రాణాయామము నాచరించి దేశ కాలాదులను బేర్కొని,

మంత్రము :- "*గర్భాధానకర్మ కర్తుమాదౌ శుద్ధివృద్ధ్యభ్యుదయసిద్ధి ద్వారా శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం శాంత్యర్థంవీర మాహేశ్వరైస్సహ స్వస్తి పుణ్యాహవాచనం కరిష్యే ॥

సూ* ఇతర కర్మల నాచరించునప్పుడుగూడ అక్కడ ఇక్కడ జూపినట్లుగానే అన్నింటిని నెరవేర్చవలెను. సంకల్పమునందు మాత్రమే కొద్దిగా మార్పు జేయాలి. ‘‘దీక్షా కర్తుమాహె, అథవా, వివాహకర్మ కర్తుమాహె’ అని యే కర్మనాచరించవలెనో ఆ కర్మను సంకల్పమున పేర్కొనవలెను.

అని సంకల్పించి ఉత్తరకలశము చేత బుచ్చుకొని ‘‘ఆపః’’ అని ఉచ్చరించి ఉదకము నీయగా అందుకు మాహేశ్వరులు ‘‘శివా ఆపస్సంతు’’ అని ఉచ్చరించి స్వీకరించవలెను. మరల కర్త (ఎజమాని-కర్రృవు) ‘‘గంధాః’’, అని గంధము నొసంగ, మహేశ్వరులు ‘‘సుగంధాః పాంతుః’’ అని చెప్పి దాన్ని స్వీకరింతురు. కర్త :- ‘‘అక్షతాః’’ అని అక్షతల నొసగ వాటిని గైకొని మాహేశ్వరులు :- ‘‘అక్షతం చారిష్టంచాస్తు’’ అనగా కర్త :- ‘‘సుమనసః’’ అని పుష్పములనీయగా వారు మాహేశ్వరులు :- ‘‘ఐశ్వర్యమస్తు’’ అని చెప్పగా కర్త :- దక్షిణాః పాంతు’’ అని దక్షిణ నొసంగ, మాహేశ్వరులు ‘‘బహుదేయంచాస్తు’’ అని యుచ్చరించిన తరువాత కర్త ఆ కలశమును చేత నిడుకొని లేచి నిల్చి ‘‘మనస్స మాధీయతాం’’ అని చెప్పగా, మాహేశ్వరులు ‘‘సమాహిత మనసస్మః’’ అనగా, కర్త :- ‘‘ప్రసీదంతు భవతః’’ అని నుడువగా మాహేశ్వరులు :- ‘‘ప్రసన్నాస్మః’’ అని మాహేశ్వరులంద రేకకంఠముతో

మంత్రము :- ‘‘శాంతిరస్తు, తుష్టిరస్తు, పుష్టిరస్తు, వృద్ధిరస్తు, అవిఘ్నమస్తు, ఆయుష్యమస్తు, ఆరోగ్యమస్తు, స్వస్తి శివం కర్మాస్తు, కర్మ సమృద్ధిరస్తు, ధర్మ సమృద్ధిరస్తు, పుత్ర సమృద్ధిరస్తు, వేద సమృద్ధిరస్తు, శాస్త్ర సమృద్ధిరస్తు, ధనధాన్యం సమృద్ధిరస్తు, ఇష్టసపందస్తు ॥

అని ఈ 15 వాక్యములను బలుకగా

కర్త :- ''స్వయం కర్మ దేవతాత్మకో భగవాన్ శివః ప్రీయతాం'' అని చెప్పగా మాహేశ్వరులు

''ప్రీయతాం భగవాన్ కర్మ దేవతాత్మకః'' అనగా

కర్త :- ''పుణాహంవాచ ఇష్యే'' అని చెప్పగా అందుకు మాహేశ్వరులు ''వాచ్యతాం'' అని చెప్పి పునః మాహేశ్వరు లందరు

మంత్రము : ''ఉద్గాతేవ శకునే సామగాయసి బ్రహ్మపుత్ర ఇవసవనేషుశగ్ం, నసి ఋషేవవాజీ శిశు మతీరపీత్యా । సర్వతోనశ్శమనే భద్రమావద । విశ్వతో నశ్శకునే పుణ్యమావద'' అని చెప్పవలెను. తరువాత

కర్త :- ''ఓం పుణ్యాహం భవంతోభృవంతు'' అని ఉచ్ఛ స్వరముతో బలుకగా మాహేశ్వరులు ''ఓం పుణ్యాహం'' అందురు. పిదప ''ఓం పుణ్యాహం భవంతో భృవంతు'' అని

కర్త :- ''ఓం పుణ్యాహం'' అని మాహేశ్వరులందరు మధ్యమ స్వరముతో మరియు ఉచ్ఛస్వరముతోను మూడు మూడు పర్యాయములు చెప్పవలెను. తదుపరి

కర్త :- "గర్భాదాన కర్మణే ఓం స్వస్తిభవంతో భృవంతు" అని ఉచ్ఛరించగా మాహేశ్వరులు "గర్భాదాన కర్మణి ఓం స్వస్తి" అని ఉచ్ఛరించవలెను. మర్రల

కర్త :- "గర్భాధాన్నకర్మణే ఋద్ధిం భవంతో భృవంతు" అనగా

మాహేశ్వరులు :- "బుధ్యతాం" అని యుచ్చరించ దగును. దీనిని గూడ మూడు మూడు పర్యాయములు చెప్పాలి. తరువాత కర్త పత్నీసమేతుఁడై పూర్వాభిముఖుండై కూర్చుండి ఉత్తర దిక్కు కలశమును కుడి చేతితోను, దక్షిణ దిక్కు కలశమును ఎడమ చేతితో బట్టుకొని ఆ రెండింటిని గల్పి రెండుగా ధారను విచ్ఛిత్తి గాకుండ మరో పాత్రలో

మంత్రము :- ఓ షధానిచ రత్నాని కాలస్యావయవాశ్చయే । సరిత స్సాగరాశ్శైలాస్తీర్థానిచ హ్రదానదాః । ఏతేత్వామభిషించంతు, సర్వకామార్థ సిద్ధయే । శాంతిః పుష్టిస్తుష్టిశ్చాస్తు । శివగ్ం శివమస్తు । భగవాన్ శివః ప్రీయతాం ॥

ఈ మంత్రము చేత అభిషేకించవలెను. ఆ పిదప మాహేశ్వరులు ఆ జలమును మామిడి చిగురాకులతో పతి-పత్నుల శిరస్సులపై ప్రోక్షిస్తు

మంత్రము :- "తత్సవితుర్వరేణ్యం విశ్వామిత్రః సవితాగాయత్రీ । ఆపోహిష్ఠేతిన వర్చస్యాంబరీషః । సింధుద్వీపాఆపో గాయత్రీ । పంచమీ వర్ధమానా సప్తమీ ప్రతిష్ఠే తేద్వే అనుష్టుభౌ । ఆపోహిష్ఠా మయో భువస్తాన ఊర్జేదధాతన మహేరణాయచక్షసె । యోవ శ్శివతమోరసస్తస్య భాజయతే హనః । ఉశతీరివమాతరః తస్మాఅరంగ మామవోయస్యక్షయాయఃజన్వథ । ఆపోజన యధాచనః ॥

అను మంత్రముతో ప్రోక్షించవలెను. తరువాత ముత్తయిదువలు మంగళారతి నొసగ, మాహేశ్వరులందరు ఆశీర్వాదము నొసఁగుదురు.

ఇది స్వస్తి పుణ్యాహవాచనము సమాప్తము

# మహా మృత్యుంజయ జపశాంతి ప్రయోగః

సమస్త కార్యములు సంకల్పము నుండే సిద్ధించును. కనుక ఇట్టి సంకల్పము ఇష్టార్థసిద్ధి కొరకు ఎవరి పక్షమున ఎంత జపము జేయించవలెనో అద్దాని నంతను వ్యాకరణాను సారముగా సంకల్పమును శుద్ధముగా జేయవలెను. తెలియజేయుటకై ఇటు నాలుగైదు సంకల్పములను వ్రాయబడినవి. ఉదా :- దేశకాదుల నుచ్చరించి "అముకగోత్రోఽముక శర్మమమాత్మనః శృతి-స్మృతి పురాణతంత్రోక్త ఫలావాప్తయే మమజన్మ సం॥ము, మాస, దిన, గోచరాష్టక వర్గ దశాంతర్దశాదిషుయే అనిష్ట ఫల కారకా గ్రహాస్తేషాం సానుకూలార్థం సకలాధి వ్యాధి ఘటిత ప్రశమన పూర్వక దీర్ఘాయుష్య బలపుష్టి నైరుజ్యాది సకలాభీష్ట సిద్ధ్యర్థం శ్రీ మహా మృత్యుంజయ ప్రీత్యర్థం (శత సహస్రాయుత లక్షాది) సంఖ్యయా శ్రీ మహా మృత్యుంజయ మంత్రజప మహం కరిష్యే" 1) అథవా "మాహేశ్వర ద్వారా కారయిష్యే" 2) అథవా "విషూచికాదిజన మారోప్సర్గ శాంతర్థ్యం" 3) అథవా "వృష్టికామార్థం" 4) అథవా "అముకా భియోగ నివృత్యర్థం" 5) "అముక దుఃఖప్రనిరసనార్థం" 6) "అముక దిగ్యాత్రా నిర్విఘ్నపూర్వక సిద్ధ్యర్థం" 7) "ప్రతిసమ్ముఖ శుక్రదోష దూరీకరణార్థం" 8) "కాకమైథున దర్శనాది సూచిత సర్వారిష్ట నివృత్యర్థం" 9) "పల్లీపతన, సరటారోహణాముకదుష్టాంగస్ఫురణ జనితాశుభఫల వినాశనార్థం" 10) "దీర్ఘాయుషీ పుత్రప్రాప్త్యర్థం" 11) "యథేచ్ఛధన లాభార్థం" 12) "అముక పదప్రాప్త్యర్థం" 13) "అముక కామనా సిద్ధ్యర్థం 14) "అముక సంఖ్యా పరిమిత శ్రీ మహా మృత్యుంజయ జప మహం కరిష్యే" "వా మాహేశ్వర ద్వారా కారయిష్యే" ఈ విధముగా తన కేది యవసరమో దానిని సందర్భోచితముగా సంకల్పమును జెప్పుకొనవలెను.

మృత్యుంజయ జపమును జేయువారు నిత్య కర్మలనాచరించి, జపము జేయు స్థలమును పరిశుద్ధమొనర్చి, రంగవల్యాది ముగ్గులతో నలంకరించి, కంబలము (గొంగడి) మొదలగు ఆసనము వేసి, ఆ ఆసనము పైన తూర్పు అథవా ఉత్తర ముఖముగా కూర్చుండి, ప్రాణాయామము నాచరించి,

మంత్రము :- "ఓం గురవే నమః, ఓం గణాధిపతయే నమః ఓం ఇష్ట దేవతాయై నమః" అని ప్రార్థించి, ప్రతిజ్ఞా సంకల్పమును జేసి, తదుపరి భూతశుద్ధి, ప్రాణప్రతిష్ఠాపనాదులను జేయవలయును. ఎట్లులనగా,

మంత్రము :- "మమ అముక ప్రయోగ సిద్ధ్యర్థం భూతశుద్ధి, ప్రాణ ప్రతిష్ఠాపనంచ కరిష్యే" తరువాత "ఓం ఆధారశక్తిః కమలాసనాయ నమః" అని ఆసనమును బూజించి,

మంత్రము :- "పృథ్వీతి మంత్రస్య మేరుపృష్ఠ ఋషిః కర్మోదేవతా సుతలచ్ఛందః ఆసనే వినియోగః పృథ్వీత్వయాధృతాలోకాదేవీత్వం విష్ణునాధృతా। త్వంచధారయమాం దేవి పవిత్రం కురుచాసనం ॥

అను మంత్రముచేత గంధ, పుష్పాదులతో భూమిని బూజించవలెను. ఆ పిదప,

మంత్రము :- "పాదాది జానుపర్యంతం - పృథ్వీస్థానం తచ్చతురస్రం- పీతవర్ణం। బ్రహ్మదైవతం "వ" మితిబీజయుక్తం"

అని ధ్యానించి, పునః

మంత్రము :- "జాన్వాదినాభి పర్యంతం ఆపస్థానంతచ్చార్ధ చంద్రాకారం శుక్లవర్ణం పద్మలాంఛితం విష్ణుదైవతం "ల" మితిబీజయుక్తం" అని ధ్యానించి, పునః

మంత్రము :- "నాభ్యాది కంఠపర్యంతం అగ్నిస్థానం త్రికోణాకారం రక్త వర్ణం స్వస్తికలాంఛితం రుద్రదైవతం "ర" మితి బీజయుక్తం" అని ధ్యానించి, పునః

మంత్రము :- "కంఠాది భ్రూమధ్య పర్యంతం వాయుస్థానం, షట్కోణాకారం షడ్బిందులాంఛితం కృష్ణవర్ణం ఈశ్వరదైవతం "య" మితబీజయుక్తం" అని ధ్యానించి, పునః

మంత్రము :- "భ్రూమధ్యాది బ్రహ్మరంధ్ర పర్యంతం ఆకాశస్థానం, వృత్తాకారం ధ్వజలాంఛితం సదాశివ దైవతం "హ" మితి బీజయుక్తం" అనియు తన శరీరమునందు పంచ మహాభూతములను ధ్యానించి ప్రవిలాపన (మిశ్రితము)ను గావించ వలయును, ఎటులనగా

మంత్రము :- "పృథ్వీమప్సు । ఆపోఽగ్నౌ । అగ్నిం వాయౌ । వాయు మాకాశే । ఆకాశంతన్మాత్రాం హంకారమహదాత్మి కాయాం మాతృకాసంజ్ఞక శబ్దబ్రహ్మస్వరూపాయాం హృల్లేఖార్ధ భూతాయాం ప్రకృతిమాయాయాం ప్రవిలాపయామి । తథా త్రివిధాం మాయాంచ నిత్య శుద్ధ బుద్ధముక్త స్వభావిస్వాత్మ ప్రకాశరూప సత్య జ్ఞానానంతానంద లక్ష్మణే పరమకారణే పరమార్థభూతే పరబ్రహ్మణి ప్రవిలాపయామి, తచ్చ నిత్య శుద్ధ బుద్ధముక్త స్వభావి, సచ్చిదానంద స్వరూపం పరిపూర్ణం బ్రహ్మైవాహమస్మి॥ అని ధ్యానించి, తదుపరి

మంత్రము :- "యథోక్త స్వరూపాత్ ప్రణవాత్మకాత్ పరబ్రహ్మణః సకాశాత్ హృల్లేఖార్ధభూతా । సర్వమంత్రమయీ మాతృకా సంజ్ఞికాశబ్ద బ్రహ్మాత్మికా మహదహంకారాది పంచతన్మాత్రాది సమస్త ప్రపంచ కారణభూతా ప్రకృతి రూపామాయారజ్జు సర్పవత్ వివర్తరూపేణ ప్రాదుర్భూతా ॥ అని స్మరించి

మంత్రము :- తస్యా మాయాయాః సకాశాత్ యథోక్త మాకాశముత్పన్నం ఆకాశాద్వాయురుత్పన్నః । వాయోరగ్నిః అగ్నేరాపః । అద్భ్యః పృథ్వీ సమజాయత ॥ స్మరించి

మంత్రము :- "తేభ్యః పంచమహాభూతేభ్యః సకాశాత్ స్వశరీరం తేజః పుంజాత్మకం పురుషార్థసాధన దేవయోగ్యముత్పన్నం"

అని స్మరించి, ఆ తరువాత

మంత్రము :- "తస్మిన్ శరీరే సర్వాత్మకం సర్వజ్ఞం సర్వశక్తి సంయుక్తం సమస్త దేవతామయం సచ్చిదానంద స్వరూపం బ్రహ్మత్మ రూపేణాను ప్రవిష్టం" అని భావించవలెను. "ఇది భూతశుద్ధిః"



## అథ ప్రాణ ప్రతిష్ఠః

మంత్రము :- "అస్యశ్రీ ప్రాణప్రతిష్ఠా మంత్రస్య బ్రహ్మా-విష్ణు-రుద్రా ఋషయః ఋగ్యజుః సామానిచ్ఛందాంసిప్రాణశక్తిః దేవతా ఆం బీజం హ్రీం శక్తిః క్రౌం కీలకం ప్రాణస్థాపనే వినియోగః। ఙం కం ఖం ఘం గం నభోవాయ్వగ్ని జల భూమ్యాత్మనే హృదయా నమః। ఞం చం ఛం ఝం జం శబ్ద స్పర్శ రూప రస గంధాత్మనే శిరసేస్వాహా। ణం టం ఠం ఢం డం శ్రోత్ర వాఙ్మయన జిహ్వా ఘ్రాణాత్మనే శిఖాయై వషట్। నం తం థం ధం దం వాక్పాణి పాద పాయూప స్థాత్మనే కవచాయహుం। మం పం ఫం భం బం వక్తవ్యాదాన గమన విసర్గానందాత్మనే నేత్రత్రయాయవౌషట్। శం యం రం వం లం హం షం క్షం సం బుద్ధిమనోహంకార చిత్తాత్మనే అస్త్రాయఫట్॥

ఇట్లున్యాసమొనర్చి, అనంతరము నాభి నుండి పాదము వరకు (ఆం నమః) అనియు, హృదయమునుండి నాభి వరకు (హ్రీం నమః) అనియు ముఖము నుండి హృదయము వరకు (క్రోం నమః) అనియు న్యాస మొనర్చవలెను. (యం త్వగాత్మనే నమః) అని వాయువ్య మూల యందును (రం రక్తాత్మనే నమః) అని ఆగ్నేయ దిశయందు (మూల యందు)ను (లం మాంసాత్మనే నమః) అని తూర్పు దిక్కు నందును, (వం మేధాత్మనే నమః) అని పశ్చిమ దిశయందును, (శం అస్థ్యాత్మనేనమః) అని నైరుత్య మూలయందును, (సం శుక్రాత్మనే నమః) అని ఉత్తర దిక్కులోను (హం ప్రాణాత్మనే నమః) అని మధ్యభాగమందును,

(ఈ విధముగా హృదయ కమలమునందుమ) న్యాసమొనర్చవలెను. తదుపరి ధ్యానము "రక్తాంభోధిస్థ...ప్రాణశక్తిః పరానః" అని చెప్పి ప్రాణప్రతిష్ఠ జేయవలెను.

## ఇది ప్రాణప్రతిష్ఠః

అథ మహా మృత్యుంజయ జపః-ఆమీదట

మంత్రము :- "అస్య శ్రీ మహా మృత్యుంజయ మంత్రస్య వశిష్ఠ ఋషిః అనుష్టుప్ఛందః శ్రీ త్ర్యంబకరుద్రోదేవతా శ్రీబీజం హ్రీం శక్తిః మమ అభీష్ట సిద్ధ్యర్థే జపే వినియోగః" (ఇక్కడ ప్రత్యేకముగా ప్రయోగమునందు మొదట సంకల్పమును జెప్పి పునః వినియోగః, అని చెప్పవలెను, ఆ మీదట న్యాసము ధ్యానాదులను ఆచరించవలెను,) అని వినియోగముజేసిన తరువాత

"ఓం వశిష్ఠ ఋషయేనమః" అని శిరస్సునందును, "అనుష్టుప్ ఛందసేనమః" అని ముఖమునందును, "శ్రీత్ర్యంబకరుద్రో దేవతాయై నమః" అని హృదయమున "శ్రీం బీజాయనమః" అని గుహ్యస్థానమునను "హ్రీం శక్తయేనమః" అని పాదములందును ఋష్యాదిన్యాసమును జేయవలెను. ఆ పిదప కరన్యాసమును జేయువలెను. "ఓం హ్రౌం ఓం జూంసః భూర్భువఃస్వః త్ర్యంబకం ఓం నమో భగవతే రుద్రాయ శూల పాణయే స్వాహా-అంగుష్ఠాభ్యాం నమః। ఓం హ్రౌం ఓం జూంసః, భూర్భువఃస్వః యజామాహే ఓం నమో భగవతే రుద్రాయ శూల పాణయే స్వాహా-అంగుష్ఠాభ్యాం నమః। ఓం హ్రౌం ఓం జూం సం భూర్భువఃస్వః యజామాహే ఓం నమో భగవతే రుద్రాయ అమృత మూర్తయే మాంజీవయ-తర్జనీభ్యాం నమః। ఓం హ్రౌం ఓం జూం సః భూర్భువఃస్వః సుగంధిం పుష్టివర్ధనం ఓం నమో భగవతే రుద్రాయ చంద్ర శిరసే జటినేస్వాహా-మధ్య మాభ్యాంవ షట్। ఓం హ్రౌం ఓం జూంసః భూర్భువఃస్వః ఉర్వారుకమివ బంధనాత్ ఓం నమో భగవతే రుద్రాయ

త్రిపురాంతకాయ హ్రాం హ్రీం—అనామికాభ్యాం హుం । ఓం హ్రౌం ఓం జూంసః భూర్భువఃస్వః మృత్యోర్మోక్షీయ ఓం నమో భగవతే రుద్రాయ త్రిలోచనాయ ఋగ్యజుః సామమంత్రాయ - కనిష్ఠికాభ్యాం వౌషట్ । ఓం హ్రౌం ఓం జూంసః భూర్భువఃస్వః మామృతాత్ ఓం నమో భగవతే రుద్రాయ అగ్నిత్రయాయ జ్వలజ్వలమాం రక్షరక్ష అఘోరాస్త్రాయ-కరతల కర పృష్ఠాభ్యాం ఫట్" అని కరన్యాసమును జేయునది.

ఇదే మేరకు హృదయాదిన్యాసమును జేయవలెను, పిదప అక్షరన్యాస క్రమము- "త్ర్యం నమః" అని కుడిపాదము చివరలో

(ఓం నమః కం నమః యం నమః జాం నమః) అని కుడి పాదము యొక్క నాలుగు సంధుల యందును (మం నమః) అని యెడమ పాదము చివరలోను (హెం నమః సుం నమః గం నమః ధిం నమః) అని యెడమ పాదముయొక్క నాల్గు సంధులలోను, (పుం నమః) అనిగుహ్యస్థానమున (ష్టిం నమః) అని గుదస్థానమున, (వం నమః) అని ఉదరము (కడుపు)లోను (ర్ధం నమః)అని హృదయమున (నం నమః)అని కంఠము నందు, (ఉం నమః) అని కుడిచేయి చివరను (వాం నమః రుం నమః కం నమ మిం నమః) అని కుడిచేతి నాలుగు సంధులయందును [వం నమః] అని యెడమ చేయి చివరకు [ఓం నమః ధం నమః నాం నమః న్మృం నమః] అని యెడమ చేయి నాలుగు సంధులందును, (త్యోం నమః) అని ముఖమునందును, (ముం నమః) అని పెదవులలో (క్షీం నమః) అని నాసిక (ముక్కు)న (యం నమః) అని నేత్రములందును (మం నమః) చెవుల యందు (మృం నమః) అని కనుబొమ్మలపైన, (తాం నమః) అని తలపై అక్షరన్యాస మొనర్చవలెను. ఇక పదన్యాసక్రమము

[త్ర్యంబకం అని] సిరస్సుపై (యజామహె)అని కనుబొమ్మలపైన (సుగంధిం) అని నేత్రములపై (పుష్టివర్ధనం) అని ముఖమున (ఉర్వారుకం) అని కంఠమునందును, (మివ) అని హృదయమున (బంధనాత్) ఉదరమున (మృత్యోః) గుహ్యమునందు (ముక్షీయ) అని తొడలయందు, (మా) మో[ణ]కాలుపై (అమృతాత్) అని పాదములయందును పదన్యాసమును జేయవలెను. తదుపరి ధ్యానము

మంత్రము :- "హస్తాభ్యాంకలశద్వయామృత రసైరాప్లావయంతం శిరోద్వాభ్యాంతౌ దధతం మృగాక్ష వలయే ద్వాభ్యాం వహంతం పరం అంకన్యస్తకర ద్వయామృత ఘటం కైలాస కాంతంః శివం స్వచ్ఛాంభోజగతం నవేందుమకుటాభాతం త్రినేత్రం భజే ॥౧॥ "మృత్యుం జయ మహాదేవా! త్రాహిమాం శరణాగతం। జన్మమృత్యుజరారోగై పీడితం కర్మ బంధనైః ॥౨॥ తావ కస్త్వద్గత ప్రాణ స్త్వచ్చిత్తో హంసదామృడ। ఇతి విజ్ఞాప్యదవేశం జపేన్మృత్యుంజయం మనుం ॥౩॥ అని ధ్యానించి తదుపరి మూలమంత్రము :-

మంత్రము :- "ఓం హ్రౌం ఓం జూం సః భూర్భువఃస్వః త్ర్యంబకం యజామహె సుగంధిం పుష్టి వర్ధనం। ఉర్వారుకమివబంధనా న్మృత్యోర్మోక్షీయమామృతాత్। భూర్భువః స్వరోంజూంసహః హ్రౌం ఓం" ॥౧॥

ఈ విధముగా మంత్రము రుద్రాక్షమాల ద్వారా (రుద్రాక్షర మాలతో) గాని లేదా మధ్యమ మరియు అంగుష్ఠ వ్రేళ్ళ మధ్యనున్న పర్వముతో గాని (మణులను) గుంజాతూ [లాగుతు] ఏకాగ్రచిత్తుడై జపించవలయును. జపమును జేసిన పిదప పూర్వోక్తప్రకారము అంగన్యాసము నాచరించి ముగించవలెను. ఆ తదుపరి :-

మంత్రము :- "గుహ్యాతి గుహ్య గోప్తాత్వం గృహాణాస్మత్కృతం జపం ।
సిద్ధిర్భవతుమే దేవ త్వత్ప్రసాదాన్మహేశ్వరః ॥

అని యుచ్చరించి తరువాత యధాశక్తి మాహేశ్వరులను భోజన దక్షిణాదులతో తృప్తి పరచవలెను.

(ఇది మహామృత్యుంజయ జప శాంతి విధి పరిసమాప్తము)

## మఘారేవత్యాది నక్షత్ర గండాంత శాంతి ప్రయోగము

రేవతి, ఆశ్లేష, జేష్ఠ, ఈ నక్షత్రముల చివర రెండు ఘటికా, అశ్విని, మఘా, మూలా, ఈ నక్షత్రముల మొదట రెండు ఘటికా ; మొత్తం నాలుగు ఘటికలు త్రివిధ నక్షత్ర గండాంతము. ఇందు జననమైనచో నక్షత్ర గండాంత శాంతిని యనుష్ఠించవలెను. మఘా నక్షత్రము యొక్క ప్రథమ చరణమున జన్మించిన మూలానక్షత్రము వలెనే ఫలమును దెలియవలెను. (గ్రహించదగును) ఇందుకు గోప్రసవము, నక్షత్రాధిపతి పూజను, గ్రహ హోమాదులను జేయవలెను. రేవతి, అశ్వినీ, నక్షత్రముల ఇతర చరణముల యందు జన్మించిన యెడల విశేష-దోషము గలుగవు కనుక శాంతి నాచరించవలదు, ఐనను గణారాధనను ఆచరించవలెను.

# గండాంత శాంతి

గోముఖ ప్రసవమును జేసి, దేశకాలాదులనుచ్చరించి

మంత్రము :- "అస్యశిశో రేవత్యశ్విన్యా శ్లేషా మఘా సంధ్యాత్మక నక్షత్ర గండాంత జననసూచితారిష్ట నిరసనార్థం నక్షత్ర గండాంత శాంతిం కరిష్యే ॥

అని సంకల్పించి, గణపతి పూజా స్వస్తి పుణ్యాహవాచన, నాందీము ఖాదులనాచరించి, ఆచార్యునివరించి, వారికి తెల్లని రేష్మి వస్త్రమును సమర్పించి పుష్పమాలను సమర్పించవలెను. తరువాత ఆచార్యుడు తెల్లని ఆవాలును మంత్ర పురస్సరముగా ఎరచి (వేసి) భూశుద్ధి గావించి, ఒక కంచు పాత్రను దీసికొని దానిలో పాయసమునుగాని, పాలనుగాని పోసి (ఉంచి) దానిని వెన్నతో నింపిన శంఖమును తూర్పు దిశలో ఉంచి, దాని ముఖమున వెండితో జేయబడిన చంద్రుని ప్రతిమను ఉంచి

మంత్రము :- ఓం ఆప్యాయస్వసమేతుతె విశ్వతస్సోమ వృష్ణియం,
భవావాజస్యసంగథే "ఓం భూర్భువః స్వఃసోమ ఇహాగచ్ఛ
ఇహతిష్ఠ" అని యుచ్చరించి ఆవాహించి

"ఓం సోమాయనమః" అనే మంత్రముచేత శోడషోపచారములతో బూజించి తెల్లని వేయి పుష్పములతో పుష్పాంజలిసర్పించవలెను. పూజాంత్యమున

మంత్రము :- ఓం అప్యాయ......సంగథే ॥

అను మంత్రముచేత సహస్రావర్తి (వేయివార్లు) పూజించవలెను. పిదప దానికి ఉత్తర దిశ యందు రాగి పాత్రలో బంగారుతో నిర్మించిన బృహస్పతి ప్రతిమను ఉంచి

మంత్రము :- "ఓం బ్రహస్పతే అతియదర్యో అర్హాద్యుమద్విభాతి క్రతుమజ్జనేషు ॥
యద్దీదె యచ్ఛవసర్త ప్రజాతదదస్మాసు ద్రవిణం ధేహి చిత్రం" ॥
ఓం భూర్భువః స్వః బృహస్పతే ఇహాగచ్ఛ ఇహతిష్ఠ ॥

అని చెప్పి ఆవాహించి

మంత్రము :- "ఓం బృహస్పతయేనమః"

అను మంత్రముచేత షోడశోపచారములతో బూజించ వలెను. (ఈ విషయమున కొన్ని గ్రంథములలో నవగ్రహ హోమమును వ్రాయబడినది. విచారిస్తే ఈ నవగ్రహ హోమము యొక్క అవసరము లేకుండగనే ప్రధాన దేవతా హోమమును మాత్రమే జేయవలయునని మా మతము) తరువాత యజమాని ఆచార్యునకు శంఖము, ముత్యము, చంద్రుని ప్రతిమ మున్నగు వానిని సమర్పించి, యథోచిత దక్షిణ నొసఁగి మాహేశ్వరులకు భోజనము జేయించవలెను. (ఇది నక్షత్ర గండాంత శాంతిః)

## అథ సర్వనక్షత్ర సాధారణ శాంతి ప్రయోగము

ఏ నక్షత్రమునందు రోగముత్పన్నమగునో ఆ నక్షత్రము యొక్క శాంతి నాచరించు దినమున ప్రాతఃకాలమున లేచి నిత్య విధి నాచరించి, మంగళస్నానము నాచరించి, శివార్చనను దీర్చుకొని దేశకాలాదుల నుచ్చరించి,

మంత్రము :- "మమోత్పన్నస్యాముకవ్యాధేర్జీవచ్ఛరీరావిరోధేన సమూల నాశార్థ మముక నక్షత్రదేవతాభ్యాం జపంకరిష్యే" అని యుచ్చరించి (సంకల్పించి) (1008) వెయ్యిన్నూటాయెనమిది అథవానూటా యెనిమిది (108) సార్లు తత్తద్దేవతకు సంబంధించిన మంత్రమును జపించి అథవా మాహేశ్వరులతో జేయించి, శాంతి నాచరించవలెను. అది యెట్లనగా, దేశకాలాదులను ఉచ్చరించి

మంత్రము :- "మహోత్పన్న వ్యాధిర్జీవచ్ఛరీరా విరోధేనసమూలా నాశార్థ మముక నక్షత్రశాంతిం కరిష్యే"

అని సంకల్పించి గణపతి పూజాది ఆచార్య వరణాంతకర్మములను గావించి ఆచార్యుని బూజించవలెను. తరువాత ఆచార్యుడు పరిశుద్ధమైన స్థలములో బియ్యమును చతురస్రాకారముగా పరచి అచట యధావిధిగా కలశమును స్థాపించి, జలముతో నింపి, గంధము, సకలౌషధములను, గరిక, మామిడిచిగుళ్ళు ఐదువిధములైన వృక్షములయొక్క బెరడు (చెక్క) సప్త విధములైన మృత్తికా (మట్టి) పంచ రత్నములు, పంచగవ్యములు, సువర్ణము మొదలగు వాటిని ఆయా యా మంత్రములతో వేసి రెండు క్రొత్త వస్త్రములను గప్పి, సకల తీర్థములను ఆ కలశమునందు ఆవాహించి పూజించవలెను. పిదప నా కలశముపైన ధాతుమయ పాత్రనుంచి, అందులో సువర్ణ నిర్మితమైన (శాంతి నాచరించి) నక్షత్రదేవతయొక్క ప్రతిమను నిల్పి నక్షత్రదేవతయొక్క నామమంత్రముతో షోడశోపచారములతో పూజించాలి. తరువాత స్థండిలమును సిద్ధపరచి అగ్నిని బూజించి, ప్రతి ష్ఠాపన యొనర్చి, సూర్యాది నవగ్రహముల నర్చించి, అజ్యభాగాంతమున హోమమును జేసి, గరిక, నువ్వులు, పాలు, నెయ్యి వీటితో పైన జెప్పిన నక్షత్ర దేవతా మంత్రముతో నూటాయెనమిది (108) ఆహుతి

నొసఁగి (విశేషముగా రోగగ్రస్తుడైనయెడల వేయి. నూటాయెనమిది (1008) సార్లు ఆహుతి నొసఁగి) గాయత్రి మంత్రముతో నూటాయెనమిది (108) సార్లు హోమము నాచరించవలెను. ఇట్లాచరించి, హోమమును సమాప్తి జేసి, పెరుగన్నమును బలిదాన మొసఁగి, శాంతి కలశోదకముచేత యజమానున కభిషేకమును జేయించవలెను రోగి తన చేతితో ఆచార్యునకు గోవును, ప్రతిమను దాన మొసఁగవలెను. మరియు నెయ్యిలో ముఖమును జూచి, అట్టి నెయ్యిని మహేశ్వరులకు దానమొసఁగి శక్త్యను సారముగా గణారాధన నాచరించవలెను. మాహేశ్వరులు శాంతి పాఠమును బఠించి, ఆశీర్వాద మంత్రములతో నాశీర్వదించవలెను. అప్పుడు సమస్తము శాంతించును. (ఇది సర్వనక్షత్రశాంతి)

## అ థ గ్ర హ ణ శాం తి

ఎవరిజన్మరాసి జన్మనక్షత్రములో గ్రహణమగునో వారికి విశేషమైన అనిష్ట ప్రదమైనది కనుకనే అట్టివారు శాంతినిగాని, బింబదానమునుగాని, అవశ్యముగా నాచరించవలెను. అది యెట్టులనిన

చంద్రగ్రహణము ఉన్నప్పుడు వెండి చంద్రుని ప్రతిమను జేయించి సూర్యగ్రహణ మున్నప్పుడు బంగారముతో సూర్య ప్రతిబింబ ప్రతిమను మరియు బంగారముతో రెండు సర్ప ప్రతిమలను జేయించి, నెయ్యినింపిన రాగి పాత్రలోగాని, లేదా కంచు పాత్రలోగాని (నువ్వులు, వస్త్రము, దక్షిణ, సహితముగా) ఉంచి దేశకాలాదులను జెప్పి

మంత్రము :- "మమజన్మరాశి జన్మ నక్షత్ర స్థితాముక గ్రహణ సూచి సర్వానిష్ట ప్రశాంతి పూర్వకం । ఏకాదశ స్థాన స్థిత గ్రహణ సూచి తవచ్ఛుభఫలావాప్తయే బింబదానం కరిష్యే"

అని సంకల్పించి, సూర్య - చంద్ర - రాహు - గ్రహములను బూజించి (పూజా విధానమునందుక్తమైన విధముగా) ధ్యానించి, నమస్కరించి

మంత్రము :- "ఓం తమోమయ మహాభీమసోమ సూర్య విమర్దన । హేమతార ప్రదానేనమమశాంతిప్రదోభవ ॥౧॥ విధుంతుదనమస్తుభ్యం సింహికానందనాచ్యుత । దానేనానేన నాగస్య రక్షమాం వేధజాద్భయాత్ ॥౨॥" అని మంత్రము నుచ్చరించి

మంత్రము :- మమజన్మరాశి జన్మ నక్షత్ర చతుర్థాద్యనిష్ట స్థానస్థితాముక గ్రహణసూచిత సర్వానిష్ట ప్రశాంతిపూర్వకం । ఏకాదశ స్థానస్థిత వచ్ఛుభఫలావాప్త్యయే ఇదం సౌవర్ణం రాహుబింబం నాగం సౌవర్ణం సూర్యబింబం (వారాజితం చంద్రబింబం) ఘృతపూర్ణకాంస్య పాత్ర సహితం యథాశక్తి తిలవస్త్ర దక్షిణ సహితమముక గోత్రాయాముక శర్మణే మాహేశ్వరాయ తుభ్యమహం సంప్రదదే ॥

అని యుచ్చరించి పూజ్యుడైన మాహేశ్వరునకు ఒసంగవలెను. అనంతరము శాంతి పాఠమును బఠించి రాహుగ్రస్త రవి-చంద్రుల బింబావలోకనము జేయవలెను.

(ఇది గ్రహణశాంతి)



# కాకమైథున దర్శనాది శాంతి ప్రయోగః

మంత్రము :- "కాకోమ్మైథునయుక్తశ్చేచ్ఛ్వేతః సయదిదృశ్యతే సనరో మృత్యుమాప్నోతిహ్యథవా స్థానహనశనమ్॥౧॥ కాకస్యమైథునంపశ్యేత్కాకః శిరసిచేద్విశేత్ । శిరస్సురసి వాకుర్యాత్పక్షాఘాతం నఖైస్తథా ॥౨॥ విదారణంచ కురుతే శయనంచస్పృశేద్యది । తదావదేత్తు మరణం మహారిష్టమథోపివా॥౩॥ తద్దోషశమనాయేత్థం శాంతికర్మ సమాచరేత్"

కాకమైథునమును జూచినను, కాకితలపై గూర్చుండినను, తలనుగాని, అథవా ఎదనుగాని, రెక్కలు లేదా గోళ్ళతోగాని తాకించినను, నొప్పించినను, పడకను ముట్టినను, మహా అరిష్టము మరియు మరణము సంభవించును. ప్రయుక్త విధ్యుక్తముగా శాంతినాచరింపవలయును, ఎట్లనగా దేశకాలాదులను జెప్పి

మంత్రము :- "మమకాకిమైథునాది సూచిత సర్వానిష్ట ప్రశాంతి పూర్వక మాయురారోగ్య సుఖశ్రీ ప్రాప్త్యర్థం కాకమైథునదర్శనశాంతిం కరిష్యే"

అని సంకల్పించి గణపతిపూజా, పుణ్యాహవాచన ఆచార్యవరణాదుల నాచరించి గృహముయొక్క ఈశాన్య భాగమున స్థండిలమును జేసి, అందు పంచ భూసంస్కార పూర్వకముగా వరదనామక అగ్నిని స్థాపించి, దానికి ఈశాన్య దిశలో కలశమును స్థాపించి, కలశముపై పాత్ర నొకదానినుంచి, అందులో బంగారముతో జేయబడిన ఇంద్రుని ప్రతిమను మరియు రుద్ర ప్రతిమలను అగ్న్యుత్తారణపూర్వకముగా శుద్ధి యొనర్చిఉంచి

మంత్రము :- "ఓం త్రాతర మింద్రమవితార మింద్రగ్ం హవే హవే సుహవగ్ం శూరమింద్రమాహ్వయామిశక్రం పురుహూత మింద్రగ్ం

స్వస్తి నోమఘవాత్వింద్రః ఓం భూర్భువఃస్వః ఇంద్రఇహాగచ్ఛాగచ్ఛ ఇహతిష్ఠ ॥ అనియు

"ఓం త్ర్యంబకం యజామహే...మామృతాత్" "ఓం భూర్భువఃస్వః త్ర్యంబకం ఇహాగచ్ఛాగచ్ఛ ఇహత్తిష్ఠ" అని యుచ్చరించి, ఇంద్రుని మరియు త్ర్యంబకుల నావాహించి "ఓం ఇంద్రాయ నమః" అని నామ మంత్రముచేత ఇంద్రుని, "ఓం త్ర్యంబకాయ నమః" అను నామ మంత్రముచేత రుద్రుని షోడశోపచారములతో బూజించునది. పిదప పూర్వోక్త ప్రకారముగా నిర్మించిన హోమకుండములో "ఓం త్రాతార మింద్రం...మేఘవాధాత్వింద్రః" అను మంత్రముతో "ఓం త్ర్యంబకం...మామృతాత్" అను మంత్రముతో పలాశ సమిధను, నెయ్యిని, వ్రీహి (వరి ధాన్యమును) వీటితో ప్రత్యేకించి (౧౦౮) నూటా యెనిమిది సార్లు ఆహుతులనొసంగి మరియు బలిదానమును కూడ ఒసగి,

మంత్రము :- "ఓం ఐంద్రవారుణ వాయవ్యాః సౌమ్యావై నైఋుతాస్తథా। వాయసాః ప్రతి గృహ్ణంతు భూమానన్నం మయార్పితం" అనే మంత్రము నుచ్చరించి, పాయసము బలియొసంగి, పిదప పూర్ణాహుతి ఇచ్చి కలశోదకముతో యజమానుని యభిషేకించి, నెయ్యి నింపిన పాత్రలో ముఖమును జూచి, ఆచార్యునకు పాలిచ్చే సవత్స (లేగతోనున్న) గోవును, రెండు ప్రతిమలను సంకల్ప పూర్వకముగా నొసంగవలెను. ఆమీదట 25 అథవా 27 మంది మాహేశ్వరులకు భోజనము జేయించి దక్షిణ తాంబూలాదులతో తృప్తిపరచవలెను. మాహేశ్వరులు స్వస్తి వాచన పూర్వకముగా నాశీర్వదించవలెను.

"ఏవం కృతే భవేచ్ఛాంతిః కాకారిష్టవినాశినీ"
( ఇతి కాకమైథున దర్శనాది శాంతిః )

# అథ పల్లీ, సరట పతన శాంతి ప్రయోగః

పల్లీ (బల్లి) సరట (ఊసరవెల్లి-తొండ) ఈప్రాణులు తాకగానే (ముట్టగానే) స్నానముజేసి, గురు, జంగమముల పాద తీర్థమును స్వీకరించి, నెయ్యిని జూచి, దేశ కాలాదులను ఉచ్చరించి,

మంత్రము :- "మమపల్లీపతనజనితాశుభఫలనాశార్థం శుభఫలాభి వృద్ధ్యర్థం పల్లీపతనంవా (సరటారోహణ) శాంతిం కరిష్యే" అని సంకల్పించి, గణేశపూజ, పుణ్యాహవాచనము, ఆచార్యవరణాదుల నాచరించవలెను. తదుపరి ఆచార్యుడు యథావిధి కలశమును స్థాపించి, దానిపైన రుద్రమూర్తిని, బంగారముతో జేయబడిన పల్లీ విగ్రహాన్ని, అథవా సరట (తొండ) ప్రతిమను ఉంచి రెండు ఎరుపు వస్త్రములను వాటిపై గప్పి, షోడశోపచారములతో బూజించునది. తరువాత అగ్ని ప్రతిష్ఠాపన యొనర్చి ఆజ్య భాగాంతముగా హోమము నాచరించి

మంత్రము :- "త్ర్యంబకంయజామహే... మామృతాత్" అను మృత్యుంజయ మంత్రముతో, తిల-ఖదిరసమిత్తులతో నూటా యెనమిది [108] ఆహుతుల నొసఁగి కలశోదకముచేత యజమానుని అభిషేకించి, బంగారము, వస్త్రము, నువ్వులు, ప్రతిమలను ఆచార్యునకు దానముగా నొసఁగి యథాశక్తి గణతృప్తి గావించవలెను.

[ఇది శాంతి ప్రకరణములో పల్లీ సరట పతనశాంతి సమాప్తము]

# వ్రత ప్రకరణము

<u>హరతాలికా వ్రతము :-</u> [ఈ వ్రతమును మాంగల్యాపేక్షులైన కన్నియలతో నాచరించబడును.] ఇది భాద్రపదశుక్ల తృతీయా తిథియందాచరించ దగును. ఆ దినమున కన్నియ నదినుండిగాని, వాగునుండిగాని, ఇసుకను దెచ్చి దానితో ఈశ్వరుని [లింగాకారమును] జేసి బూజించవలెను.

సంకల్పము :- వ్రతమునాచరించు కన్య దేశకాలాదుల నుచ్చరించి

మంత్రము :- "మమసమస్త పాపక్షయ పూర్వక సప్తజన్మ సౌభాగ్యాది వివిధ భోగప్రాప్తి ద్వారా ఉమామహేశ్వర ప్రీత్యర్థం ఆచరితం హరతాలికా వ్రతపూజనమహం కరిష్యే"

అని సంకల్పించి, పూర్వోక్త ఉపచారములతో [ఇసుకతో జేయబడిన] మహాదేవ మూర్తిని [విగ్రహాన్ని] బూజించవలెను. పిదప యథాశక్తి మాహేశ్వరులను తృప్తిపరచవలెను.

[ఇది హరతాలికావ్రతము]

<u>స్వర్ణగౌరీ వ్రతము :-</u> ఈ వ్రతమును భాద్రపదశుద్ధ [శుక్ల] తృతీయాతిథియందు ఆచరించవలెను. సంకల్ప దేశకాలాదులను బేర్కొని,

మంత్రము :- "మమఇహజన్మని జన్మాంతరేచ అక్షయ సౌభాగ్యప్రాప్తి కామాయాః పుత్రపౌత్రాది ధనధాన్య ఐశ్వర్యప్రాప్త్యర్థం శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం స్వర్ణగౌరీవ్రతమహం కరిష్యే" అని సంకల్పించి

మంత్రము :- "దేవదేవి సమాగచ్ఛ ప్రార్థయేహం జగన్మయే ।
ఇమాం మయాకృతాం పూజాం గృహాణ సురసత్తమే"

అని యుచ్చరించి గౌరీ దేవిని ఆవాహించునది, ఆ మీదట

మంత్రము :- "భవానీత్వం మహాదేవి సర్వసౌభాగ్యదాయకి ।
అనేకరత్న సంయుక్తం ఆసనం ప్రతిగృహ్యతాం"

అని చెప్పి ఒక బిల్వపత్రిని ఉంచి,

మంత్రము :- "సుచారుశీతలం దివ్యం నానాగంధ సువాసితం ।
పాద్యం గృహాణ దేవేశి మహాదేవి నమోస్తుతే"

అని పాద్యోదకముతో నభిషేకించి,

మంత్రము :- "శ్రీ పార్వతీ మహాభాగే శంకర ప్రియవాదిని ।
అర్ఘ్యం గృహాణ కల్యాణి భర్త్రా సహపతివ్రతే"

[బంగారు రేకుతో గౌరీ ప్రతిమను జేయించి దానిని బూజించవలెను. షోడశోపచారములతో సమయానుసారముగా బూజించవలెను.]

## నా క బ లి  వి ధా న ము

ధార ఎరచిన పిదప నాలుగవదినమునందు రాత్రి పురోహితుడు వివాహ మండపములో రంగవల్లి ముగ్గులతో సరోవరముగా వ్రాసి, దాని మధ్య ఎనిమిదిదళములుండిన కమలమును వ్రాసి, దానిచుట్టు బియ్యముతో గోడవలె నొక గీతను వదలి, కమలము మధ్యన ఐదు రంగులుగల హంస శుకాదులను వ్రాయవలెను. సరోవరమునకు కుడి ప్రక్కన బియ్యములో

ఏనుగును, ఎడమ ప్రక్కన ఉప్పు ఏనుగును ఇవి రెండును ఎదురెదురుగా నుండునట్లుగా వ్రాసి, సరోవరము మధ్యన పూలమాలలతో నలంకరించిన ఖడ్గమునుంచి, సుగంధ విశిష్టములైన రంగునీటితో నింపిన రెండు పూర్ణ కుంభములనుంచి, పుష్పాదులతో నలంకరించి, సరోవరమునకు ఉత్తర భాగమున ఒకటి రౌతు [సిల]పై నొకటి బెల్లముపడి యచ్చులో జిలుకరను నింపి ఉంచి, చుట్టు దీపములను వెలిగించి, [మంగళ వాయిద్యాలు మ్రోగుచుండ] వరుడు పత్నీసమేతముగా సరోవరమునకు పడమరదిశలో పీటలపై గూర్చుండి ప్రాణాయామము నాచరించవలెను.

## ప్రాణాయామము (అంతరింద్రియ శుద్ధి)

అంతరింద్రియముల శుద్ధి కొరకు ప్రాణాయామమునను ష్ఠింపవలెను. సాధకుడు పద్మాసనాసీనుడై కూర్చుండి మూలబంధ, కుడ్యాణబంధముల నాచరించి కనిష్ఠ-అనామిక వ్రేళ్ళతో ముక్కు యొక్క ఎడమ భాగమును బిగియబట్టి, మాత్రాగణనము లేకుండగ ముక్కు యొక్క కుడి రంధ్రము నుండి లోపలి వాయువును పూర్తిగ వెలుపలికి వదలవలెను. (రేచకము) పిదప ముక్కు యొక్క కుడి భాగమును బొటన వ్రేలితో బిగియబట్టి, ఎడమ రంధ్రము నుండి నెమ్మదిగా (నిధానముగ) ౧౨ మాత్రల కాలము వాయువును లోపలికి పీల్చుకొని (పూరకము) కనిష్ఠానామికలతో దానిని బిగియబట్టి ౧౨ మాత్రల కాలము కుంభకము (నిల్పి) జేసి, మరల అన్నే మాత్రల కాలము కుడి భాగము నుండి రేచకను గావించ (వెలుపలికి వాయువును వదలి) వలెను. ఇట్లు మూఁడు సార్లు ఆచరించిన మధ్యమ ప్రాణాయామమనియు ఇట్లే 36 మాత్రల కాలము ఆచరించినచో శ్రేష్ఠమైన ప్రాణాయామమని పేరు. దీనిని గురు ముఖమునుండి దెల్పికొని చాల మెలకువతో జేయవలెను. తరువాత చేయి కడుగుకొనవలయును.

# నాంది సమారాధనము

ఒక తాంబాణము (కంచము)లో బియ్యమును బోసి(నింపి) అందులో నందీశ్వరాది 24 జన ప్రమథుల పేర్లను వ్రాసి, టెంకాయ, అరటి పండ్లు, ద్రాక్షాది ఫలములను తాంబూలమును ఉంచి, 24 దక్షిణముల నుంచి, దేశాది కాలములను (సంకల్పము)ను జెప్పి,

మంత్రము :- "ఏవంగుణ విశేషణ విశిష్టాయాం అస్యాం శుభతిథౌ ఆద్య కరిష్య మాణ గర్భాదానాంగ భూతనాందీ శోభన దేవతానుద్దిశ్య నాంది శోభవ దేవతా ప్రీత్యర్థం నాందీ సమారాధనాఖ్యం కర్మ కరిష్యే" అని సంకల్పించి

మంత్రము :- "శ్రీ నంది-భృంగి-రిటి-వీరక-వీరభద్ర-పుష్పదంత-అండా భరణ - దండపాణి-చండేశ్వర - దారుక - రేణుక - వికర్ణ - విజయకర్ణ-ఘంటాకర్ణ-గోకర్ణ-రేవణసిద్ధ-మరుళసిద్ధ- ఏకోరామ- పండితారాధ్య-సుకేతు-రురు-ఉపమన్యు-భృగు-దధీచిగౌత-మాది-మహా ప్రమథగణాన్ పురాతన భక్త మహా గణానత్ర ఆవాహయామి ॥ నంద్యాది మహా గణాస్స్వాయుధాస్స శక్త యస్సపరివారా సమాగత్యాత్ర పూజాం భవంతో గృహ్ణంతు" అని చెప్పి 2 వస్త్రములను గప్పి, పూర్వోక్త ఉప చారములతో బూజించి, తాంబాణం (కంచము)లో ఉంచిన ఆ డబ్బును

మంత్రము :- హిరణ్య గర్భగర్భస్థం-హేమబీజం విభావసో । అనంత పుణ్యఫలదమతః శ్శాంతి ప్రయచ్ఛమె ॥ అనేన హిరణ్యేన నాందీ శోభన దేవతాః ప్రియంతాం ॥

అని దక్షిణను మాహేశ్వరులకు దాన మొసంగవలయును. తరువాత 24 మంది వీరమాహేశ్వరులకు భోజనము జేయించి-దక్షిణ-తాంబూలాదులను ఇచ్చి సంతృప్తి పరచవలెను. "ఇవె నాందీ"

## అథ గర్భాధాన విధిః

రాత్రియందు పత్నితోబాటు భద్రపీఠమున గూర్చుండి ప్రాణాయామము నాచరించి, ఫలపూజ నొనర్పవలెను.

ఎట్లనగా :- దేశ కాలాదులను బేర్కొని,

మంత్రము :- "ఏవంగుణ విశేషణ విశిష్టాయాం అస్యాం శుభతిథౌ సత్సంతాన సౌభాగ్య ఫలసిద్ధి ద్వారా ఫల దేవతాంతర్వర్తి శ్రీ సాంబ సదా శివ ప్రీత్యర్థం ఫల పూజాఖ్యం కర్మ కరిష్యే" అని సంకల్పమును బఠించి

మంత్రము :- "యాః ఫలనీర్యా అఫలా, అపుష్పయాశ్చపుష్పిణీః । బృహస్పతి ప్రసూతాస్తానో ముంచత్వగ్ం హసః ॥ ఈ మంత్రంతో ఫల దేవత నాహ్వానించి,

"ఫల దేవతాభ్యోనమః" అను నామ మంత్రము చేత అష్ట విధార్చనతో పూజించి,

మంత్రము :- "అనయా పూజయా భగవాన్సర్వాత్మక శ్రీ సాంబసదా శివ సుప్రీతస్సుప్రసన్నో వరదో భవతు ॥"
అని యుచ్చరించి తర్పణమును వదలవలెను. (సమర్పించవలెను) తదుపరి,

మంత్రము :- "విష్ణుర్యోనింకల్పయతు త్వష్టా రూపాణిపిగ్ంశతు । ఆసించతు ప్రజాపతిర్ధాతా గర్భందధాతుతే । గర్భందేహిసినీవాలి, గర్భందేహి సరస్వతి । గర్భంతే అశ్వినౌ దేవావాధత్తాం పుష్కరస్రజా । హిరణ్మయీ అరణీయన్నిర్మంథతో అశ్వినా । తంతే

గర్భగ్ం హవామహే దశమేమాసిసూతవే | యథేయం పృథ్వీ మహితిష్ఠంతి గర్భమాదధే ఏవంతం గర్భమా ధేహి దశమే మాసిసూతవే । యథాపృథివ్యగ్ని గర్భాద్యౌర్యథేంద్రేణ గర్భిణీ వాయుర్యథా దిశాం గర్భ ఏవ గర్భం దధాతుతే | విష్ణోశ్రేష్ఠేన రూపేణాస్యాం నార్యాంగవీన్యాం । పుమాంసం గర్భమాదేహి దశ మేమాసెసూతవే | నెజమేష పరాపత సుపుత్రః పునరాపత । అస్యైమే పుత్రకామాయై గర్భమాధేహియఃపుమాన్ । వ్యస్య యోనిం పతిరేతో గృహాణపుమాంపుత్రోధీయతాం । గర్భే అంతఃతం మాతా దశమాసోబి భర్తు సజాయతాం వీరతమస్వావాం ఆతగర్భోయోనిమేతుపుమాన్బాణ ఇవేషుధిం | అ వీరోజాయతాం పుత్రస్తేదశమాస్యః కరోమితే ప్రాజా పత్యమా గర్భోయోనిమేతుతే అనూనః పూర్ణోజాయతామశ్లోణో పిశాచ ధీతః । పుమాగ్ంస్తె పుత్రోనారితం పుమాననుజాయతాం । యాని భద్రాణి బీజాన్వృషభాజనయంతినో । తాని భద్రాణి బీజాన్వృషభాజనయంతినః । తైస్త్వం పుత్రాన్విందస్వసాప్రసూర్ధేను కాభవ । కామః సమృద్ధ్యతాం మహ్యమపరాజిత మెవమె । యం కామంకామయే దేవతం మేవాయో సమర్ధయ ॥

అని గర్భాధాన సూక్తమును జపించి, పత్నిని ముట్టి అభిమంత్రించి

మంత్రము :- "ఫలం మనోరథ పలం ప్రదదాతి సదాన్నృణాం । పుత్ర పౌత్రాభి వృద్ధ్యర్థం అత శ్శాంతిం ప్రయచ్ఛమే ॥ ఇదం ఫలదానం సదక్షిణాంసతాంబూలం శ్రీ సాంబ సదా శివ ప్రీతింకామయ మావస్తుభ్యమహంసంప్రదదే నమమ నమమ ॥

అని చెప్పి, మాహేశ్వరులకు ఫలదాన మొలంగవలెను.

మాహేశ్వరులు :- "ఉభయో సత్సంతాన సౌభాగ్య ఫల సిద్ధిరస్తు" అని ఆశీర్వదించవలెను. అనంతరము పత్నితో సంభోగించ వలెను. (ఋతు మతియైన నాలుగవ దినము మొదలుకొని సమదినములు సంతానదాయకములు).

(ఇది గర్భాధాన విధి)

## అథ పుంసవన విధి

మూడవ నెలలోగాని, నాలుగవ నెలలోగాని, పుంసవనమును జేయుదురు. పుంసవనము కార్యారంభమునకు మొదటి దినమున శుభ తిథిలో దంపతులు ప్రాతఃకాలమున లేచి నిత్య కర్మలను ముగించుకొని, మంగళస్నానమునాచరించి, శివపూజాది కర్మలను పూరయించి, పతి పత్నిని దన కుడిపైపున గూర్చుండ బెట్టుకొని, ఆచమన ప్రాణా యామములను జేసి దేశ కాలములను జెర్కొని,

మంత్రము :- "ఏవంగుణ విశేషణ విశిష్టాయాం అస్యాం శుభ తిథౌ మమ ధర్మ పత్న్యాః గార్భిక బైజిక దోష పరిహారార్థం, ఆధార సంస్కారద్వారా ఆధేయ సంస్కారార్థం పుగ్ం సవనాఖ్యం కర్మ కరిష్యే ॥

అని సంకల్పమొనర్చి పుంసవన కర్మాంగ భూతములైన స్వస్తి పుణ్యాహవాంది వాటిని (గర్భాధాన విధిలో జెప్పబడిన రీతిగా) ఆచరించవలెను.

రెండవ దినమునందును శివపూజాది నిత్యకర్మల నాచరించి, పవిత్రమైన వానితో దేశకాలాదులను జెప్పి,

మంత్రము :- "ఏవంగుణ శుభతిథౌ ధర్మపత్నీ సమేతస్యమను పుగ్ంసవనాంగత్వేన ఉభయోః రక్షార్థం రక్షాబంధ నాఖ్యం కర్మ కరిష్యే"

అని సంకల్పమును జెప్పి, ఒక తాంబాళములో బియ్యమును బోసి, అందు తమలపాకులు, పోకలు, టెంకాయ, భస్మము, వీనినుంచి, కంకణమును బెట్టి (పూజా ప్రకరణములో జెప్పిన విధముగా శోడషోపచారములతో బూజించి,

మంత్రము :- "త్రియంబకంయజామహే, సుగంధిం పుష్టి వర్ధనం। ఉర్వారుకమివ బంధనాన్మృత్యోర్మోక్షీయ మామృతాత్" అని యుచ్చరించి, భస్మలేపన మొనర్చి,

మంత్రము :- "విశ్వాత్తాతెనవేనేషు ప్రవాచాయాచకత్తమఘవన్నింద్రసున్వతె పారావతం యత్పురుసంభృతంవస్వపావృణోః శరభాయ బుషిబంధవె"

అని పురుషుని కుడిచేతికి,

మంత్రము :- "బృహత్సాను క్షత్రభృద్వృద్ధవృష్ణియం। త్రిష్టుభోజశ్శుభితముగ్రవీరం। ఇంద్రం సోమేన పంచదశేన మధ్య మిదం వాతేన సగరేణ రక్ష"

ఈ మంత్రమునుచ్చరించి స్త్రీ యెడమ చేతికి గట్టవలెను. ఆ మీదట భర్త మినుములు, గోధుమలు, పెరుగులో గల్పి దానిని పత్ని కివ్వగా, ఆమె

మంత్రము :- "పుగ్ంసవనమసి"

అని చెప్పి తినవలెను. ఇదే విధముగా మూడు సార్లు భర్త ఇవ్వవలెను. పత్ని మూడు సార్లు స్వీకరించి సేవించవలెను. (దీనికే

అనవలోమన మందురు.) తరువాత భర్త తెల్లని గరిక దంచి క్రొత్త వస్త్రములో బెట్టి, పత్నిని అంతర్గృహమునకు దోడ్కొనిపోయి, వెనుక గర్భాధాన విధిలో జెప్పిన గర్భాధాన సూక్తము

మంత్రము :- "ఆతగర్భోయోనిమేతు పుమాన్బాణ ఇవేషుధిం" అని ప్రారంభించి సంపూర్ణ సూక్తమును బఠించి, పత్ని కుడి ముక్కులో పిండవలెను.

పిదప గురు-జంగమముల సన్నిధిలో

మంత్రము :- కంకతోన, కంకతోధో సతీన కంకతః । ద్వాపిరి వృషి ఇతిన్యా అదృష్టా ఆలిప్సతా ॥ కంకణం మోచయామ్యద్య రక్షాస్మిన్న కదాచన । మయి రక్షాం స్థిరాబధ్వా దేవత్వం గచ్ఛకంకణ ॥
ఆని యుచ్చరించి కంకణమును విడదీయవలెను.

(ఇతి పుగ్ంసవనం)

## సీమంత కర్మ

సీమంత కర్మమును 4-6-8, మాసములలో శుక్లపక్షము పురుష నక్షత్రముల యందు జేయవలెను. గృహమును పూర్వోక్త ప్రకారముగా ఇల్లంతా సమ్మార్జన యొనర్చి రంగు ముగ్గులతో నలంకరింపజేసి, స్వస్తి వాచననాందీ సమారాధనలను ఆచరించి, పరిశుద్ధమైన స్థలమున భద్ర పీఠముపై కుడి ప్రక్కన భార్యను గూర్చుండ బెట్టుకొని ప్రాణాయామము నొనర్చి,

మంత్రము :- "ఏవంగుణేత్యాది శుభతిథౌ మమ్మై తస్యాః ధర్మపత్న్యాః గార్భిక బైజిక దోష పరిహారార్థం క్షేత్ర సంస్కారార్థం ప్రథమ గర్భ సంస్కార ద్వారా సర్వ గర్భ సంస్కారార్థంచ సీమంతోన్నయనాఖ్యం కర్మ కరిష్యే"

అని సంకల్పించి, పునః ప్రాణాయామము నాచరించి,

మంత్రము -: "ఏవంగుణ......శుభతిథౌ సీమంతోన్నయనాంగత్వేన ఉభయోరక్షార్థం, రక్షాబంధనం కరిష్యే" అని సంకల్పమును బలికించి (ఇంతకు పూర్వము పుంసవనమునందు జెప్పిన విధముగా) కంకణమును బూజించి ధరింపఁజేయువలయును. ఆ పిదప భార్యను తూర్పు ముఖముగా గూర్చుండబెట్టి, తాను పడమర దిశగా నెదుట గూర్చుండి, మూఁడు అడవి పందియొక్క వెంట్రుకలు, మూఁడు దర్భగుతి, మేడి చిగుళ్ళను జతజేసి పట్టుకొని, నుదురు మొదలగొని పాపెట దీసినంతవరకు,

మంత్రము :- "ఓం భూర్భువస్సువోరాకామహాగ్ం సుహవాగ్ం సుష్టుతీ హువేశ్రుణోతునస్సుభగాబోధతుత్మనా। సీవ్యత్వ పస్సూచ్యాచ్ఛిద్యమాన యాదదాతు। వీరగ్ం శతదాయ ముక్థ్యం। యాస్తేరాకె సుమతయస్సుపృశసో యాభిర్దదాశి దాశుషేవసూని। తాభిర్నో అద్య సుమనాఉపాగహి। సహస్ర పోషగ్ం సుభగేరరాణ"

అను మంత్రమును ఉచ్చరించి, మూడు పార్లుగాని, నాలుగు పార్లుగాని, వ్రాసి వాటిని అక్కడే ఉంచి ఆగ్రామమునకు సమీపములోనున్న నదిని ధ్యానించి, భార్య కంఠములో (మొదటె స్మరించి వరుసగా దండ గుచ్చినట్లు) గోధుమల మాలను వేయవలెను. తదుపరి,

మంత్రము :- "గాయేతామితి వీణాగాధి నౌసగ్ం శాస్తి । సోమయే వనోరాజేత్యాహుర్బ్రాహ్మణీ ప్రజాః । వివృత్తచక్ర ఆసీనాస్తి రేణయమునే తవ ॥

అనిచెప్పి వీణాగానమును జేయించి, ముత్తైదువలు మంగల ప్రదమైన పాటలను బాడిన బిదప మాహేశ్వరులచేత ఆశీర్వాదములనుబడసి దేవ-గురు సన్నిధిలో (సమ్ముఖమున) కంకణ విసర్జనము జేయవలెను. కర్మాంగము ననుసరించి యథాశక్తి మాహేశ్వరా రాధన జేయవలెను.

ఇది సీమంత విధి

## చౌల కర్మ విధానము

చౌల (పుట్టు వెంట్రుకలు దీయుట) కర్మను జేయించునపుడు శిశువున కనుకూలమైన శుభముహూర్తములో శిశువు తల్లిదండ్రులు మంగల స్నానము నాచరించి, ఆచమనము ప్రాణాయామము నాచరించి, దేశ కాలాదులను బేర్కొని,

మంత్రము :- "ఏవంగుణ......... అస్యాం శుభతిథౌమమ కుమారస్యాయుష్యాభి వృద్ధ్యర్థం. ఇమం......శర్మాణం చౌలేన కర్మణా సగ్ం స్కరిష్యే ॥

ఈ ప్రకారముగా సంకల్పమును జెప్పి, పుణ్యాహనాంది కర్మల నాచరించి,
"చౌల కర్మాంగత్వేన రక్షార్థం రక్షాబంధనం కరిష్యే"
ఈ విధముగా ఉచ్చరించి కుమారునకు పూర్వోక్త అన్న ప్రాశన

విధిలో జెప్పిన రక్షాబంధన మంత్రముచేత (బృహత్సామ...రక్ష) చేతికి కంకణమును ధరింపజేసి పిల్లవానిని పూర్వ దిక్కు (తూర్పు)నకు ముఖము జేసి కూర్చునబెట్టి తూర్పు మొదలుకొని నాల్గు దిక్కులలో గోమయము చేత ముద్దలను జేసియుంచి

మంత్రము :- "ఉష్ణేన వాయఉదకేనహ్యే దితిః కేశాన్వపతు"

అను మంత్రమును జెప్పి ఉదకమును జేతబూని బాలుని తలకు ప్రోక్షించవలెను. (నీళ్ళతో తలకు రుద్దాల) ఆపైన 3 దర్భలను బాలుని యెదుటబెట్టి,

మంత్రము :- "యేనావపత్సవితాక్షురేణ సోమస్య రాజ్ఞో వరుణస్య విద్వాన్। తేన బ్రహ్మణోవపతే దమస్యాయుష్మాన్ జరదష్టిర్యథా సత్"

ఈ మంత్రముతో ముందున్న వెంట్రుకలను దీసి నీటిని స్పర్శింపజేసి గోమయపు ఉండను (ముద్దను) పూర్వపు దిక్కున నున్న ముద్దలో ఉంచవలెను. తరువాత 3 దర్భలను దక్షిణ దిక్కున ఉంచి,

మంత్రము :- "యేన పూషాబృహస్పతేరగ్నేరింద్రస్యచాయుషేవపత్। తేనాస్యాయుషే వపసౌ శ్లోక్యాయ స్వస్తయే"

ఈ మంత్రముతో దక్షిణ భాగమునున్న వెంట్రుకలను దీసి నీటితో స్పర్శింపజేసి దక్షిణ గోమయపు ముద్దలో నుంచవలెను. తరువాత 3 దర్భలను పశ్చిమ దిశపు వైపు ఉంచి

మంత్రము :- "యేన భూయశ్చరాత్ర్యయం జ్యోక్చపశ్యాతి సూర్యం। తేనాస్యాయుషేవపసౌ శ్లోక్యాయ స్వస్తయే"

ఈ మంత్రముచేత పశ్చిమ దిక్కున ఉన్న వెంట్రుకలను దీసి జలముతో స్పృశింపజేసి పశ్చిమ దిశలో నున్న గోమయపు ముద్దలో ఉంచవలెను. తరువాత 3 దర్భలను ఉత్తర దిక్కున ఉంచి,

మంత్రము :- "యేన పూషా బృహస్పతేరగ్నేరింద్రస్యచాయుషే వపత్। తేనతేవపామి...శర్మన్నాయుః షావర్చసాయథా। జోక్సుమనా అసాః"

మంత్రము :- "ఈ మంత్రముతో ఉత్తర దిక్కు వెంట్రుకలను దీసి ఉత్తర దిశలోనున్న గోమయపు ఉండలో ఉంచి, స్నానముజేసి శుచియై క్షురికునితో (మంగలి చేత) మిగత వెంట్రుకలను దీయించి, త్రిశిఖ, ఏకశిఖ, లేదా ముందు రుద్రజడను-ఇందులో తమ ఇష్టానుసారముగా ఒక విధముగా వెంట్రుకలుదీసి, ఆ తీసిన వెంట్రుకలను బాలుని తల్లి (తల్లిలేని పక్షమున) ఆ బాలుడె దీసి కెళ్ళి మెడిచెట్టు క్రిందగాని గరిక (దర్భ) బెరిగిన స్థలము నందుగాని ఉంచి వచ్చి బాలునకు

మంత్రము :- "ఓం హిరణ్య శృంగం వరుణం ప్రపద్యే తీర్థంమే దేహియాచతః। యన్మయా భుక్తమసాధూనాం పాపేభ్యశ్చ ప్రతిగ్రహః। యన్మేమనసా వాచా కర్మణావా దుష్కృతం కృతం। తన్న ఇంద్రో వరుణో బృహస్పతిస్సవితాచ పునంతు పునః పునః। నమోగ్నయేఽప్సుమతే నమ ఇంద్రాయ నమో వరుణాయ నమో వారుణ్యై నమోద్భ్యః। యద పాంక్రూరం యదమేధ్యం, యద శాంతం తదపగచ్ఛతాత్। తన్నోవరుణో రాజాపాణి నాహ్య వమర్శతు। సోహమపాపో విరజో నిర్ముక్తో ముక్త కిల్బిషః। నాకస్య పృష్ఠమారుహ్య గచ్ఛేద్బ్రహ్మసలోకతాం। యశ్చాప్సు వరుణస్స పునాత్వఘ మర్షణః"॥

ఇది చౌల విధి సమాప్తము

# అథ విద్యారంభ విధి

బాలుడు ఐదు సం॥ముల ప్రాయముగల వాడు కాగానే జ్యోతి శ్శాస్త్రము ప్రకారము శుభముహూర్తములో ప్రమథ గణాధీశుని (గణపతిని) పార్వతీదేవిని, పరమేశ్వరుని, శారదాదేవిని, గురు-లింగ-జంగమంబులను భక్తితో బూజించి, తల్లి, సోదరి మొదలగువారికి ప్రదక్షణ నమస్కారమును జేసి విద్యా గురువుల వారికి నమస్కరించగా, వారు "ఓం" అను అక్షరమును తాను వ్రాసి, తదుపరి అదే విధముగా బాలుని చేత వ్రాయించి చదివించవలెను. అక్కడికి విచ్చేసిన వీరమాహేశ్వరులకు దక్షిణ తాంబూలాదుల నొసగి ఆనందింపజేయవలెను.

ఇది విద్యారంభ విధానము

## అంకురారోపణము

ఆచార్యుడు దేశకాలాదులనుచ్చరించి

మంత్రము :- ఏవంగుణ...అస్యాం శుభతిథౌ దీక్షా కర్మ సాఫల్య నిరంతర శుభత్వ సిద్ధిద్వారా శ్రీపరమేశ్వరః ప్రీత్యర్థం అంకురారోపణం కరిష్యే"

అని సంకల్పమును జెప్పి పరిశుభ్రమైన భూప్రదేశములో బియ్యమును బోసి (పరచి) ఒక వెదురు బుట్టిని దీసికొని దారముతో జుట్టి, అందులో పుట్టమన్ను, వాక (వాగు)లోని మట్టిని, ఎండిన పేడ (ఏరు బిడుకల) పుడిని నింపి, గరిక, దూది, బిల్వపత్రి మొదలగు చిగుళ్ళతో పరచి, దానిపై రకరకాల పుష్పములను పరచి, మధ్య భాగము మొదలుకొని ఐదు స్థానములందు,

మంత్రము :- "ఈశానాయ నమః" అని మధ్యలో

మంత్రము :- "తత్పురుషాయ నమః" అని ఉత్తర దిక్కులో

మంత్రము :- "అఘోరాయ నమః" అని పశ్చిమ దిక్కులో

మంత్రము :- "వామదేవాయ నమః" అని దక్షిణ దిశలో

మంత్రము :- "సద్యోజాతాయ నమః" అని పూర్వ దిక్కున

ఈ నామ మంత్రములతో విభూతి గంధాక్షతాదుల చేత పూజించి, ఆ వెదురు బుట్టికి పడమర భాగములో కూర్చొని

మంత్రము :- "దిశాం పతి నమస్యామి । సర్వకామ ఫలప్రదాన్ కుర్వంతు సతతం కర్మ కుర్వంతు సతతం శుభం"

అను మంత్రమునుచ్చరించి నమస్కరించి, వడ్లు (వరి) ధాన్యము, పెసలు, శనగలు, నువ్వులు. గోధుమలు, ఈ యైదురకాల ధాన్యములను నీటితో గడిగి మొదలు పూజించిన ఈశానాదిగా గల ఐదు స్థానములలో విత్తి, (వాపన-నాటి)

మంత్రము :- "ఆపోహిష్ఠా మయోభువస్థాన ఊర్జేదధాతన మహేరణాయచ క్షసే। యోవశ్శివతమోరసస్తస్య భాజయతే హనః। ఉశతీరివ మాతరః తస్మా అరంగమామవో యస్యక్షయాయజిన్వథ। ఆపోజనయథాచనః ॥

అని నీరు వదలి పూర్వోక్త ఉపచారములతో పూజించాలి.



# మంటప దేవతా ప్రతిష్ఠ

యజమాని దేశకాలాదుల నుచ్చరించి

మంత్రము :- "ఏవం గుణ...అస్యాం శుభతిథౌ (శ్వః కరిష్యమాణ) అథవా (అద్య కరిష్యమాణ) దీక్షా కర్మాంగ భూతమంటప దేవతా స్థాపనం కరిష్యే" ఈ విధముగా సంకల్పించి

మంత్రము :- "యాః ఫలినీర్యా అఫలా అపుష్పాయశ్చ పుష్పిణీః । బృహస్పతి ప్రసూతాస్తానో ముంచత్వగ్ంం హసః"

ఈ మంత్రమును బఠించి మంటపముపై అక్షంతలు వైచి (చల్లి) ఇంద్ర (పూర్వ) దిక్కులో

మంత్రము :- "త్రాతారమింద్రమవితార మింద్రగ్ం హవేహవే । సువగ్ం శూరమింద్రం హవేను శక్రం పురుహూత మింద్రగ్ం స్వస్తినో మఘవాధాత్వింద్రః

ఇతి మంత్రేణ ఇంద్ర మావాహయామి

అని యుచ్చరించి ఇంద్రుని ఆహ్వానించి ఇంద్రపూజితులైన దశ రుద్రులను

మంత్రము :- "కపిలేశాయనమః । అజాయనమః । బద్ధాయ నమః । వజ్రదేహాయ నమః । ప్రమర్దనాయ నమః । విభూతయే నమః । అవ్యయాయ నమః । శాస్త్రే నమః । పినాకినే నమః । త్రిదశాధిపాయ నమః । ఇంద్ర వీర్యాః ఇంద్రపూజితాః హే దశరుద్రాః

సవాహనాస్స శక్తయస్స పరివారా సమాగత్యా త మంటపే మత్కృతాస శేషోపచారాంత్స్వీకృత్య ప్రసీదంతు భవతు ॥"

అని ఆహ్వానించి పంచోపచారములతో పూజించవలెను. ఆ పిదప ఆగ్నేయదిశలో

మంత్రము :- "త్వన్నో అగ్నేవరుణస్యవిద్వాన్ దేవస్య హే డోవయాసిసిష్ఠాః। యజిష్ఠో వహ్నిత మశ్శోశుచానో విశ్వాద్వేషాగ్‌ంసిప్రము ముగ్ధ్యస్మత్॥" ఇతి మంత్రేణాగ్ని మావాహయామి

అని ఆహ్వానించి అగ్నిపూజిత దశరుద్రులను

మంత్రము :- "అగ్ని వీర్యాయనమః। హుతాసినే నమః। పింగళాయనమః। ఖాదకాయనమః। హరాయనమః। జ్వాలాయనమః। దహనాయ నమః। బభ్రవేనమః। భస్మాంతకాయ నమః। క్షయాంతకాయ నమః। అగ్నివీర్యాః అగ్నిపూజితాః హే దశరుద్రాః। (సవాహనస్స శక్తయస్సపరివారా సమాగత్యాత్ర మంటపె మత్కృతావశేషోపచారాన్ స్వీకృత్య ప్రసీదంతు భవతః")

అని ప్రతి దిశలో నున్న (దశరుద్రాః) ప్రసీదంతు భవతః। దశరుద్రుల నాహ్వానించి, పూజించిన తరువాత దక్షిణ దిశలో

మంత్రము :- "సుగన్నః పంథామభయంకృణోతు। యస్మిన్ క్షత్రేయ మయేతి రాజా। యస్మిన్నేనమభ్యషించదేవాః। తదస్య చిత్రగ్ం హవిషాయజామ"

ఇతి మంత్రేణ యమమావాహయామి అనియు యముని నాహ్వానించి

మంత్రము :- "విధాత్రే నమః। కర్త్రేనమః ధాత్రేనమః। శ్రీ కామాయ నమః। సర్వనియోక్త్రే నమః। యామ్యేశాయ నమః। రమేశాయనమః। సంయోక్త్రే నమః । హరాయనమః । యమవీర్యాః యమపూజితాః హే దశరుద్రాః సవా...ప్రసీదంతు భవతః"

అని చెప్పి దశరుద్రుల నాహ్వానించి పూజించవలెను. నైరుతి దిశలో

మంత్రము :- "అసున్వంతమ యజమాన మిచ్ఛస్తే నస్తేత్యాం తస్కర స్యాన్వేషి। అన్యమస్మదిచ్ఛాసాత ఇత్యానమోదేవినిఋృతే తుభ్యమస్తు" ఇతి మంత్రేణ నిఋృతి మావాహయామి అని నైఋుతి నాహ్వానించి

మంత్రము :- "నైఋుతేశాయనమః । వరుణాయనమః । హంత్రేనమః। క్రూరదృష్టయేనమః । భయానకాయనమః । ఊర్ధ్వకేశాయనమః। విరూపాక్షాయ నమః । ధూమ్రాయనమః । లోహితాయ నమః । దంష్ట్రకాయ నమః । నైఋుతి వీర్యాః నైఋుతి పూజితాః హే దశరుద్రాః సం...ప్రసీదంతు భవతః"

అని ఉచ్చరించి నైఋుతిచేత పూజింపఁబడిన దశరుద్రులను ఆవాహించి బూజించవలెను.

వరుణుడు పశ్చిమదిశలో

మంత్రము :- "తత్వాయామి బ్రహ్మణావందమానస్తదాశాస్తే యజమానో హవిర్భిః । ఆహేడమానో వరుణేహ బోధ్యురుశగ్ంస మాన ఆయుః ప్రమోషీః" ఇతి మంత్రేణ వరుణమావాహయామి

అని వరుణుని నాహ్వానించి వరుణిచేత పూజితులైన

మంత్రము :- "బలాయనమః । అతి బలాయనమః । పాశహస్తాయ నమః । మహా బలాయనమః । శ్వేతాయనమః । జయభద్రాయ నమః । దీర్ఘబాహవే నమః । బలాంతకాయ నమః । బడబా ముఖాయ నమః । భైరవాయ నమః । వరుణవీర్యాః వరుణ పూజితాః హే దశరుద్రాః, సం...ప్రసీదంతు భవతః ॥"

అని చెప్పి దశరుద్రునాహ్వానించి, పూజించవలెను. వాయువ్యదిక్కులో

మంత్రము :- "ఆనోనియుద్భిశ్శతినీ భిరధ్వరం । సహస్రిణీభిరుపయాహి యజ్ఞం । వాయో అస్మిన్ హవిషమాదయస్వయూయం పాతు స్వస్తిభిః సదానః" ఇతి మంత్రేణ వాయుమావాహయామి

ఈ మంత్రముచేత వాయువును ఆహ్వానించి పూజించిన తరువాత దశరుద్రులను

మంత్రము :- "శీఘ్రాయనమః । లఘువేనమః । వాయువేగాయ నమః । సూక్ష్మాయనమః । తీక్షణాయ నమః । భయంకరాయ నమః । పంచాత్మకాయ నమః । పంచశిఖాయ నమః । కపర్దినే నమః । మేఘవాహనాయ నమః । వాయువీర్యాః వాయుః పూజితాః హే దశరుద్రాః" సం...ప్రసీదంతు భవతః

అని ఆవాహించి పూజించవలెను. కుబేర (ఉత్తర)దిశలో

మంత్రము :- "వయగ్‌ం సోమవ్రతేతవ మనస్తనూషుబిభ్రతః ప్రజావంతః సచేమహి । ఇంద్రాణీదేవి సుభగాసువత్నీ"

ఇతి మంత్రేణ కుబేరమావాహయామి ॥ అని కుబేరునావాహించి, కుబేరుని పూజించి, దశరుద్రులను

మంత్రము :- "నిధీశాయ నమః । రూపవతే నమః । ధన్యాయనమః । సౌమ్యాయ నమః । శాంతాయ నమః । జటాధరాయ నమః । కామ ప్రాసాదాయ నమః । లక్ష్మీశాయ నమః । ప్రకాశాయ నమః । ఇందుయజ్ఞపాయ నమః। కుబేరవీర్యాః, కుబేర పూజితాః హేదశరుద్రాః సం... ప్రసీదంతు భవతః"

అని ఆహ్వానించి పూజించవలెను. ఈశాన్య దిశలో

మంత్రము :- "తమీశానం జగతస్తస్థుషస్పతిం। ధియం జిన్వమవసేహూమహేవయం । పూషానో యథా వేదసామ సద్వృధే । రక్షితా పాయురదబ్ధ స్వస్తయే" ఇతి మంత్రేణ ఈశానమావాహయామి

అని ఈశానుని ఆవాహించి ఈశానునిచేత బూజితులైన దశరుద్రులను

మంత్రము :- "ఈశానాయ నమః । విద్యేశాయ నమః । జ్ఞానవతే నమః । మాతృపింగళాయ నమః । భూతపాలాయ నమః । అజాయ నమః । బలయే నమః। మిత్రాయ నమః। సర్వవిద్యాధిపాయ నమః। ముఖకృతే నమః। ఈశానవీర్యాః, ఈశాన పూజితాః, హే దశరుద్రాః సం... ప్రసీదంతు భవతః" (ఈ మంత్రముతో నావాహించి పూజించవలెను.) అధో (వాయవ్య పశ్చిమ దిక్కుల మధ్య) దిశలో,

మంత్రము :- ("స్యోనా పృథివీ భవానృక్షరానివేశినీ । యచ్ఛానః శర్మ సప్రథాః) "ఇతి మంత్రేణ విష్ణుమావాహయామి" అని విష్ణువు నావాహించి, విష్ణువుచేత బూజితులైన దశరుద్రులను

మంత్రము :- "బలిప్రియాయనమః । విషధరాయనమః । విరోగ్రసనాయ నమః । పాలకాయ నమః । శంభాయ నమః । సువీర్యాయ నమః ।

వృషభాయ నమః | పాతాళేశాయ నమః | లోహితాయ నమః | అనంతాయ నమః | విష్ణువీర్యాః, విష్ణుపూజితాః, హే దశరుద్రాః సం......ప్రసీదంతు భవతః" ఈ మంత్రముతో నావాహ్వానించి పూజించవలెను. ఊర్ధ్వ (ఈశాన్య దిశలమధ్య) దిక్కులో

మంత్రము :- "అస్మేరుద్రా మేహనాపర్వతాసోవృత్రహత్యే భరహూతౌ సజోషాః | యస్యం నతేస్తువతేధాయి వజ్రమింద్రజ్యేష్ఠా అస్మాన్ అవంతుదేవాః" ఇతి మంత్రేణ బ్రహ్మా మావాహయామి

అని బ్రహ్మానాహ్వానించి బ్రహ్మ పూజితులైన దశరుద్రులను

మంత్రము :- "అధ్యక్షాయ నమః | నభసే నమః | లిప్సవే నమః | శంభవే నమః | విభవే నమః | గణాధ్యక్షాయ నమః | వివాహాయ నమః | గుణసంవాహాయ నమః | త్ర్యక్షాయ నమః | త్రిదశ వందితాయ నమః | బ్రహ్మవీర్యాః బ్రహ్మపూజితాః, హే దశరుద్రాః సవాహనా సశక్త్యస్సపరివారా సమాగత్యాత్ర మంటపే మత్కృతాన శేషోపచారాం త్స్వీకృత్య ప్రసీదంతు భవతః"

అని ఆహ్వానించి పూజించవలెను. ఆ మీదట

మంత్రము :- "క్షేత్రైయ్యైత్వానిర ఋత్యైత్వాద్యహోముంచామి వరుణస్య పాశాత్ | అనాగసంబ్రహ్మణేత్వా కరోమి శివేతేద్యావా పృథివీ ఉభేఇమె"

ఈ మంత్రము నుచ్చరించి దర్భతో జేసిన (25) ఇరువదియైదు మూరలున్న త్రాడుతో మంటపమునకు జుట్టి కట్టవలెను.

(ఇది మంటపదేవతా ప్రతిష్ఠ)

## విద్యారంభమునకు ముహూర్తములు

ఉత్తరాయణమున శుభమాసములో అనగా మాఘాది అయిదు మాసములందును; స్వాధ్యాయ దినములలోను అనగా 1-8-14-15-30 తిథులను వదలి 2-3-5-10-11-12-13 తిథులలోను, బుధ, గురు, శుక్ర- ఈ వారములలో, రేవతి, అశ్విని, పుష్య-పునర్వసు, అనూరాధా, ఆర్ద్రా, శ్రవణ, హస్త, చిత్త, స్వాతి, ఈ నక్షత్రములలోను మరియు ముహూర్త చింతామణి మతానుసారము ధనిష్ఠ, శత తారక, త్రిపూర్వ, త్రిఉత్తరా, మూల, ఆశ్లేష, ఈ నక్షత్రములందును విద్యారంభముజేయుట ప్రశస్తమైనది. వృషభ, మిథున, కన్యా, ధను, మీన ఈ శుభ లగ్నములందును త్రికోణ (౫-౯) కేంద్రము (౧-౪-౭-౧౦) ఈ స్థానములలో శుభగ్రహములున్నప్పుడు కుమారుని 5వ సం॥ములో గణపతి, సరస్వతి, శివ-పార్వతుల నర్చించి పూర్వాహ్ణములో విద్య నారంభించవలెను.

## వివాహమునకు మాస-వార-నక్షత్రములు

మాఘము, ఫాల్గుణము, వైశాఖము, జేష్ఠము - ఈ మాసములు వివాహములకు యోగ్యమైనవి. మార్గశిర మాసము మధ్యమము, మిథున, సంక్రాంతిలో ఆషాఢమాస ముండినను వివాహము జేయుటకు శుభము. కొన్నిచోట్ల సూర్యుడు వృశ్చికరాశికి వచ్చినపిదప కార్తికమాసములోను వివాహకర్మము నాచరించుటగలదు.

షష్ఠి — అమావాస్య — అష్టమి — రిక్తా — (4-9-14) తిథులు.

కృష్ణపక్షములోని చివరి అయిదు తిథులు, శుక్లపక్షములోని ప్రతిపద తిథులు వివాహమునకు పనికిరాదని ముహూర్త గణపతి గ్రంథములోనున్నది.

అయినను షష్ఠి-అష్టమి-పక్ష చతుర్దశి తిథులలో వివాహము జేయుట శుభమని కొందరు గ్రంథకారులు చెప్పియున్నారు. అమావాస్యమాత్ర సర్వత్రత్యాజమె. (వదలవలెను.)

పండితుల మతాధిక్యతచేత సమస్త వారములు వివాహమునకు చెప్పఁబడినవి. త్రి. ఉత్తరా, రోహిణి, హస్త, అనూరాధా-రేవతి-మఘా, స్వాతి, మూల, మరియు మృగశిర - ఈ పదునొకండు నక్షత్రములు వివాహమునకు ప్రశస్తములైనవి. ఇవే గాకుండ హరదత్తాచార్యుని మతానుసారము ధనిష్ఠా, శ్రవణము, చిత్తా, అశ్వినీ - ఈ నాలుగు నక్షత్రములైనను శుభములనే చెప్పఁబడినవి.

## తొట్టెల బెట్టుటకు ముహూర్తములు

మగబిడ్డకు 12వ దినమున, ఆడబిడ్డకు 13వ దినమున నక్షత్రాదులను విచారించకుండ తొట్టెల బెట్టుటకు శుభప్రదము, అమావాస్యాది ఆటంకములేవి లేకుండిన 16-18-20-22 దినములలో అథవా 32వ దినములలో మృగశిర, చిత్తా, అనూరాధా, రేవతి, పునర్వసు, పుష్యము, అశ్విని, హస్త, రోహిణి, త్రి. ఉత్తరా-. ఈ నక్షత్రములందు (చంద్ర తారాబలములున్న దినములలో అష్టమశుద్ధి ఉన్నప్పుడు) ముత్తయిదువలు బిడ్డను తొట్టెలలో వేయవలెను. సూర్యుడుండు నక్షత్రములతో మొదటి ఐదు నక్షత్రములు, చివరి యేడు నక్షత్రములు శుభకరములు. మిగత పదునైదు (15) నక్షత్రములు నింద్యములని కొందరభిప్రాయము శిశువు సిరస్సును తూర్పుకుంచవలెను.

ꠂꠂꠂ

# సర్వపూజా ప్రకరణము

## ప్రార్థన

ఓంకార లయసద్గురుం పరశివం మాహేశ్వరం భాస్కరం।
నందీశాదిగణాన్ ప్రణమ్యమునిభిః సర్వైః ప్రణీతంపురా ॥
తత్సంగృహ్య జగద్ధితాయసుధియాంతోషాయ రుద్రాభిధో ।
దైవజ్ఞోద్యస్స్వయం పురోహిత ఇతిగ్రంథః కృతస్సమ్ముదా ॥

శ్రీ సూర్యోదయమునకు ముందే (అరుణోదయంతో) నిద్రలేచి శివుని స్తుతించి (ధ్యానించి) నిత్యకర్మలను ముగించి, స్నానమొనర్చి, భస్మ ధారణము జేసికొని, శుచియై, పూజోపచార ద్రవ్యములను సంగ్రహించుకొని, (పూజకు అవసరమైన పూజా సామాగ్రిని సిద్ధపరచుకొని) కంబలాది (గొంగడి మున్నగు) ఆసనమునందు గూర్చొని, ఆచమన ప్రాణాయామముల నాచరించి, స్థిరమనస్కుడై, "శ్రీమన్మహా గణాధిపతయే నమః ఉమా మాహేశ్వరాభ్యాం నమః మాతాపితృభ్యాం నమః। ఏతత్కర్మ ప్రధాన దేవతాభ్యో నమః।"

"అవిఘ్నమస్తు" అని ఉచ్చరించి "మదీయ అభీప్సితార్థ సిద్ధ్యర్థం పూజితోయః సురాసురైః। సర్వవిఘ్న హరస్తస్మై గణాధిపతయేనమః"

అని ధ్యానించి

"ఆగమార్థంతు దేవానాం - గమనార్థంతు రక్షసాం।
కుర్యాద్ఘంటారవంభక్త్యా - దేవతాహ్వానలక్షణం ॥
ఘంటామూలేతథాదేవి - గళోర్ధ్వేశిరమూలకే।
వసవశ్శూలమగ్రస్థా - సర్వేవసతు శంకర" ॥

అని ఘంటానాదముజేసి, తరువాత సంకల్పమును పఠించాలి.

"ఓం శివ శివ శంభోరాజ్ఞయా ప్రవర్తమానస్యాద్య బ్రహ్మణః, ద్వితీయ పరార్ధే శ్వేత వరాహకల్పే వైవస్వత మన్వంతరే కలియుగె ప్రథమపాదె జంబూద్వీపె మేరోర్దక్షిణ దిగ్భాగె భరతఖండె, భారతవర్షే దండకారణ్యే గోదావర్యాః దక్షిణకూలె శాలివాహనశకె బౌద్ధావతారే శివక్షేత్రే అస్మిన్ వర్తమానే వ్యవహారికే చాంద్రమానె ప్రభవాది షష్ఠి సంవత్సరాణాం మధ్యే [1]అస్మిన్ సంవత్సరే, అస్మిన్నయనే, అస్మిన్ ఋతౌ, అస్మిన్ మాసె, అస్మిన్ పక్షె, అస్మిన్ తిథౌ, అస్మిన్ వాసరే, అస్మిన్ శుభనక్షత్ర, శుభయోగ, శుభకరణ, యుక్తాయాం అస్యాం శుభ పుణ్యకాలె మమఆత్మనః వేదోక్త (వాపురాణోక్త) ఫలప్రాప్త్యర్థం అస్మాకం సహకుటుంబానాం సపరివారాణాం క్షేమ, స్థయిర్యాభయాయురారోగ్యైశ్వర్యాభి వృద్ధ్యర్థం సమస్త మంగల ప్రాప్త్యర్థ్యం సమస్తాభ్యుదయార్థంచ శ్రీ [2]అముక దేవతా ప్రీత్యర్థం యథా మిలితోపచారద్రవ్యై ధ్యానావహానాది షోడశోపచార ద్రవ్యైః పూజాం కరిష్యే "ఆరబ్దస్య కర్మణః నిర్విఘ్నేన పరిసమాప్త్యర్థం ఆదౌ శ్రీ మహాగణపతిపూజాం కరిష్యే"

అని యుచ్చరించి, పూజజేయువారు స్త్రీలైనయెడల

---

[1]అస్మిన్ననేచోట పూజా దినమునందున్న సంవత్సరాదులను జేర్చుకొనవలయును. వీరశైవులకిది వర్తింపు కాదందురు కొందరు.

[2]అముకనేచోట తాను పూజించే దేవతా నామమును జేర్చుకొనవలెను.

మంత్రము :- "మమఇహజన్మని, జన్మాంతరేషుచ, అఖండ సౌభాగ్యాది మనోవాంఛిత కామానా సిద్ధ్యర్థం "అముక" దేవతా ప్రీత్యర్థం యథా మిలితోపచారై...పూజాం కరిష్యే" అని యుచ్చరించునది.

తదుపరి పూజకొరకు దెచ్చిన కలశమును (శుద్ధజలముతో నింపిన చెంబు లేదా కడవను-బిందెను) తనకు కుడి భాగమున ఉంచి

మంత్రము :- "ఓం తత్వాయామి బ్రహ్మణా వందమానస్తదాశాస్తే యజమానో హవిర్భిః । అహెడమానో వరుణేహ బోధ్యురుశగ్ంసమానఆయుః ప్రమోషీః" అస్మిన్ కలశే ఓం వరుణ ఇహాగచ్ఛేహతిష్ఠ.

ఇతి వరుణమావాహయామి అని యుచ్చరించి వరుణుని ఆవాహించి

మంత్రము :- "ఓం అపాంపతివరుణాయ నమః గంధం సమర్పయామి, అక్షతాన్ సమర్పయామి, పుష్పం సమర్పయామి"

అని యుచ్చరించి గంధాక్షతాదులతో బూజించి కలశోదకముచేత పూజా ద్రవ్యములను శుద్ధి యొనర్చునది.

మంత్రము :- "ఓం అపవిత్రః పవిత్రోవా సర్వావస్థాంగతోఽపివా । యఃస్మరేద్దేవదేవేశం సబాహ్యాభ్యంతరశ్శుచిః"

అని యుచ్చరించి, పూజాద్రవ్యములపై నీరును ప్రోక్షించి, శుద్ధము గావించుకొనవలెను. పిదప దీపమును

## దీపమును బూజించు క్రమము

మంత్రము :- "భోదీపత్వం బ్రహ్మరూప అంధకార నివారక । ఇమా మయాకృతా పూజాంగృహ్ణాస్తేజః ప్రవర్ధయ" అని యుచ్చరించి,

"ఓం దీపాయ నమః గంధం సమర్పయామి, అక్షతాన్ సమర్పయామి, పుష్పం సమర్పయామి" అనిపఠించి బూజించవలెను. తరువాత

## గణపతి స్థాపనా క్రమము

గణపతి విగ్రహమునుగాని, అథవా చిత్రపటమునుగాని, లేదా రెండు పోకలను తమలపాకులపై బెట్టిన అది గణపతి స్థాపన యగును. ఇక ముందు ఆ పోకలనే గణపతిగా భావించి,

మంత్రము :- "ఓం మహా గణాధిపతయే నమః గంధంధారయామి, పుష్పం సమర్పయామి, ధూపమాఘ్రాపయామి, దీపం దర్శయామి, నైవేద్యం సమర్పయామి"

అని పంచోపచారములతో గణపతిని బూజించాలి.

## ధ్యా న మ ం త్ర ము

మంత్రము :- "సుముఖశ్చైకదంతశ్చ కపిలోగజకర్ణకః ।
లంబోదరశ్చవికటో - విఘ్ననాశో గణాధిపః ॥౧॥
ధూమ్రకేతుర్గణాధ్యక్షో - బాలచంద్రో గజాననః ।
ద్వాదశైతానినామాని - యఃపఠేచ్ఛృణుయాదపి ॥౨॥
విద్యారంభే వివాహేచ - ప్రవేశే నిర్గమేతథా ।
సంగ్రామే సంకటేచైవ - విఘ్నస్తస్య నజాయతె ॥౩॥
వక్రతుండ మహాకాయ - సూర్యకోటి సమప్రభః ।
అవిఘ్నం కురుమేదేవ - సర్వకార్యేషు సర్వదా ॥౪॥

ఈవిధముగా ధ్యానించి నమస్కరించవలెను. తరువాత తాను బూజించే దేవతను స్మరించి స్థిరమనస్సుచేత బూజను జేయవలయును,

ఉదా :- శివుని ధ్యానించుటకు

"ధ్యాయేన్నిత్యం గిరీశం రజతగిరినిభం - చారుచంద్రావతంసం రత్నాలోక జ్వాలాంగం పరశు మృగవరా భీతిహస్తం ప్రసన్నం - పద్మాసీనం సమంతాత్ స్తుత మమరగణై ర్వ్యాఘ్ర కృత్తిం వసానం విశ్వాద్యం విశ్వరూపం నిఖిల భయహరం పంచవక్త్రం త్రినేత్రం"

అని శివసంస్మరణను శ్రీ జగద్గురు రేణుకార్యులను మరియు బసవేశ్వరుని ఆరాధించుతరి

"తీక్ష్ణశృంగం విశాలాక్షం - వేదపాదం మహోన్నతం ।
సాక్షాద్ధర్మతనుందేవం - శివరూపం వృషేశ్వరం ॥

అని వృషభేశ్వరుని స్మరించి

ఇదేప్రకారముగా పూజనీయ దేవతా ధ్యానమును జేసి తదుపరి ఆ దేవతను ఆవాహించి షోడశోపచారములతో బూజించవలెను. (ఉపచార ప్రారంభము)



# మహా సంకల్పము

మంత్రము :- "ఓం అస్య శ్రీమదాది పరమేశ్వరస్య నిత్య నిరుపమ నిరవధికాప్రమేయ మహిమ మహిత మాయాశక్త్యాభ్రియమాణ మహాజలౌఘ మధ్యే పరిభ్రమతాం క్రమాద్దశగుణోత్తరైరవ్యక్త మహదహంకార పృథివ్యప్తేజోవాయ్వాకాశాద్యావరణైః పరివేష్టితానామనేకకోటి బ్రహ్మాండానామేకతమేస్మిన్మహతి బ్రహ్మాండమండలే ఆదిశక్తి కూర్మవరాహనంతో పరిస్థాప ప్రతిష్ఠితానాం అతల వితల సుతల తలాతల రసాతల మహాతల పాతాళాఖ్య సప్తలోకానాం మూర్ధ్వభాగే భూలోక భువర్లోక సువర్లోక మహాలోక జనోలోక తపోలోక సత్యలోకాఖ్య సప్తలోకానామధోభాగే మహానాళాయమానఫణిరాజ, శేషసహస్ర ఫణా మండల మండితే ఐరావత పుండరీక వామన కుముదాం జన పుష్పదంత సార్వభౌమ సుప్రతీకాఖ్యాష్ట దిగ్వేదండ శుండా దండోత్తంభితె అయోధ్యా మధురా మాయా కాశీకాంచ్యవంతీ ద్వారవత్య శోకవతీ భోగవతీ సిద్ధవత్యమరావతీ తేజోవతీ సంయమినీ రక్షోవతీ సింధుమతీ గంధవత్యళకావతీ యశోవతీ ప్రభృత్యనేక పుణ్యపురీ విరాజితే ఇంద్రాగ్నియమనిఋతివారుణ వాయు కుబేరేశానాఖ్యాష్ట దిక్పాల పాలితె అనలానిల ప్రత్యూష ప్రభాససోమాధ్వర ధృవాపాఖ్యాష్ట వసువిరాజితె సూర్యచంద్రాంగారక బుధ బృహస్పతి శుక్ర శనైశ్చర రాహు కేత్వాఖ్య నవగ్రహ పరిపాలితె ఆవహనివహ సంవాహానువహ ప్రవహోద్వహ పరివహాఖ్య సప్తమరుత్సంచార సంజీవిత జీవని కురుంబే వింధ్యారణ్య దండకారణ్య చంపకారణ్య శ్వేతారణ్య నైమిషారణ్య ద్వైతారణ్య గుహారణ్య దేవదారువనేక్షువన కదళికాఖ్య దశారణ్య పరిమండితే శివశంభు పినాకి నికేశ హర స్థాణు భర్గభైరవ సదాశివ కపాలీశ్వరాఖ్యైకాదశ రుద్ర విద్యోతితె మిత్రార్య మత్వష్టృధాతృ వివస్వదరుణ భగాంశు మదింద్ర పర్జన్య

విష్ణుపూషాఖ్య ద్వాదశాదిత్య ప్రకాశితే హరిశ్చంద్ర నళపురుకుత్స పురూరువ సగరకార్తవీర్యాఖ్య షట్ చక్రవర్తి పాలితే భిండివాలి దండ భృశుండినళిక ముసలచక్రలవిత్ర కాళరాత్రి ధ్రుఘణబాణ స్థూణశక్తితోమరపరిఘ పట్టిస మౌష్టికకుంత దశకంటకప్రాస పాశముద్గర శతఘ్ని సీర గదా గోశీర్షమయా ఖీయాపన పినాకాశిధేనుకాస్త్రరేఖా హస్తాముస్త వజ్రాఖ్యద్వాత్రింశదాయుధ మండల మండిత దోర్దండ శ్రీరామ జామదగ్న్య దిలీపాంగ గయాంబరీష శశబిందు శిబిమాంధాతృ మరుత్త భరత యయాతి పృథు భగీరథ రంతిదేవ సుహోత్రాఖ్య షోడశ భూపాల పాలితే విశాలాక్షి మీనాక్షి కామాక్షి సింహికా శంకరీ కుబ్జికా మహాలక్ష్మి మహాదేవి మహాకాళీ పార్వతీ సుప్రభా భ్రమరాంబికా వింధ్యవాసినీ యోగినీ హిమరూపిణీ మాణిక్య దేవికాద్రవేయీ పూర్ణికా ఖ్యాష్టాదశపీఠదేవీ సమలంకృతేయమనియమాసన ప్రాణాయామ ప్రత్యాహార ధ్యానధారణ సమాధ్యష్టాంగ యోగనిష్ఠా నిస్పృహ నిజలింగ నిష్ఠ శ్రీ నందీ భృంగిరిటి వీరక వీరభద్ర పుష్పదంత అండాభరణ దండపాణి చండేశ్వర రేణుక దారుక వికర్ణ విజయకర్ణ ఘంటాకర్ణ రేణుకర్ణ గోకర్ణ రేవణసిద్ధ మరుళసిద్ధ ఏకోరామ పండితారాధ్య సుకేతు రురు ఉపమన్యు భృగు దధీచి గౌతమ దుర్వాసాద్యనేక మునిగణ విరాజితే మలయ మహేంద్ర సహ్య శుక్తి మద్పృక్షవ ద్వింధ్యపారియాత్రాఖ్య సప్తకులాచల వలయితే ఋష్యమూక మతంగ కిష్కింధ మాల్యవద్గిరణ్య శృంగాఖ్య పంచమహానగ సమధిష్ఠితే లవణేక్షు సురాసర్పి ర్దధిక్షీర శుద్ధోదకాఖ్య సప్తసముద్ర పరివృతే వేదవేదాంగేతిహాసాగమన్యాయ కావ్యాలంకార నాటక గాన కవిత్వ కామశాస్త్రద్యూత నైపుణ్య దేశ భాషా జ్ఞాన లిపికర్మవాచన సమస్తావధాన స్వర శాస్త్ర శకున సాముద్రిక రత్నపరీక్షా స్వర్ణపరీక్షాశ్వలక్షణ గజలక్షణ మల్లవిద్యాపాపకర్మదోహళగంధవాద ధాతువాద ఖనివాద రసవాదాగ్ని స్తంభ జలస్తంభ వాయుస్తంభ ఖడ్గస్తంభ

వశ్యాకర్షణ మోహన విద్వేషణోచ్చాటన మారణ కాలవంచన వాణిజ్య పాశుపాల్య కృష్యాసవకర్మలావుకయుద్ధ మృగయా రతికౌశల వశ్యకరణీ ద్యూతకరణీ చిత్రలోహ పాషాణ మృద్దారు వేణుచర్మాంబర క్రియా చౌర్యౌషధసిద్ధి మంత్ర సిద్ధిస్వర వంచనాదృష్టివంచనాంజన జలప్లవన వాక్సిద్ధి ఘటికాసిద్ధి పాదుకాసిద్ధీంద్రజాల మహేంద్రజాలాఖ్య చతుఃషష్టి విద్యా నిషద్యాయమాన నిరవద్య విద్వజ్జన విద్యోతితే అంగ వంగ కళింగ కాశ్మీర కాంభోజ కామరూప సౌవీర సౌరాష్ట్ర మహారాష్ట్ర బంగాళ నేపాళ మలయాళ కేరళ సింహళ చోళ పాంచాళ కోసల కుంతళ జ్వాలాసాల్వ మగధ మాగధ మాళవ మత్స్యవత్స మద్ర మైంద సింధు సైంధవాంధ్ర గాంధార విదర్భలాట వరాట కర్నాట ద్రవిడ ద్రావిడ పాండ్య పుళింద పారసీక బాహ్లీక బర్బర కేయూర కేకయ కురుకిరాత దశార్ణ హూణటెంకణ కొంకణ యవన శూరసేన ఘూర్జర విదేహచేదిభోజావంత్యాఖ్య షట్పంచా శద్దేశ సమలంకృతే భాగీరథీ భీమరథీ సరస్వతీ గౌతమీ నర్మదా యమునా కృష్ణవేణీ వేణుకా తుంగభద్రా చంద్రభాగా వరుణా మలాపహారిణీ కావేరి కపిలా కౌండినకృతమాలా విశాలా తాపిని పూర్ణిమా తామ్రపర్ణి వేగవతీ సోమవతి వేత్రవతి నేత్రవతి విశోకా కౌశికీ గండకీ గోముఖీ పినాకినీ పుణ్యాద్యనేక మహానదీ విరాజితే వారాణసీ చిదంబర శ్రీశైలాహోబల వేంకటాచల శ్రీరంగ సేతు జంబుకేశ్వర కుంభకోణ హాలాస్య గజారణ్య గోకర్ణ రామనాథ పురావర్త పురానంత శయనామరగిరి యాదవగిరి మహాబలగిరి, కరిగిరి కకుద్గిరిశ్వేతగిరి గోవర్ధనగిరి త్రిమకుటగయా ప్రయాగాద్యనేక పుణ్యక్షేత్రయుతే, బ్రాహ్మీమాహేశ్వరీ కౌమారీ వైష్ణవీ వారాహీ ఇంద్రాణీ చాముండాఖ్య సప్తమాతృకా విరాజితే సావిత్రీ సత్యవతీ దమయంతీ మదయంతీ లోపాముద్ర సుకన్యా కేశినీ సుశీలానసూయారుంధతీ ప్రభృతి మహా పతివ్రతా సందోహ సమలంకృతే, రమ్యరమణక ద్వారకా

సింహళ కైవల్య మలయాశ్వభద్రకేతు గోభిలావంత్య పుష్కర ఋషభ రైవత నిర్మోచనీయామ్య పారావారలంకాసౌరకృత మాలాఖ్యాష్టాదశోప ద్వీప విరాజితే పంచాశత్కోటి యోజన విస్తీర్ణేస్మిన్ భూమండలే, సుందరతర చందన మందార కోవిదారకుటజ వట పాటల కరవీర కరవంటిక కంటికీ పిప్పల కర్పూర కదళి ఖర్జూర నారికేళ రసాల తమాలతాళ హింతాళ కృతమాల సరళ వకుళ మంజూళ పున్నాగ జంబూ జంబీర నింబ కదంబ సారంగ లవంగ రుద్రాక్షేక్షు కపిత్థాశ్వత్థ బిల్వ భల్లాతక సల్లకి బదరీ లకుచ చంపక కేతక కుద్దాల బంధూక సింధువార పిచుమంద ఉదుంబరపలాశ పారిజాతాద్యనేకానోకహనివహ నిరంతరమనోహర నందనవన వ్రీడాకర క్రీడావన విహార దేవదానవ గరుడ గంధర్వ కిన్నర కింపురుష సిద్ధ సాధ్య విద్యాధర యక్ష రాక్షసాది దివ్యజన నివాస సమలంకృత శీతాంభ శ్రీ బిందు ముకుంద మందర కళింద వైకంకత మణిశైల శక్రశైల మహాకపిల మహాశైల పంచశైల గజశైల భద్రశైల శ్రీశైల వసుధార వసుమార కుమార కాలంజర కౌంజర పాండర పుష్కర వైడూర్య పారియాత్ర సహస్ర శిఖర మయూర తామ్రాభ శిఖివాస సురస హంసనాగ కుముద మకుట త్రికుట కటుశంఖి కూట మహామేఘ సుమేఘ సుగంధ గంధమాదన సుపార్శ్వసుషేణ సుపక్ష కనక విరజాదికేసర, శిఖరి వసర భాసుర మేరుధరా ధరస్య దక్షిణ దిగ్భాగె జంబూప్లక్ష కుశక్రౌంచశాఖ శాల్మలి పుష్కరాఖ్య సప్తద్వీపానాం మధ్యే జంబూద్వీపే, భారత కింపురుష హరీళావృత భద్రాశ్వకేతుమాల హిరణ్యక రమణక కురు వర్షాఖ్య నవవర్షాణాం మధ్యే భరత వర్షే ఇంద్రకశేరు తామ్రగభస్తి పున్నాగ గంధర్వ సౌమ్య వరుణ భరతాఖ్య నవఖండానాం మధ్యే భరతఖండే, నిరతిశయజని నిరూఢ నిఖిలజన కలుషనికర తిమిర ఖరకిరణ సదృశకవేరకన్యకా కమనీయకృపీట పూర పరిరింఖదభంగుర మంగళతర తుంగతరంగ పరంపరా పరిగత

పరిపూతపవమాన పరిస్పంద పరమపావన ప్రచురతర నిఖిలసస్యసమృద్ధి సమేధమాన మేధా విశేషవిద్యోతమాన నిరవద్య హృద్యజన పోషణ నిష్ఠాగరిష్ఠ కర్ణాట (ఆంధ్ర)జన పదాధిష్ఠాన సహ్యాభిధానగిరి వరిష్ఠస్యో పరిభాగె దండకారణ్యేస్మిన్ ప్రజాపతి క్షేత్రే పినాకత్రిశూల పరశు గదా ఖడ్గాది మహాయుధ ధరస్య దివ్యరత్నఖచిత కిరీటహార కేయూర నూపుర మకర కుండల ప్రముఖ ప్రస్ఫురద ప్రాకృత భూషణావళి విభూషితస్య, చతురానన పురందర ప్రముఖ సకల సురాసుర విసర శిరస్తటీ విరాజమాన మకుటతటి ఘటిత దివ్యరత్న మరీచి పరంపరా నీరాజితో పాంత చరణాంభోరుహస్య నిఖిల లోకాను జిఘృక్షా స్వీకృత వృషభవాహన మూర్త్యాది పంచవింశతి లీలా వైభవ చండేశ రామభార్గవ బాణ దశాననాది శివభాగవత విమలతర హృదయాంతరాళ నిరంతర నిరర్గళ డోలావిహార సమాసక్తస్య గర్భస్థా నేకకోటి బ్రహ్మాండమండలస్య, భగవతో భవానీపతేః లీలా సముద్భూతస్య శారద నీరద పారద సచ్ఛాయ వాగ్దేవతా నిర్గళ నిరంతర విహరణ విలాస భవనాయమాన వదనారవిందస్య, సరసతర సారసనికరభాసుర మానస సరోవర విహరణలాలస మానస రాజహంస వాహనస్య భగవత శ్శంభోరాజ్ఞయా ప్రవర్తమానస్యాద్యబ్రహ్మణః ప్రథమపరార్ధే పంచాశ ద్వత్సరేష్వతీతేషు ద్వితీయ పరార్ధే ప్రథమవర్షే ప్రథమమాసే ప్రథమపక్షే ప్రథమదివసే అహని ద్వితీయెయామె తృతీయ ముహూర్తే ప్రథమ ప్రాణా యామసమయే పార్థివ కూర్మ ప్రళయానంత శ్వేతవరాహ బ్రాహ్మసావిత్రాఖ్య సప్తకల్పానాం మధ్యే శ్వేతవరాహకల్పే, స్వాయంభువరస్వారోచిషోత్తమ తామసరైవతచాక్షుషవైవస్వత సూర్యసావర్ణి ధర్మసావర్ణి దక్షసావర్ణి రుద్రసావర్ణి బ్రహ్మసావర్ణీంద్రసావర్ణి వేదసావర్ణ్యాఖ్య చతుర్దశ మన్వంతరాణాం మధ్యే సప్తమే వైవస్వత మన్వంతరే, సప్తవిశంతి మహాయుగేతీతే ష్వష్టావింశతితమే మహాయుగే కృత త్రేతా ద్వాపర

కలియుగాఖ్యానాం చతుర్ణాం యుగానాం మధ్యే అష్టావింశతి సహస్రోత్తర సప్తదశ లక్షాబ్దే కృతయుగే షణ్ణవతి సహస్రోత్తర ద్వాదశ లక్షాబ్దే త్రేతాయుగే చతుష్షష్ఠి సహస్రోత్తర అష్టలక్షాబ్దే ద్వాపరయుగేచ సమతీతే ద్వాత్రింశత్సహస్రాన్విత చతుర్లక్షాబ్దే వర్తమానే కలియుగే ప్రథమపాదె యుధిష్ఠిర విక్రమ శాలివాహన విజయాభినందన నాగార్జున కలిభూపాఖ్య శకపురుష మధ్య పరిగణిత శాలిహహనశకె, బౌద్ధావతారే, బ్రాహ్మదైవ పిత్ర్య ప్రాజాపత్య బార్హస్పత్యసౌరచాంద్రసావన నక్షత్రమానాఖ్య నవమాన మధ్య పరిగణితేన చంద్రమానేన ప్రవర్తమానె ప్రభవాదీనాం షష్ట్యా సంవత్సరాణాం మధ్యేఽస్మిన్ సంవత్సరే దక్షిణాయ నోత్తరాయణయో ర్మధ్యేఽస్మిన్ అయనే, వసంతాదీనాం ఋతూనాం మధ్యేఽముకఋతౌ, చైత్రాదీనాం మధ్యేఽముక మాసె, శుక్ల-కృష్ణయో ర్మధ్యేఽముకపక్షే ప్రతిపదాదీనాం మధ్యేఽముకాఖ్యాయాం శుభతిథౌ భానుప్రభృతివాసరాణాం మధ్యేఽముకవాసరే అశ్విన్యాదీనాం మధ్యేఽముక నక్షత్రే, విష్కంభాది యోగానాం మధ్యేఽముకయోగే, భవాదికరణానాం మధ్యేఽముకకరణే అస్మిన్ శుభముహూర్తె గంగావాలుకాభిః సప్తర్షిమండలపర్యంతం కృతరాశి భిర్ద్విన్య సహస్రవర్షావసానె ఏకైక వాలుకాపకర్షణ క్రమేణ సర్వరాశ్యపకర్షణ సమ్మితకాలే దశపూర్వేషాం దశాపరేషాం మద్వంశానాంపిత్రూణాం శివసాయుజ్య సిద్ధ్యర్థం ఇహజన్మని జన్మాంతరేషుచ జ్ఞానతోఽజ్ఞానతశ్చ సంభావితానాం సమస్త పాపానామపనోదనార్థం క్షేమ స్థైర్య విజయా భయాయురారోగ్యైశ్వర్యాదీనాముత్తరోత్తరాభివృద్ధ్యర్థం షోడశ దానాంతర్భూత యథాశక్త్యలంకృత కన్యాదాన మహం కరిష్యే”

( ఇతి మహాసంకల్పః )

---

954 స్వభావోదారధీరాయ నమః
955 స్వస్తిదాయ నమః
956 స్వరూప రూపాయ నమః
957 స్వతంత్రాయ నమః
958 స్వచ్ఛాయ నమః
959 స్వప్రకాశాయ నమః
960 ఓం స్వతంత్రగతయే శివాయ నమః
961 స్వభాసాయ నమః
962 స్తబ్ధాయ నమః
963 స్తుత్యాయ నమః
964 స్థవిరాయ నమః
965 స్థవిష్ఠవే నమః
966 స్థాణవే నమః
967 స్థానగాయ నమః
968 స్థూలరూపాయ నమః

969 స్రష్ట్రయ నమః
970 ఓం స్తేనానాంపతయే శివాయ నమః
971 స్వేచ్ఛాస్వరూపాయ నమః
972 స్వేచ్ఛాయ నమః
973 స్వేతరపక్షహరాయ నమః
974 స్రగ్విణే నమః
975 స్వాయుధాయ నమః
976 హవిష్షే శివాయ నమః
977 హరికేశాయ నమః
978 హరేర్వేధాతుః కలహనాశాయ నమః
979 హరాయ నమః
980 ఓం హవ్యాయ శివాయ నమః
981 హరయే నమః
982 హవిర్ధానాయ నమః
983 హితకారిణే నమః

984 హిరణ్యాయ నమః
985 హిరణ్యబాహవే నమః
986 హిరణ్యగర్భాయ నమః
987 హిరణ్మయాయ నమః
988 హిరణ్యగర్భమిత్రాణాం ప్రాణరక్షణాయ నమః
989 హిరణ్యరేతసే నమః
990 ఓం హేమగర్భాయ శివాయ నమః
991 హంసాయ నమః
992 హంసనాథాయ నమః
993 హ్రస్వాయ నమః
994 హృద్దేశాయ నమః
995 క్షయద్వీరాయ నమః
996 క్షరాక్షరాయ నమః
997 క్షేత్రాయ నమః
998 క్షేత్రజ్ఞాయ నమః
999 క్షేత్రగాయ నమః
1000 ఓం క్షేమ్యాయ తుభ్యం శివాయ నమోనమః

॥ ఇతి వేదసార సహస్ర శివ నామావళిః ॥

—: స మా ప్త ము :—

# ప్రార్థన

యస్యస్మరణమాత్రేణ - నృణాం ముక్తిః కరేస్థితా ।
తం వందే జగదాధారం - రేణుకార్యం జగద్గురుం ॥

యత్ర శ్రీ రేణుకాచార్యో - విశ్వవంద్యో జగద్గురుః ।
తత్ర శ్రీః జయః కీర్తిః - శాంతి ధర్మ శుభం సుఖం ॥

మునియాచనయా, శివాజ్ఞయా
శివభక్త్యుద్ధరణార్థ మాగతం ।
వృషరాజ పరావతారతా
మహితం శ్రీ బసవేశ్వరం భజే ॥

మంత్రహీనం క్రియాహీనం, ద్రవ్యహీనం సురేశ్వర ।
యత్పూజితం మయాదేవ, పరిపూర్ణం తదస్తు మే ॥

అపరాధసహస్రాణి, క్రియంతేఽహర్నిశంమయా ।
దాసోఽహమితిమాంమత్వా, క్షమస్వపరమేశ్వరా ॥
(పాహిమా మపరాధేభ్యః, పితాపుత్రమివ ప్రియం)

## ప్రదక్షిణ

యానికానిచపాపాని - జన్మాంతరకృతానిచ ।
తానితాని వినశ్యంతి - ప్రదక్షిణం పదేపదే ॥ప్ర.న.న.॥

## పు ష్పాం జ లి

నకర్మణాన ప్రజయాధనేన త్యాగేనైకేనఽమృతత్వమానశుః ।
పరేణనాకం నిహితం గుహాయాం బిభ్రాజదేతద్యతయో విశంతి ।
వేదాంత విజ్ఞాన సునిశ్చితార్థాః స్సన్యాసయోగాద్యతయఃశుద్ధసత్వాః।
తే బ్రహ్మలోకేషు పరాంతకాలే, పరామృతాత్పరిముచ్యంతి సర్వే ।
దహరం విపాపం పరమేశభూతం, యత్పుండరీకంపురమధ్యసగస్థం ।
తత్రాపి దహరంగహనంవిశోకస్తస్మిన్ యదంతస్తదుపాశితవ్యం ॥

యోవేదాదౌ స్వరః ప్రోక్తో - వేదాంతేచ ప్రతిష్ఠితః
తస్యప్రకృతిలీనస్య - యః పరస్సమహేశ్వరః ॥

అన్యథా శరణం నాస్తి - త్వమేవశరణం మమ ।
తస్మాత్కారుణ్యభావేన - రక్షరక్ష మహేశ్వర ॥

## ఆ శీ ర్వా ద మం త్ర ము లు

భద్రం కర్ణేభిశ్శృణుయామదేవాః - భద్రం పశ్యేమాక్షభిర్యజత్రాః ।
స్థిరేభిరంగైస్తుష్టువాగ్ం‌సస్తనూభిర్వ్యశేమదేవహితంయదాయుః ॥

హిరణ్యపాత్రం మధోఃపూర్ణం దధాతి - మధవ్యోసానీతి ।
ఏకధాబ్రహ్మణ ఉపహరతి- ఏకధైవయజమాన ఆయుస్తేజోదధాతి ॥

ఓషధయస్సంవదంతే - సోమేన సహసహరాజ్ఞా ।
యస్మైకరోతి బ్రాహ్మణస్తగ్ం రాజాన్పారయామసి ॥

మారుతమసి ఆసిమరుతామోజః-మోజోఽపాంబింధిరమయత మరుతః
మరుతస్యేన మాయతనం మనోజవనమితి మనోజవసం -
వృషణాగ్ంసువృక్తిం ॥

ఓం యజ్ఞేన యజ్ఞమయజంతదేవాస్తాని ధర్మాణి ప్రథమాన్యాసన్
తేహనాకం మహిమానస్సచంతయత్రపూర్వేసాధ్యాసంతి దేవాః ॥

ఓం అసతో మా సద్గమయ
తమసో మా జ్యోతిర్గమయ
మృత్యోర్మా అమృతంగమయ

ఓం శాంతిః శాంతిః శాంతిః

ఓం సహనావవతు
సహనౌ భునక్తు
సహవీర్యం కరవావహై
తేజస్వి నావధీతమస్తు
మా విద్విషావహై ॥

ఓం శాంతిః శాంతిః శాంతిః

శ్లో॥ సర్వే భవన్తు సుఖినః, సర్వే సన్తు నిరామయాః ।
సర్వే భద్రాణి పశ్యన్తు, మా కశ్చి ద్దుఃఖభాగ్భవేత్ ॥

ఓం శాంతిః శాంతిః శాంతిః

# శుభ వివాహ సందర్భమున నూతన వధూవరుల నాశీర్వదించే మంగల పంచకము

సద్యోజాతముఖా దవాప్యజననం యఃకొల్లిపాకీపురే ।
సోమేశాభిద లింగతః సమభవన్మాహాత్మ్యముచ్చైర్ముదా ॥
పీఠం శ్రీ కదళీ పురేవ్యరచయత్సం బోధ్యకుంభోద్భవం ।
సు శ్రీరేవణ సిద్ధదేశికవరః కుర్యాత్సదా మంగలం ॥౧॥

శ్రీ మచ్ఛంకరవామదేవవదనాదాపాద్య దివ్యాంజనిం ।
శ్రీ సిద్దేశ్వర లింగతః సముదయన్ భూలోక ముద్ధారయన్ ॥
పీఠంచోజ్జయినీ పురేవిరచయన్ యోలోకవంద్యోద్భవం ।
స శ్రీమన్మరులార్య దేశికవరః కుర్యాత్సదా మంగలం ॥ ॥౨॥

శర్వాఘోరముఖారవిందజనితః సప్తర్షిమాన్యోగురు ।
ద్రాక్షారామసురామ లింగముఖతః సంభూయశీతాచలే ॥
శ్రీ సింహాసన మారచయ్యవసతిం చక్రేచతత్రైవయః ।
ఏకోరామ గురుః సపూర్ణ కరుణః కుర్యాత్సదా మంగలం ॥ ॥౩॥

శ్రీ తత్పురుషాననాబ్జ జనితోదేవైః సదాపూజితః ।
శ్రీశైలస్థిత మల్లికార్జున మహాలింగాంగతః సంభవన్ ॥
సంప్రాప్యోత్తమ వీరశైవ పదవీమ్యోవైరరక్షక్షితిం ।
స శ్రీపండితనామ దేశికవరః కుర్యాత్సదా మంగలం ॥ ॥౪॥

ఈశానసంభవః క్షితితలే విశ్వేశలింగోద్భవః ।
కాశ్యాం మోక్షఫలైక సాధనవిధౌ సింహాసనాధిష్ఠితః ॥
శృత్యుక్తోత్తమ వీరశైవపదవీం సంస్థాపయామాసయో ।
విశ్వారాధ్యగురూత్తమః సకృపయా కుర్యాత్సదా మంగలం ॥ ॥౫॥

మునియాచనయా శివాజ్ఞయా
శివభక్త్యుద్ధరణార్థమాగతం ।

వృషరాజ పరావ తారతా
మహితం శ్రీ బసవేశ్వరం భజె ॥

ఇట్లు వీరశైవధర్మసంస్థాపకులైన జగద్గురు శ్రీ రేణుకాది పంచాచార్యులు మరియు వీరశైవ ధర్మోద్ధారకులైన శ్రీమదల్లమప్రభు బసవాది ప్రమథులు ఈ నూతన వధూవరులకు దీర్ఘాయుః ఆరోగ్యాది అష్టైశ్వర్యములను ప్రసాదించుగాక

" శి వ మ్ భూ యా త్ "

ఇట్లు

కూర్పరి

**పం॥ పెద్దమఠము రాచవీరదేవర "తీర్థ" M.O.L.**

# నవగ్రహ పూజా విధానము

## సూర్యగ్రహ పూజా విధానము

దేశకాలాదుల నుచ్చరించి

మంత్రము :- "అస్యాం శుభతిథౌ సర్వారిష్ట పరిహారద్వారా సర్వాభీష్ట ఫలసిద్ధ్యర్థం జన్మనక్షత్ర జన్మరాశి వశాత్ నామనక్షత్ర నామరాశివశాత్ సంభావిత దుష్టారిష్ట పరిహారార్థం ఆదిత్యాది నవగ్రహ ప్రీత్యర్థం నవగ్రహపూజాం కరిష్యే"

అని సంకల్పము నుచ్చరించి, సూర్యగ్రహమునకు చెప్పఁబడిన ఉచిత స్థానములో గోధుమలను బరచి

మంత్రము :- "ఆసత్యేన హిరణ్యస్తూపస్సవితా త్రిష్టుప్। ఆసత్యేనేత్యస్య మంత్రస్య హిరణ్యస్తూపఋషిః। సవితాదేవతా। త్రిష్టుప్ఛందః సూర్యగ్రహదేవతాముద్దిశ్య సూర్యగ్రహదేవతా ప్రీత్యర్థం యజమానస్య సర్వరోగ పరిహారద్వారా సూర్యగ్రహ ప్రసాద సిద్ధ్యర్థం సూర్య గ్రహారాధనే వినియోగః" అని యుచ్చరించి.

మంత్రము :- "ఆసత్యేన - అంగుష్ఠాభ్యాం నమః। రజసావర్తమానః తర్జనీభ్యాం నమః। నివేశయన్ - మధ్యమాభ్యాం నమః। అమృతం మర్త్యంచ - అనామికాభ్యాం నమః। హిరణ్మయేన సవితారథేన - కనిష్ఠికాభ్యాం నమః। ఆదేవోయాతి భువనాని పశ్యన్ కరతల కర పృష్ఠాభ్యాం నమః। ఆసత్యేన హృదయాయ నమః। రజ సావర్తమానః శిరసే స్వాహా। నివేశయన్ - శిఖాయై వషట్। అమృతం మర్త్యంచ కవచాయహుం। హిరణ్మయేన సవితారథేన -

నేత్రత్రయాయవౌషట్ । ఆదేవోయాతి భువనానిపశ్యన్ - అస్త్రాయ ఫట్ । ఓం భూర్భువస్సువరోమితి దిగ్బంధః ।"

అను మంత్రము నుచ్చరించి *కరన్యాస అంగన్యాసములను జేసి, అన్ని దిక్కు (దిశ)లకు జలమును ప్రోక్షించి దిగ్బంధన మొనర్చవలెను.

తరువాత ధ్యానము

మంత్రము :- వేద మధ్యేలలిత కమలే కర్ణికాయాం రథస్థః । సప్తాశ్వార్కోబుణ రుచివపుస్సప్తరజ్జుర్ద్విబాహుః । గోత్రే రమ్యే బహువిధ గుణేకాశ్యపాఖ్యే ప్రసూతః । కాళింగాఖ్యే విషయజనితః ప్రాఙ్ముఖః పద్మహస్తః ॥ పద్మాసనః పద్మకరోద్విబాహుః । పద్మద్యుతి స్సప్తతురంగబాహుః । దివాకరో లోకగురుః కిరీటీ । మయిప్రసాదం విదధాతుదేవః ॥ (ఆసత్యేన రజసావర్తమానో నివేశయన్నమృతం మర్త్యంచ । హిరణ్మయేన సవితా రథేనా దేవోయాతి భువనాని పశ్యన్) అని ధ్యానించి తదుపరి

మంత్రము :- "సూర్యం రక్తవర్ణం రక్తమాల్యాం బరధరం । రక్తగంధానులేపనం । రక్తాశ్వ । రక్తఛత్ర । ధ్వజపతాకోపశోభితం । దివ్యరథమారూఢం । మేరుం । ప్రదక్షిణీ కుర్వాణం । గ్రహమండలే ప్రవిష్టం । సాంగం సాయుధం । సవాహనం । సరాష్ట్రం । సశక్తి సపత్ని సపుత్ర । సపరివార సమేతం । సర్వాలంకారభూషితం ।

---

:* "న్యాసహీనై హరేదాయుః ధ్యానహీనేతు నిష్ఫలం । ఋషిహీనే మహో వ్యాధిర్భవత్యేవనసంశయః ॥ తస్మాద్దేవర్షి ఛందాంసి-జ్ఞాతవ్యాని మహాత్మభిః ॥

అధి దేవతా ప్రత్యధి దేవతా సహితం । వర్తులాకార మండల మధ్యే । గోధూమధాన్యస్యోపరి భగవంతం । భూః । సూర్యగ్రహ మావాహయామి । భువః । సూర్యగ్రహ మావాహయామి । సువః । సూర్యగ్రహ మావాహయామి । ఓం భూర్భువః సువః సూర్యగ్రహ మావాహయామి ।" స్థాపయామి ॥ పూజయామి ॥

అని యుచ్చరించి ఆవాహించి స్థాపించవలెను.

పిదప సూర్యునికి దక్షిణభాగమున

మంత్రము :- "(అగ్నిం దూతం వృణీమహె హోతారం విశ్వవేదసం । అస్యయజ్ఞస్య సుక్రతుం)" సూర్యగ్రహాధి దేవతాం అగ్నిం సాంగం సాయుధం సవాహనం సశక్తి పత్నీ పుత్ర పరివార సమేతం సూర్య గ్రహస్య దక్షిణతః అగ్నిమావాహయామి। పూజయామి। స్థాపయామి॥

అని ఉచ్చరించి సూర్యునకు అధి దేవతయైన అగ్నిని ఆవాహించి పూజించవలయును. తరువాత సూర్యునకు ఎడమభాగమున

మంత్రము :- "కద్రుద్రాయ ప్రచేతసే మీఢుష్టమాయతవ్యసే । వోచేమశంతమగ్ంహృదే" సూర్యగ్రహస్యప్రత్యధి దేవతాం రుద్రం సాంగం సాయుధం సవాహనం సశక్తి పత్నీ పుత్ర పరివారసమేతం సూర్యగ్రహస్య ఉత్తరతః రుద్రమావాహయామి స్థాపయామి పూజయామి॥ అని చెప్పి సూర్యునకు, ప్రత్యధిదేవతయగు 'రుద్రుని' ఆవాహించి పూజించ వలయును.

(ఇది సూర్యగ్రహ పూజా విధానము)

# చంద్రగ్రహ పూజా విధానము

చంద్రగ్రహణమునకు ఆగ్నేయ దిశలో చతురస్రాకారమగు మండలమును వ్రాసి, ఆ మండలములో బియ్యము బరచవలెను. ఆ పిదప

మంత్రము :- "ఆప్యాయస్వగౌతమస్సోమో గాయత్రీ। ఆప్యాయ స్వేతస్య మంత్రస్య గౌతమ ఋషిః। సోమోదేవతా। గాయత్రీ ఛందః। యజమానస్య అధి దేవతా ప్రత్యధి దేవతా సహిత చంద్ర గ్రహ ప్రసార సిద్ధ్యర్థే। చంద్రగ్రహారాధనే వినియోగః।" అని బఠించి

మంత్రము :- "ఆప్యాయస్వ - అంగుష్ఠాభ్యాం నమః। సమేతుతే - తర్జనీభ్యాం నమః। విశ్వతః - మధ్యమాభ్యాం నమః। సోమ వృష్ణియం - అనామికాభ్యాం నమః। భవావాజస్య - కనిష్ఠికాభ్యాం నమః। సంగథే - కరతల కర పృష్ఠాభ్యాం నమః।

అని కరన్యాసము నాచరించి (ఇదేవిధముగా హృదయాదిన్యాసమును గూడ జేయవలెను.)

మంత్రము :- "ఓం భూర్భువస్సువరోమితి దిగ్బంధః" అని ఉచ్చరించి అన్నిదిక్కులకు జలమును ప్రోక్షించి ధ్యానము జేయవలెను.

మంత్రము :- "ఆగ్నేయభాగె సరథోదశాశ్వశ్చాత్రేయ గోత్రోయమనాఖ్య దేశః। ప్రత్యఙ్ముఖస్థశ్చతురశ్రపీఠేగదాధరోగో హిమవత్స్వభావః॥ శ్వేతాంబర శ్వేతవపుః కిరీటీశ్వేతద్యుతిర్దండధరో ద్విబాహుః। చంద్రో౽ మృతాత్మావరదః కిరీటీ శ్రేయాంసి మహ్యం విదధాతుదేవః॥"

(ఆప్యాయ స్వసమేతుతే - విశ్వతసో మవృష్ణియం । భవావాజస్య సంగథే) అని ధ్యానించి

మంత్రము :- "చంద్రం శ్వేతవర్ణం । శ్వేతమాల్యాం బరధరం । శ్వేతగంధానులేపనం । శ్వేతాశ్వ । శ్వేతచత్ర । ధ్వజపతాకోప శోభితం । దివ్యరథమారూఢం । మేరుం ప్రదక్షిణీ కుర్వాణం । గ్రహమండలే ప్రవిష్టం । సాంగం । సాయుధం । సవాహనం । సరాష్ట్రం । సశక్తిః । సపత్నిపుత్ర । సపరివారసమేతం । సర్వాలంకార భూషితం । అధిదేవతా ప్రత్యధిదేవతా సహితం । సూర్య గ్రహస్య ఆగ్నేయ దిగ్భాగే । చతురశ్రమండలే । తండులధాన్యస్యోపరి । ధ్యానంతం । ఓం భూః చంద్రగ్రహ మావాహయామి । భువః చంద్రగ్రహ మావాహయామి । సువః చంద్రగ్రహ మావాహయామి। ఓం భూర్భువస్సువః। చంద్రగ్రహ మావాహయామి। స్థాపయామి । పూజయామి ।"✳ అని ఆవాహన మొనర్చి పూజించవలెను తరువాత చంద్రునికి దక్షిణభాగమున

---

సూ:✳ "శాంతి ప్రకాశమను గ్రంథములో "అర్కపుష్పమాదిత్యాయ । పాలాశగ్ంసోమాయ । ఖాదిరమంగారకాయ । అపామార్గంబుధాయ। అశ్వత్థం బృహస్పతయే । ఔదుంబరగ్ం శుక్రాయ । శమీగ్ం శనైశ్చరాయ । రాహవేదూర్వాః । కేతవే కుశాః" ॥

తా॥ సూర్యునకు జిల్లేడిపువ్వు చంద్రునకు మోదుగపువ్వు । అంగారకునకు...(కన్గలి ?) బుధునకు ఉత్తరాణి । బృహస్పతికి దూది ? (అరచి ?) శుక్రునకి మేడి ?...(అత్తి ?) శనికి జంబి, రాహుకు గరిక, కేతువుకు దర్భ, ఇట్లు ఆయాయా గ్రహములకు ఆయాయా పత్రపుష్పములతో పూజించవలయును అని ఉంది

మంత్రము :- "అప్సుమే సోమో అబ్రవీదంతర్విశ్వానిభేషజా। అగ్నించ విశ్వంశభువమాపశ్చ విశ్వభేషజీః। చంద్రగ్రహాధి దేవతాం అపః సాంగం సాయుధం సవాహనం సశక్తి పత్నీపుత్ర పరివారసమేతం చంద్రగ్రహస్య దక్షిణతః అప ఆవాహయామి। స్థాపయామి। పూజయామి।

అని చంద్రగ్రహాధి దేవతయైన అప్పుదేవతను ఆవాహించి పూజించవలెను. తరువాత చంద్రుని ఏడమ భాగమున

మంత్రము :- "గౌరీమిమాయ సలిలానితక్షత్యేకపదీ ద్వివదీసా చతుష్పదీ। అష్టాపదీ నవపదీ బభూవుషి। సహస్రాక్షరా పరమె వ్యోమన్" చంద్రగ్రహస్య ప్రత్యధిదేవతాం గౌరీం సాంగాం సాయుధాం సవాహనాం సశక్తి పత్నీపుత్ర పరివార సమేతాం చంద్రగ్రహస్యోత్తరతః గౌరీ మావాహయామి। స్థాపయామి। పూజయామి॥ అని చెప్పి చంద్రగ్రహము యొక్క ప్రత్యధి దేవతయైన గౌరీదేవిని ఆవాహించి పూజించవలెను.

(ఇది చంద్రగ్రహ పూజా విధానము)

# మంగళ గ్రహ పూజావిధానము

మంగళ గ్రహమునకు దక్షిణదిశలో రంగవల్లి ముగ్గుతో త్రికోణాకారముగా మండలమును వ్రాసి అందు తొగళ్ళు (కందులు) పరచవలెను.

మంత్రము :- అగ్నిమూర్ధా విరూపో అంగారకో గాయత్రీ। అగ్నిర్మూర్ధేత్యస్య మంత్రస్య। విరూపఋషిః। అంగారకో దేవతా। గాయత్రీ ఛందః। యజమానస్య। అధిదేవతా ప్రత్యధిదేవతా సహిత సర్వరోగ పరిహారద్వారా। అంగారక గ్రహ ప్రసాద సిద్ధ్యర్థే। అంగారక గ్రహారాధనే వినియోగః" అని యుచ్చరించి ఆ పిదప

మంత్రము :- "అగ్నిమూర్ధా అంగుష్ఠాభ్యాం నమః। దివఃకకుత్ - తర్జనీభ్యాం నమః। పతిః పృథివ్యా - మధ్యమాభ్యాం నమః। అయ అనామికాభ్యాం నమః। అపాగ్ం రేతాగ్ంసి - కనిష్ఠికాభ్యాం నమః। జిన్వతి - కరతల కర పృష్ఠాభ్యాం నమః॥

ఇదే విధము హృదయాదిన్యాసము జేయవలెను.

మంత్రము :- "ఓం భూర్భువస్సువరోమితి దిగ్బంధః" అని యుచ్చరించి దిక్కులకు జలమును ప్రోక్షించి, పిదప ధ్యానము జేయవలెను.

మంత్రము :- "యామ్యే గదాశక్తిః ధరస్త్రిశూలి వరప్రదో యామ్య ముఖోతిరిక్తః। కుజస్త్వవంతీ విషమస్త్రికోణస్తస్మిన్ భరధ్వాజకులే ప్రసూతః॥ రక్తాంబరో రక్తవపుః కిరీటీ చతుర్భుజో మేషగమో గదాభృత్। ధరాసుతశ్శక్తి ధరశ్శూల్ సదా మమస్యాద్వరాదః ప్రశాంతః" (ఓం అగ్నిర్మూర్ధాదివః కకుత్పతిః పృథివ్యా అయం। అపాగ్ం రేతాగ్ంసి జిన్వతి) అని ధ్యానించి

మంత్రము :- "అంగారకం రక్తవర్ణం రక్తమాల్యాం బరధరం రక్త గంధానులేపనం । రక్తాశ్వ । రక్తఛత్ర । ధ్వజపతాకోపశోభితం। దివ్యరథ మారూఢం । మేరుం ప్రదక్షిణం కుర్వాణం । గ్రహమండలే ప్రవిష్టం । సాంగం । సాయుధం । సవాహనం । సరాష్ట్రం । సశక్తి పత్నిపుత్ర । సపరివార సమేతం । సర్వాలంకార భూషితం। అధిదేవతా ప్రత్యధి దేవతా సహితం । సూర్యగ్రహస్య దక్షిణ దిగ్భాగే । త్రికోణాకార మండలే । ఆథకథాన్యస్యోపరిభగవంతం । భూః - అంగారక మావాహయామి। భువః-అంగారకగ్రహ మావాహయామి । సువః - అంగారక గ్రహ మావాహయామి । ఓం భూర్భువస్సువః అంగారకగ్రహ మావాహయామి । స్థాపయామి । పూజయామి"

అని అంగారగ్రహము నావాహించి, స్థాపించి, పూజించి, పూర్వోక్త విధముగా పూజించవలెను.

తరువాత నా అంగారక గ్రహమునకు దక్షిణభాగమున

మంత్రము :- "స్యోనా పృథ్వీభవాన్పృక్షరానివేశినీ । యచ్ఛానశ్శర్మస ప్రథాః" అంగారక గ్రహాధిదేవతాం పృథ్వీం సాంగాం సాయుధాం సవాహనాం సశక్తి పతిపుత్ర పరివారసమేతాం అంగారకగ్రహస్య దక్షిణతః పృథివీ మావాహయామి స్థాపయామి । పూజయామి ॥

అని యుచ్చరించి, అధిదేవతయైన పృథివిని ఆవాహించి పూజించునది

ఆ మీదట అంగారకునకు వామభాగమున

మంత్రము :- "క్షేత్రస్య పతినావయగ్ం హితేనేవ జయామసి। గామశ్వం పోషయిత్వాసనోమృడాతీదృశే" అంగారకగ్రహస్య ప్రత్యధి దేవతాం

క్షేత్రపాలకం సాంగం సాయుధం సవాహనం సశక్తి పత్నిపుత్ర పరివార సమేతం । అంగారక గ్రహస్యోత్తరతః క్షేత్రపాలక మావాహయామి । స్థాపయామి । పూజయామి" అని యుచ్చరించి ప్రత్యధిదేవతయైన క్షేత్రపాలకుని ఆవాహించి పూజించునది

( ఇది మంగళగ్రహ పూజావిధానము )

# బుధగ్రహ పూజా విధానము

బుధగ్రహమునకు ఈశాన్యదిశలో బాణాకారపు మండలమును వ్రాసి ఆ స్థలములో పెసలుబోసి (పరచి)

మంత్రము :- "ఉద్బుధ్యస్వబుధో బుధస్త్రిష్టుప్ ఉద్బుధ్యశ్వేత్యస్య మంత్రస్య। బుధఋషిః। బుధోదేవతా త్రిష్టుప్ఛందః। యజమానస్య। అధిదేవతా ప్రత్యధిదేవతా సహిత బుధగ్రహస్య ప్రసాద సిద్ధ్యర్థే బుధ గ్రహారాధనే వినియోగః ॥" అని చెప్పిన తదుపరి

మంత్రము :- "ఉద్బుధ్యస్వాగ్నే - అంగుష్ఠాభ్యాం నమః । ప్రతిజాగ్రహ్యేనం - తర్జనీభ్యాం నమః । ఇష్టాపూర్తేసగ్ంసృజేథాం మధ్యమాభ్యాం నమః । అయంచ - అనామికాభ్యాం నమః । కృణ్వాగ్ంస్వాహితరంయువానం - కనిష్ఠికాభ్యాం నమః । అన్వాతాగ్ం సీత్వాయి తంతుమేతం - కరతల కర పృష్ఠాభ్యాం నమః" ॥ అని కరన్యాస మొనర్చి (ఇదే మంత్రములతో హృదయాదిన్యాసమును జేసి)

మంత్రము :- "ఓం భూర్భువస్సువరోమితి దిగ్బంధః" అని పఠించి, అన్నిదిక్కులకు నీటిని ప్రోక్షించి, పిదప ధ్యానము

మంత్రము :- "ఉదఙ్ముఖో మాగధజో హారిస్థశ్చాత్రేయ గోత్రశ్శర మండలస్థః। సఖడ్గచర్మోరు గదాధరోఙ్గస్త్వీశానభాగె వరదస్సుపీతః॥ పీతాంబరః పీతవపుః కిరీటీ చతుర్భుజో దండధరశ్చసౌమ్యః। చర్మాసి ద్భుక్సోమసుతస్సుమేరు సింహాధిరూఢో వరదోబుధశ్చ ॥

(ఉద్బుధ్యస్వాగ్నే ప్రతిజాగృహ్యేన మిష్టాపూర్తేసగ్ం సృజే థామయంచ। పునః కృణ్వగ్ం స్త్వాపితరం యువాన మన్వాతాగ్ం సీత్వయి తంతుమేతం) అని ధ్యానించి

మంత్రము :- "బుధం పీతవర్ణం। పీతమాల్యాం బరధరం। పీతగంధానులేపనం పీతాశ్వ। పీతఛత్ర। ధ్వజపతాకోపశోభితం। దివ్య రథమారూఢం మేరుం ప్రదక్షిణీ కుర్వాణం। గ్రహమండలే ప్రవిష్టం। సాంగం। సాయుధం। సవాహనం। సరాప్త్రష్టం। సశక్తి సపత్ని సపుత్ర। సపరివారసమేతం। సర్వాలంకార భూషితం। అధిదేవతా ప్రత్యధిదేవతా సహితం। సూర్యగ్రహస్య ఈశాన్య దిగ్భాగే। బాణాకార మండలే। ముద్గధాన్యస్యోపరి। భగవంతం। భూః- బుధగ్రహ మావాహయామి। భువః బుధగ్రహ మావాహయామి। సువః - బుధగ్రహ మావాహయామి। ఓం భూర్భువస్సువః బుధగ్రహ మావాహయామి। స్థాపయామి। పూజయామి।

అని బుధుని నావాహించి, స్థాపించి, పూజించి, తదుపరి బుధగ్రహమునకు దక్షిణభాగమున

మంత్రము :- "ఇదం విష్ణుర్విచక్రమే త్రేధానిదధే పదం సమూఢమస్య పాగ్ంసురే" బుధగ్రహాధి దేవతాం విష్ణుం సాంగం। సాయుధం సవాహనం సశక్తి సపత్నిపుత్ర పరివారసమేతం బుధగ్రహస్య దక్షిణతః విష్ణుమావాహయామి। స్థాపయామి। పూజయామి॥

అని చెప్పి అధిదేవతయైన విష్ణువునావాహించి। స్థాపించి పూజించునది, తదుపరి బుధగ్రహమునకు ఎడమభాగమున

మంత్రము :- "విష్ణోరరాటమసి, విష్ణో పృష్ఠమసి। విష్ణోశ్నప్త్రేస్థో విష్ణోస్స్యూరసి - విష్ణోర్ధ్రువమసి వైష్ణవమసి విష్ణవేత్వా" బుధగ్రహ ప్రత్యధిదేవతాం నారాయణం సాంగం సాయుధం సవాహనం సశక్తి పత్నిపుత్ర పరివారసమేతం బుధగ్రహస్య ఉత్తరతః నారాయణమావాహయామి। స్థాపయామి। పూజయామి।

అని యుచ్చరించి, ప్రత్యధిదేవతయగు నారాయణుని ఆవాహించి, స్థాపించి, పూజించవలయును

(ఇది బుధగ్రహ పూజావిధిః)

# గురుగ్రహ పూజా విధానము

గురు గ్రహ పూజకొరకు ఉత్తరదిశలో దీర్ఘచతురశ్రాకార మండలమును వ్రాసి, శనగలను బరచి

మంత్రము :- "బృహస్పతెగృత్సమదోబృహస్పతిర్జగతి । బహస్పతేత్యస్య మంత్రస్య । గృత్సమదఋషిః । బృహస్పతిర్దేవతా । జగతీఛందః । యజమానస్య అధిదేవతా ప్రత్యధిదేవతా సహిత । బృహస్పతి గ్రహ ప్రసాదసిద్ధ్యర్థే బృహస్పతి గ్రహారాధనే వినియోగః"

అని బఠించి తరువాత

మంత్రము :- బృహస్పతి అతియదర్యో అర్హాత్-అంగుష్ఠాభ్యాం నమః। ద్యుమద్విభాతి-తర్జనీభ్యాం నమః । క్రతు మజ్జనేషు-మధ్యమాభ్యాం నమః । యద్దీదయచ్ఛవస - అనామికాభ్యాం నమః । ఋతే ప్రజాదస్మాను - కనిష్ఠికాభ్యాం నమః । ద్రవిణం దేహిచిత్రం కరతల కర పృష్ఠాభ్యాం నమః ॥

అని కరన్యాస మాచరించి ఇదే మంత్రములతో హృదయాదిన్యాస మాచరించవలెను. తదుపరి

మంత్రము :- "ఓం భూర్భువస్సువరోమిదిగ్బంధః"

అని యుచ్చరించి అన్నిదిక్కులకు జలమును ప్రోక్షించి ఆ మీదట

ధ్యానము

మంత్రము :- "సౌవ్యేసుదీర్ఘో చతురశ్రపీఠె రథేంగిరాః పూర్వముఖ స్వభావః । దండాక్షమాలా జలపాత్రధారీ సింధ్వాఖ్యదేశేవరద స్సజీవః॥

కనకాంబరః కనకవపుః కిరీటీ చతుర్భుజో దేవగురుః ప్రశాంతః। తథాపి దండంచ కమండలుంచ। తథాక్షసూత్రా ద్వరదోస్తు తస్మైః॥ బృహస్పతే అతి యదర్యో అర్హాద్యుమద్విభాతి క్రతుమజ్జనేషు। యద్దీదయచ్ఛవసర్త ప్రజాతరదస్మాసుద్రవిణం ధేహిచిత్రం ॥ అని ధ్యానించి

మంత్రము :- "బృహస్పతిం కనకవర్ణం కనకమాల్యం బరధరం। కనకగంధానులేపనం। కనకాశ్వ। కనకఛత్ర। ధ్వజపతాకోపశోభితం। దివ్యరథమారూఢం। మేరుం ప్రదక్షిణీ కుర్వాణం। గ్రహమండలే ప్రవిష్టం సాంగం। సాయుధం। సవాహనం। సరాష్ట్రం। సశక్తి। సపత్నిసపుత్ర। సపరివారసమేతం। సర్వాలంకారభూషితం॥ అధిదేవతా ప్రత్యధిదేవతా సహితం। సూర్యగ్రహస్య ఉత్తర దిగ్భాగే। దీర్ఘ చతురశ్రాకారమండలే। చణకధాన్యస్యోపరిభగవంతం। భూః - బృహస్పతి గ్రహ మావాహయామి। భువః - బృహస్పతిగ్రహ మావాహయామి। సువః - బృహస్పతిగ్రహ మావాహయామి। భూర్భువస్సువః బృహస్పతిగ్రహ మావాహయామి। స్థాపయామి। పూజయామి॥ అని గురు గ్రహము నావాహించి। స్థాపించి పూజించాలి। పిదప బృహస్పతికి దక్షిణభాగమున

మంత్రము :- "బ్రహ్మజిజ్ఞానం ప్రథమం పురస్తాద్విసీమతస్సురుచోవేన ఆవః। సబుధ్నియా ఉపమా అస్య విష్ఠాస్సతశ్చయోనిమసతశ్చవివః బృహస్పతి గ్రహాధిదేవతాం బ్రహ్మాణం సాంగం సాయుధం సవాహనం సశక్తి సపత్నీ పుత్ర పరివార సమేతం। బృహస్పతి గ్రహస్య దక్షిణతః బ్రహ్మాణమావాహయామి। స్థాపయామి। పూజయామి॥"

అని యుచ్చరించి అధిదేవతయగు బ్రహ్మను ఆవాహించి పూజించవలయును.

తరువాత బృహస్పతికి యెడమప్రక్కన

మంత్రము :- ఇంద్రంవో విశ్వతస్పరి హవామహె జనేభ్యః । అస్మాకమస్తు కేవలః" బృహస్పతిగ్రహ ప్రత్యధిదేవతాం ఇంద్రం సాంగం సాయుధం సవాహనం సశక్తి పత్నీ పుత్ర పరివారసమేతం బృహస్పతిగ్రహస్య ఉత్తరతః ఇంద్ర మావాహయామి । స్థాపయామి । పూజయామి ॥ అని చెప్పి ప్రత్యధి దేవతయగు ఇంద్రుని ఆవాహించి పూజించునది ।

(ఇతి గురుగ్రహ పూజా విధానము)

## అథ శుక్రగ్రహ పూజా విధానము

శుక్రగ్రహమునకు పూర్వదిక్కున పంచకోణాక్క ఆకారముగల మండలమును వ్రాసి అందులో అనుములుబోసి (పరచి)

మంత్రము :- "శుక్రంతే భరద్వాజ శుక్ర త్రిష్టుప్ । శుక్రంతేత్యస్య మంత్రస్య । భరధ్వాజఋషిః । శుక్రో దేవతా । త్రిష్టుప్ ఛందః । యజమానస్య అధిదేవతా ప్రత్యధి దేవతాసహిత శుక్రగ్రహ ప్రసాద సిద్ధ్యర్థే శుక్రగ్రహారాధనే వినియోగః । అని తరువాత

మంత్రము :- శుక్రంతే అన్యత్ - అంగుష్ఠాభ్యాం నమః । యజతంతే అన్యత్ - తర్జనీభ్యాం నమః । విషురూపె అహని - మధ్యమాభ్యాం నమః । ద్యౌరివాసి - అనామికాభ్యాం నమః । విశ్వాహిమాయా అవసిస్వధావః - కనిష్ఠికాభ్యాం నమః । భద్రాతే పూషన్నిహరాతిరస్తు - కరతల కర పృష్ఠాభ్యాం నమః ॥

అని కరన్యాసము గావించి ఇదే మంత్రములతో హృదయాదిన్యాసము జేయవలెను.

మంత్రము :- "ఓం భూర్భువస్సువరోమితి దిగ్బంధః"

అని యుచ్చరించి అన్నిదిక్కులకు నీరు ప్రోక్షించి, తరువాత

మంత్రము :- "ప్రాచ్యాం భృగుర్భోజగత ప్రజాతస్సభార్గవ పూర్వముఖీ స్సితాభః । సవంచకోణే సరథాధిరూఢో దండాక్షమాలా వరదోంబు పాత్రః । శ్వేతాంబర శ్వేతవపుః కిరీటీ చతుర్భుజో దైత్యగురుః పశాంతః । తథాపి దండంచ కమండలుంచ తథాక్షసూత్రాద్వరదోస్తు తస్మై" ॥ (శుక్రంతే అన్యద్యజతంతె అన్యద్విషురూపె అహనీద్యౌరి వాసి) విశ్వా హిమాయాఅవసిస్వధావో భద్రాతె పూషన్నిహరాతిరస్తు ।

అని ధ్యానించి

మంత్రము :- "శుక్రం స్వేతవర్ణం | శ్వేతమాల్యాంబరధరం | శ్వేత గంధానులేపనం | శ్వేతాశ్వ | శ్వేతఛత్ర | ధ్వజపతాక శోభితం | దివ్యరథమారూఢం | మేరుం ప్రదక్షిణీ కుర్వాణం గ్రహమండలే ప్రవిష్టం | సాంగం | సాయుధం | సవాహనం | సరాష్ట్రం | సశక్తి సపత్నీ సపుత్ర | సపరివార సమేతం | సర్వాలంకారభూషితం అధి దేవతా ప్రత్యధి దేవతా సహితం | సూర్యగ్రహస్య ప్రాగ్భాగే | పంచకోణాకార మండలే | బర్బరధాన్యస్యోపరి | భగవంతం | భూః - శుక్ర గ్రహ మావాహయామి | భువః - శుక్రగ్రహ మావాహ యామి | సువః - శుక్రగ్రహ మావాహయామి | ఓం భూర్భువస్సువః శుక్రగ్రహ మావాహయామి | స్థాపయామి | పూజయామి" ॥

అని పఠించి, శుక్రగ్రహము నావాహించి, స్థాపించి, పూజించునది పిదప శుక్రగ్రహమునకు దక్షిణ భాగమున

మంత్రము :- "ఇంద్రాణీమాసునారిషు సుపత్నీ మహమశ్రవం | నహ్యస్యా అపరంచన జరసా మరతె పతిః" శుక్రగ్రహాధి దేవతాం ఇంద్రాణీం సాంగాం సాయుధాం సవాహనాం | సశక్తి పతి పుత్ర పరివార సమేతాం శుక్రగ్రహస్య దక్షిణతః ఇంద్రాణీ మావాహయామి | స్థాపయామి । పూజయామి" ॥

అని యుచ్చరించి అధిదేవతయగు ఇంద్రాణిని ఆవాహించి పూజించునది తరువాత శుక్రగ్రహము ఎడమప్రక్కన

మంత్రము :- "ఇంద్రమరుత్వ ఇహ పాహిసోమంయథాశార్యాతె అపిబస్సుతస్య| తవ ప్రణీతీతవ శూరశర్మన్నావి వాసంతికవయ స్సుయజ్ఞాః" ॥ శుక్రగ్రహ ప్రత్యధిదేవతాం ఇంద్రమరుత్వంతం సాంగం సాయుధం సవాహనం సశక్తి పత్నీపుత్ర పరివార సమేతాం శుక్రగ్రహస్యోత్తరతః ఇంద్ర మరుత్వంత మావాహయామి| స్థాపయామి| పూజయామి ॥

అని పఠించి ప్రత్యధిదేవతయైన ఇంద్రమరుత్వంతముని ఆవాహించి పూజించునది

(ఇతి శుక్రగ్రహ పూజా విధానం)

## అథ శనిగ్రహ పూజా విధానము

శనైశ్వరునికొరకు పశ్చిమదిశలో ధనురాకారమగు మండలమును వ్రాసి అందులో నువ్వులను బరచి

మంత్రము :- "శమగ్నిరిరిమిఠశ్శనిబుష్ణిక్ | శమగ్నిరిత్యస్య మంత్రస్య| రిరిమ్మిఠబుషిః| శనైశ్చరో దేవతా| ఉష్ణిక్ఛందః| యజమానస్య

సర్వరోగ పరిహారద్వారా | శనైశ్చర గ్రహప్రసాద సిద్ధ్యర్థే శనైశ్చర గ్రహారాధనే వినియోగః" ॥ అని యుచ్చరించి తరువాత

మంత్రము :- "శమగ్ని - అంగుష్ఠాభ్యాం నమః । అగ్నిభిస్కరత్ - తర్జనీభ్యాం నమః । శన్నస్తపతు సూర్యః - మధ్యమాభ్యాం నమః। శంవాతః - అనామికాభ్యాం నమః । వాత్వరపాః - కనిష్ఠికాభ్యాం నమః । అపస్రిధః - కరతల కర పృష్ఠాభ్యాం నమః ॥"

అని కరన్యాసమొనర్చి (ఇదే ప్రకారముగా హృదయాదిన్యాసమొనర్చి)

మంత్రము :- "ఓం భూర్భువస్సువరోమితి దిగ్బంధః"

అని యుచ్చరించి దిక్కులన్నింటిలో నీరును బ్రోక్షించి తరువాత ధ్యానము జేయవలెను.

మంత్రము :- "చాపాసనో గృధ్రరథస్సునీల ప్రత్యఙ్ముఖః కాశ్య పతిః ప్రతీర్యాం | సశూలచాపేషు వరప్రదశ్చ సౌరాష్ట్రదేశే ప్రభవశ్చశౌరిః॥ నీలద్యుదిర్నీలవపుః కిరీటీ గృధ్రస్థితిశ్చాపకరో ధనుష్మాన్ | చతుర్భుజ స్సూర్యసుత ప్రశాంత స్సదాస్తు మహ్యంవరమందగామీ ॥ (శ్రమగ్ని రగ్ని భిస్కరచ్ఛన్నస్తపతు సూర్యః | శంవాతో వాత్వరపా అపస్రిధః)

అని ధ్యానించి

మంత్రము :- "శనిం నీలవర్ణం నీలమాల్యాం బరధరం నీలగంధానులేపనం| నీలాశ్వ | నీలఛత్ర | ధ్వజపతాకోపశోభితం | దివ్యరథమారూఢం | మేరుం ప్రదక్షిణీ కుర్వాణం | గ్రహమండలే ప్రవిష్టం | సాంగం సాయుధం | సవాహనం | సరాష్ట్రం | సశక్తి | సపత్నీపుత్ర పరివారసమేతం | సర్వాలంకార భూషితం | అధిదేవతా ప్రత్యధి దేవతా సహితం | సూర్యగ్రహస్య పశ్చిమ దిగ్భాగే | ధనూరాకార

మండలే | తిలధాన్యస్యోపరిభగవంతం | భూః - శనైశ్చర గ్రహ మావాహయామి | భువః - శనైశ్చరగ్రహ మావాహయామి | సువః | శనైశ్చరగ్రహ మావాహయామి ॥ ఓం భూర్భువస్సువః శనైశ్చరగ్రహ మావాహయామి | స్థాపయామి | పూజయామి ॥

అని శనిగ్రహము నావాహించి, స్థాపించి, పూజించవలయును ఆ మీదట శనిగ్రహమునకు దక్షిణ భాగమున

మంత్రము :- "యమాయ సోమగ్ం సునుతయమాయ జుహుతాహవిః | యమగ్ం హయజ్ఞో గచ్ఛత్యగ్నిదూతో అరంకృతః | శనేశ్వరగ్రహాధి దేవతాం యమం సాంగం సాయుధం సవాహనం | సశక్తి పత్నీపుత్ర పరివారసమేతం | శనైశ్చరగ్రహస్య దక్షిణతః యమ మావాహయామి స్థాపయామి | పూజయామి |

అని యుచ్చరించి అధిదేవతయగు యముని నావాహించి పూజించునది పిదప శనిగ్రహము ఎడమవైపు

మంత్రము :- "ప్రజాపతేనత్వదేతాన్యన్యో విశ్వాజాతాని పరితాబభూ యత్కామాస్తేజుహుమస్తన్నో అస్తువయగ్ంస్యామ పతయోరయీణాం శనైశ్చరగ్రహ ప్రత్యధిదేవతాం ప్రజాపతిం సాంగం సాయుధం సవాహన సశక్తి పత్నీ పుత్ర పరివారసమేతం శనైశ్చర గ్రహస్యోత్తరతః | ప్రజ పతి మావాహయామి | స్థాపయామి | పూజయామి ॥"

అని పఠించి ప్రత్యధిదేవతయగు ప్రజాపతినావాహించి, స్థాపించి, పూజించునది ॥

(ఇతి శనిగ్రహ పూజా విధానము)

# అథ రాహుగ్రహ పూజా విధానము

రాహునకు నైఋతి దిశలో శూర్ప (చేట)ఆకారముగా మండలమును వ్రాసి అందులో మినుములు పరచి

మంత్రము :- "కయానో వామదేవో రాహుర్గాయత్రీ| కయాన ఇత్యస్య మంత్రస్య | వామదేవఋషిః | రాహుర్దేవతా | గాయత్రీఛంద్రః | యజమానస్య అధిదేవతా ప్రత్యధిదేవతా | సహిత రాహుగ్రహ ప్రసాద సిద్ధ్యర్థే రాహుగ్రహారాధనే వినియోగః ॥

అని యుచ్చరించి తరువాత

మంత్రము :- "కయావః - అంగుష్ఠాభ్యాం నమః | చిత్ర ఆభువత్ - తర్జనీభ్యాం నమః | ఊతి - మధ్యమాభ్యాం నమః| సదావృధః - అనామికాభ్యాం నమః | సఖా - కనిష్ఠికాభ్యాం నమః | కయా-శచ ష్ఠయావృతా - కరతల కర పృష్ఠాభ్యాం నమః ॥"

అని కరన్యాసమునాచరించి (ఇదే మేరకు హృదయాదిన్యాసమును గూడ ఆచరించునది.) తరువాత

మంత్రము :- "ఓం భూర్భువస్సువరోమితి దిగ్బంధః"

అని చెప్పి అన్ని దిక్కులకు నీరును ప్రోక్షించి పిదప ధ్యానము

మంత్రము :- "పైఠీనసో బర్బరదేశజాత శూర్పాసనస్సింహగతస్యధూమ్రః| యామ్యాయనో నైఋతిః కరాళో వరప్రద శూల సచర్మ ఖడ్గః ॥

—

ధూమ్రాంబరో ధూమ్రవపుః కిరీటీ కరాళ వక్త్రః కరాళశూలీ |
చతుర్భుజశ్చర్మ ధరశ్చరాహుః సింహాధిరూఢో వరదోస్తు తస్మై ॥"

అని ధ్యానించి

మంత్రము :- రాహుం ధూమ్రవర్ణం | ధూమ్రమాల్యాం బరధరం | ధూమ్రగంధానులేపనం | ధూమ్రాశ్వ | ధూమ్రఛత్రం | ధ్వజ పతాకోపశోభితం | దివ్యరథమారూఢం | మేరుం అప్రదక్షిణీ కుర్వాణం| గ్రహమండలే ప్రవిష్టం| సాంగం| సాయుధం| సవాహనం| సర్వాస్త్రం| సశక్తి| సపత్నీ సపుత్ర పరివార సమేతం| సర్వాలంకార భూషితం | అధి దేవతా ప్రత్యధి దేవతా సహిత సూర్యగ్రహస్య | నైఋుతి దిగ్భాగే శూర్పాకార మండలే | మాషధాన్యస్యోపరి | భగవంతం | భూః - రాహుగ్రహ మావాహయామి | భువః - రాహు గ్రహ మావాహయామి | సువః - రాహుగ్రహ మావాహయామి | ఓం భూర్భువస్సువః - రాహుగ్రహ మావాహయామి | స్థాపయామి పూజయామి |

అని యుచ్చరించి రాహుగ్రహము నావాహించి, స్థాపించి, పూజించి తరువాత రాహుగ్రహముయొక్క దక్షిణదిశలో

మంత్రము :- "అయంగౌః పృశ్నిరక్రమీద సనన్మాతరం పునః| పితరంచ ప్రయంత్సువః ॥ రాహుగ్రహాధి దేవతాం | సాంగాం సాయుధాం సవాహనాం సశక్తి పుత్ర పరివారసమేతాం| రాహుగ్రహస్య దక్షిణతః గామావాహయామి | స్థాపయామి | పూజయామి ॥

అని చెప్పి రాహుగ్రహాధి దేవతయగు గోవును ఆవాహించి పూజించునది తరువాత రాహుగ్రహము ఎడమప్రక్కన

మంత్రము :- "నమో అస్తు సర్వేభ్యో యేకేచ పృథివీమను | యే అంతరిక్షే యే దివితేభ్యస్సర్వేభ్యో నమః॥ రాహుగ్రహ ప్రత్యధిదేవతాం సర్పం సాంగం సాయుధం సవాహనం సశక్తి పత్నీపుత్ర పరివారసమేతం రాహుగ్రహస్య ఉత్తరతః సర్పమావాహయామి | స్థాపయామి పూజయామి ॥"

అని యుచ్చరించి ప్రత్యధిదేవతయగు సర్పమును ఆవాహించి, స్థాపించి, పూజించునది.

(ఇతి రాహుగ్రహ పూజా విధానము)

## అథ కేతుగ్రహ పూజా విధానము

కేతుగ్రహమునకు వాయువ్య దిక్కులో ధ్వజాకారమగు మండలమును వ్రాసి అందులో ఉలువలను బరచి

మంత్రము :- "కేతుం కృణ్వన్నిమధుచ్ఛందాః | కేతుర్గాయత్రీ | కేతుం కృణ్వన్నిత్యస్య | మంత్రస్య మధుచ్ఛంద ఋషిః | కేతుర్దేవతా | గాయత్రీఛందః | యజమానస్య అధిదేవతా ప్రత్యధిదేవతా సహిత | కేతుగ్రహ ప్రసాద సిద్ధ్యర్థే | కేతుగ్రహారాధనే వినియోగః ॥"

అని పఠించి తరువాత

మంత్రము :- "కేతుం కృణ్వన్ - అంగుష్ఠాభ్యాం నమః | అకేతవే - తర్జనీభ్యాం నమః | పేశోమర్యాః - మధ్యమాభ్యాం నమః | అపేశసే అనామికాభ్యాం నమః | సముషద్భిః కనిష్ఠికాభ్యాం నమః | అజాయథాః కరతల కర పృష్ఠాభ్యాం నమః ॥"

అని కరన్యాస మొనర్చి (ఇదే విధముగా హృదయన్యాసము నాచరించునది) తదుపరి

మంత్రము :- ఓం భూర్భువస్సువరోమితి దిగ్బంధః"

అని పఠించి అన్ని దిక్కులకు జలమును ప్రోక్షించవలెను. పిదప ధ్యానము

మంత్రము :- "ధ్వజాసనో జైమిని గోత్రజాతో వేదేషు వేదేషు విచిత్ర వర్ణః। యామ్యాననో వాయుదిశి ప్రఖడ్గశ్చర్మీ శిఖీచాష్ట శతశ్చకేతుః। చిత్రాంబరశ్చిత్రవపుః కిరీటీ గృధ్రాసనస్థో వరదో ద్విబాహుః॥ విరూప వక్త్రో మణిభూషితాంగస్సదాస్తుమె కేతుగణః ప్రశాంతః॥ ఓం కేతుం కృణ్వన్నకేతవే పేశోమర్యాఅపేశసె। సముషద్భిరజాయథాః॥"

అని ధ్యానించి

మంత్రము :- "కేతుం చిత్రవర్ణం। చిత్రమాల్యాంబరధరం। చిత్ర గంధానులేపనం। చిత్రాశ్వ। చిత్రచ్ఛత్ర। ధ్వజపతాకశోభితం। దివ్యరథమారూఢం। మేరుం అప్రదక్షిణే కుర్వాణం। గ్రహమండలే ప్రవిష్టం। సాంగం। సాయుధం। సవాహనం। సరాష్ట్రం। సశక్తి సపత్నీ సపుత్ర పరివారసమేతం। సర్వాలంకార భూషితం। అధిదేవతా ప్రత్యధిదేవతా సహితం। సూర్యగ్రహస్య వాయువ్య దిగ్భాగే। ధ్వజాకార మండలే కుళిత్థధాన్యస్యోపరి భగవంతం। భూః - కేతు గ్రహ మావాహయామి। భువః - కేతుగ్రహ మావాహయామి। సువః - కేతుగ్రహ మావాహయామి॥ ఓం భూర్భువస్సువః కేతుగ్రహ మావాహ యామి। స్థాపయామి। పూజయామి।

అని యుచ్చరించి, కేతు గ్రహము నావాహించి, స్థాపించి, పూజించునది. తదుపరి కేతు గ్రహమునకు దక్షిణ దిశలో

మంత్రము :- "సచిత్ర చిత్రం చిత్రయంతమస్మై చిత్రః క్షత్రః చిత్ర తమం వయోధాం చంద్రం రయిం పురువీరం బృహంతం చంద్ర చంద్రాభిర్గృణతె దువస్వ ॥" కేతుగ్రహాధి దేవతాం చిత్రగుప్తం సాంగం సాయుధం సవాహనం సశక్తి పత్నీపుత్ర పరివారసమేతం। కేతు గ్రహస్య దక్షిణతః చిత్రగుప్త మావాహయామి। స్థాపయామి। పూజయామి ॥"

అని యుచ్చరించి కేతుగ్రహాది దేవతయగు చిత్రగుప్తులను ఆవాహించి, పూజించునది.

తరువాత కేతుగ్రహమునకు ఎడమభాగమున

మంత్రము :- "బ్రహ్మదేవానాం పదవీః కవీనామృషిర్విప్రాణాం మహిషో మృగాణాం। శ్యేనోగృధ్రాణాగ్ం స్వధితిర్వనానాగ్ం సోమః। పవిత్ర మత్యేతిరేభన్ ॥" కేతుగ్రహ ప్రత్యధిదేవతాం బ్రహ్మాణం సాంగం సాయుధం సవాహనం సశక్తి పత్నీపుత్ర పరివారసమేతం। కేతుగ్రహ స్యోత్తరతః। బ్రహ్మాణ మావాహయామి। స్థాపయామి। పూజయామి॥

అని పఠించి కేతుగ్రహముయొక్క ప్రత్యధిదేవతయగు బ్రహ్మను ఆవాహించి పూజించునది.

(ఇతి కేతుగ్రహ పూజావిధి సమాప్తము)

( ఇతి నవగ్రహ పూజావిధిః )

# నూతన గృహప్రవేశ సమయే వాస్తుశాంతిః

తరువాత పూర్వోక్త ప్రకారముగా దేశకాలాదులనుచ్చరించి

మంత్రము :- "అస్యాం శుభతిథౌ సర్వోపద్రవనివృత్తిద్వారా అస్మిన్ గృహే సకల సుఖ సౌభాగ్య ప్రాప్త్యర్థం వాస్తుపురుష మావాహనార్థం వాస్తు కలశస్థాపనం కరిష్యే"

అని సంకల్పమునుజెప్పి ఇంటియొక్క మధ్యాంగణమునందు హస్త మాత్ర మండలమునుగాని, వేదికనుగానిజేసి, రంగవల్యాదులతో నలంకరించి, ఒక వ్రేలు (ఊంచు) ప్రమాణము వరి ధాన్యము బియ్యమును బోసి (పరచి) దానిపై నువ్వులుగూడ బోసి, బంగారు, వెండి (రజతము), తామ్రము (రాగి), ఇత్తడి, మృణ్మయము వీటిలో నేదేని యొకటి కలశమునుంచి వెనుక కలశపూజా విధానమున జెప్పిన రీతిగా జలము - మట్టి - గంధము - చిగుళ్ళు - టెంకాయ - కూర్చ (గరికతోజేసిన) - వస్త్రము, వీనినక్కడ ఉంచి, తెల్ల దారముతో జుట్టి, నిష్క ప్రమాణముగల బంగారు వాస్తు ప్రతిమను

మంత్రము :- "అగ్నిసప్తిం వాజిం భరం దధాత్యగ్నిం వీరస్పృత్యం కర్మనిష్ఠాం । అగ్నిరోదసీ విచరత్సమంజన్నగ్నిర్నారీం వీరకుక్షిం పురంధ్రీం ॥"

అని మంత్రము నుచ్చరించి, ప్రతిమను అగ్నిలోవేసి, శుద్ధియొనర్చి, పంచ గవ్యముతో గడిగి కలశమునందుంచవలెను.

మంత్రము :- "వాస్తోష్పత ఇతి మంత్రస్య వశిష్ఠ ఋషిః । త్రిష్టుప్ ఛందః । వాస్తుపురుషో దేవతా । వృషవాస్త్వావాహనే వినియోగః ॥

(వాస్తోష్పతే ప్రతిజానీహ్యస్మాంథ్స్వావేశో అనమీవో భవానః । యత్వ మహే ప్రతితన్నోజుషస్వశన్న ఏది ద్విపదే శంచతుష్పదే)

"ఓం భూర్భువస్సువః । భోవాస్తుపురుష మహాబల పరాక్రమ సర్వదేవాశ్రిత శరీరభర్గపుత్ర భగవన్ ఇహాగచ్ఛ। ఇహతిష్ఠ ఆగచ్ఛ భగవన్ వాస్తో సర్వదేవై రధిష్ఠిత। భగవన్ కురుకల్యాణం గృహేస్మిన్ సన్నిధోభవ, ఇహస్వాగతోభవ ॥"

అని యుచ్చరించి, వాస్తుపురుషుని నావాహించి, పూర్వోక్తోపచార ములతో బూజించి, వాస్తుబలిని ముందుంచి

మంత్రము :- "మంత్రహీనం క్రియాహీనం భక్తిశ్రద్ధా సమన్వితం ।
యత్పూజితం మయాదేవ - పరిపూర్ణం తదస్తుమే ॥"

అని ప్రార్థించవలెను, తరువాత నా వాస్తుపురుషునకు ఉత్తరదిశలో అఘోరమూర్తి యావాహామునకుగాను కలశమును స్థాపించి,

మంత్రము :- "అఘోరేభ్యోథ...రుద్రరూపేభ్యః" అఘోరమూర్తి మావాహయామి ॥

అని యుచ్చరించి అఘోరమూర్తి నావాహించి షోడశోపచారములతో బూజించవలెను.

తదుపరి మహాచార్యులు, కులదేవతా స్వరూపులు ఐన పంచబ్రహ్మ విగ్రహాలను సద్యోజాతాది మంత్రములచేత దీక్షావిధిలో జెప్పబడిన విధముగా పంచకలశములందావాహించి పూజించవలెను. పిదప

మంత్రము :- "అస్మిన్ గృహే శాశ్వితైశ్వర్య స్థిరీకరణార్థం మహాలక్ష్మ్యా వాహనం కరిష్యే ॥"

అని సంకల్పించి, ఇంటికి ఉత్తర భాగములో చిన్న ఇంటి (గది)లో ఒక కలశమును స్థాపించి, హరిద్రా కుంకుమలతో లెపించి, వస్త్రమునుగప్పి, మాంగల్యాద్యాభరణములను బెట్టి (ఉంచి)

మంత్రము :- "సక్తుమివతితౌనా పునంతో యత్ర ధీరామనసా వాచ మక్రత । అత్రాసఖాయస్సఖ్యానిజానత భద్రైషాం లక్ష్మీర్నిహితాధివాచి॥ ఓం భూః - మహాలక్ష్మీ మావాహయామి । ఓం భువః - మహాలక్ష్మీ మావాహయామి । ఓం సువః - మహాలక్ష్మీ మావాహయామి । ఓం భూర్భువస్సువః మహాలక్ష్మీ మావాహయామి । స్థాపయామి । పూజయామి ॥

అని యుచ్చరించి ఆవాహించి షోడశోపచారములతో బూజించి, లక్ష్మీ ప్రీత్యర్థము ముత్తయిదువులకు వాయినముల నొసంగవలెను.

తరువాత ఋత్విజులు పవిత్ర పాణులై ప్రాణాయామము నాచరించి, దేశకాలాదులను బేర్కొని

మంత్రము :- అస్యాం శుభతిథౌ గృహప్రవేశాంగ భూతవాస్తు హోమ మాఖ్యం కర్మ కరిష్యమాణస్తదంగస్థండిలోల్లేఖనాద్యగ్ని ప్రతిష్ఠాపనం కరిష్యే"

అని సంకల్పించి, అగ్నిని ప్రతిష్ఠాపించి, అజ్యభాగాంతమగు ఆహుతి నొసంగి, సమిత్తు, తిలలు, పాయసము, నెయ్యి వీటితో యజమాని తన శక్తి కొలది

మంత్రము :- వాస్తోష్పత ఇతి చతుర్ణాం వశిష్ఠ ఋషిః వాస్తోష్పతిర్దేవతా త్రిష్టుప్ఛందః । వాస్తుహోమే వినియోగః ॥

"ఓం వాస్తోష్పతే ప్రతిజానీహ్యస్మాంథ్స్వావేశో అనమీవోభవానః ।
యత్త్వమహే ప్రతితన్నోజుషస్వశన్న ఏధి ద్విపదేశంచతుష్పదే స్వాహా ॥
వాస్తోష్పతయ ఇదం నమమ"

అను మంత్రముచేత వాస్తుపురుషునకు (౮) అథవా (౨౮) లేదా (౧౦౮) ఆహుతుల నొసంగి, తిలలు (నువ్వులు), గోధుమలను, తేనె వీటితో అఘోరమూర్తికి

మంత్రము :- "(అఘోరేభ్యోథ...రుద్రరూపేభ్యః) అఘోర రుద్రా యేదం నమమ ॥"

అని చెప్పి ఆహుతుల నొసంగి, అదేవిధముగా పంచబ్రహ్మ మూర్తులకు సద్యోజాతాది మంత్రములతో నెయ్యితోగూడిన పాయసమును ఎనమిదెనమిదిసార్లు ఆహుతులనొసంగి చివరిలో పూర్ణాహుతిని మరియు ప్రాయశ్చిత్తాహుతి నొసంగవలెను.

తరువాత దీపస్థానము, జలస్థానము, పశుస్థానము, శయనస్థానము, ధనస్థానము, దేవస్థానము, పాకస్థానాది ఇల్లంతటా లోపలిభాగమును, అన్ని ద్వారములను వాస్తు కలశోదకముతో ప్రోక్షించి, ద్వారములను బూజించి, లోహపు (ఇనుప) మొలలను (మేకులను) గొట్టి (పాతి)

మంత్రము :- "ఏన బద్ధో బలీరాజా - దానవేంద్రో మహాబలః ।
తేనత్వామభి బంధామి - రక్షేమాచల మాచల ॥"

అని చెప్పి, గృహమున (సుత్తి) చుట్టి కట్టవలెను. మరల ఒక కలశమున (కడవలో) నీరు నింపి పావమాన సూక్తమును బఠించుచు (అవిచ్ఛిన్న) అఖండ జలధార చుట్టును వదలాలి. (ఈ సూత్రము

తొణికినచో అశుభము మరియు జలధార ఛిన్నమైనను అశుభము) తరువాత దిక్పాలురకొరకు పెరుగుతో గల్పిన పసుపు గల్పిన అన్నముతోగాని, అథవా ముద్గాన్నముతో (మినుపపప్పు గల్పిన అన్నముతోగాని) ప్రతి దిక్కునకు 32 కబళములు (బుక్కలు) పరిమాణములతో బలిని ఎనమిది దిక్కులకొరకు చేసికొని తూర్పుదిశలో

మంత్రము :- "నమ సురవరాధీశ వరదాయ యశశ్వనే ! ఇంద్రాయ వజ్రహస్తాయ వృత్రహర్త్రే నమోనమః। ఇంద్రాయ నమః జలగంధాక్షత పత్ర పుష్ప ధూప-దీప నైవేద్యతాంబూల కర్పూరైన్య పరివారదేవతా సహితాయ ! ఇంద్రాయస్వాహా ఇమం బలిం దదామి ॥"

అని యుచ్చరించి బలినిచ్చి తర్పణమును వదలవలెను. పిదప ఆగ్నేయ దిశలో

మంత్రము :- "అగ్నయే రుద్రరూపాయ నమో వైశ్వానరాయచ । నమస్తేజః స్వరూపాయ జగజ్జీవనమూర్తయే" అగ్నయే నమః । జలగం...అగ్నయేస్వాహా । ఇమం బలిం దదామి ॥

అని చెప్పి, బలినొసంగి అర్ఘ్యమును వదలవలెను.

అనంతరము దక్షిణ దిశలో

మంత్రము :- "నమస్తే ధర్మరాజాయ, నమో వైవస్వతాయచ। నమస్తే యమదేవాయ నమస్తే కాలరూపిణే" యమాయనమః । జలగం... యమాయ స్వాహా । ఇమం బలిం దదామి ॥

అని యుచ్చరించి బలినొసంగి తర్పణము వదలవలెను.

నైఋతి దిశలో

మంత్రము :- "నమః శంకరభక్తాయ దైత్యేశాయ నమోస్తుతే। నమస్తే రాక్షసేశాయ మహానిఋుతయై నమః" నిఋుఋుతయే నమః। జలగం...నిఋుఋుతయే స్వాహా। ఇమం దధ్యన్నం బలిం దాదామి॥

అని బలినొసంగి తర్పణము వదలి

వరుణుని దిశలో

మంత్రము :- "నమస్తే వరుణరూపాయ, నమస్తే ద్విగుణాత్మనే। వర్ణాది నామభేదేన వర్ణరూపాయతే నమః" వరుణాయ నమః జలగం... వరుణాయస్వాహా। ఇమం హరిద్రాన్నం బలిం దదామి॥

అని యుచ్చరించి బలియొసంగి తర్పణము వదలాలి.

వాయవ్య దిశలో

మంత్రము :- "నమస్తే వాయుదేవాయ, నమస్తే ద్విగుణాత్మనే। ప్రాణాది నామభేదేన వర్ణరూపాయతే నమః" వాయవే నమః। జలగం... వాయవే స్వాహా। ఇమం బలిం దదామి॥

అని బలియొసంగి, తర్పణము వదలవలెను.

ఉత్తర దిశలో

మంత్రము :- "నమస్సోమాయ సౌమ్యాయ ధనదాయ మహాత్మనే। శివ స్నేహప్రరూఢాయ జగదానంద కారిణే" కుబేరాయ నమః। జలగం... కుబేరాయస్వాహా। ఇమం బలిం దదామి॥

అని బలినొసంగి, తర్పణము వదలి

ఈశాన్య దిక్కునందు

మంత్రము :- "నమః శివాయ శాంతాయ సచ్చిదానంద మూర్తయే।
ఈశానాయ నమస్తుభ్యం క్లేశనాశాయ శంభవే" ఈశానాయ నమః।
జలగంధాక్షత పుష్పము ధూప - దీప - నైవేద్య తాంబూల కర్పూరైః
సపరివార దేవతా సహితాయ ఈశానాయ స్వాహాః। ఇమం బలిం
దదామి ॥

అని బలినొసంగి తర్పణము వీడి, ఆ తదుపరి

మంత్రము :- "యజ్ఞేన యజ్ఞ...దేవాః" గచ్ఛగచ్ఛసురశ్రేష్ఠ స్వస్థానం
పరమేశ్వర। యత్రబ్రహ్మాదయో దేవాస్తత్ర గచ్ఛ గణాధిప ॥

అని గణేశ్వరుని "గచ్ఛగచ్ఛ సురశ్రేష్ఠ ...స్వస్థానం సురేశ్వర" అని ఇంద్రాది దిక్పాలురను "గచ్ఛగచ్ఛ సురశ్రేష్ఠస్తత్రగచ్ఛ గ్రహేశ్వర" అని నవగ్రహములను "గచ్ఛగచ్ఛసుర...స్తత్రగచ్ఛహుతాశన" అగ్నినిగూడ అదేవిధముగా (ఆదియందు గచ్ఛగచ్ఛ సురశ్రేష్ఠ..." చివరిలో ఉద్వాపన జేయబడే దేవతయొక్క పేరును జెప్పి) ఉద్వాపన జేయవలెను. తరువాత హోమ భస్మమును ధరించి మాహేశ్వరులు కలశోదకముచేత దంపతులకు మార్జన యొనర్చవలెను. తదుపరి యజమానిని

మంత్రము :- "ప్రతిమాం వస్త్రసంయుక్తాం ప్రాప్తోరిష్ట ప్రశాంతయే।
తస్మాదస్యాః ప్రదానేన అతఃశ్శాంతి ప్రయచ్ఛమే॥"

అని యుచ్చరించి కలశము, వస్త్రము, ప్రతిమలను జేయవలెను, పిదప యథాశక్తి దశ (పది) దానములను ఒసంగవలయును, వీర మాహేశ్వరులకు దక్షిణ తాంబూలఫలాదులను ఒసంగి శ్రీరుద్ర పారాయణమును జేయించి నానా విధములైన భక్ష్య భోజ్యాదులతో వీర మాహేశ్వరులను తృప్తిపరచి వారినుండి మంగలాశీర్వాదములను బడసి బంధు మిత్రులతో గూడి భోజనము జేయవలెను.

(ఇతి నూతన గృహప్రవేశ సమయే వాస్తుశాంతిః)

## నూతన గృహప్రవేశ సమయమున మొట్ట మొదట జేయు విధానమియ్యది

నూతన గృహము కట్టడము పూర్తియైన తరువాత ప్రాజ్ఞ జ్యోతిష్కులచేత గృహప్రవేశ ముహూర్తమును నిర్ణయించి, ఆ దినమున ఇంటి యజమానుడు శివపూజాది నిత్యకర్మలను ముగించుకొని, శుభ్రమైన మడి దుస్తులను ధరించి, శుద్ధమైన జలముతో నింపిన కలశము (కడవ) ఫల, పుష్ప, చిగురాకులు, దర్భ, గరిక, చందనము, భస్మాదులతోగూడిన తాంబాళము (పళ్ళెము)ను దీసికొని, వేదాగమములను దెల్సి (ఎఱింగి)న పరిశుద్ధులై (శుద్ధ మనస్కులై)న నలుగురు వీరమాహేశ్వరులచేత, పతివ్రతలైన ముత్తయిదువలతోడను, తన బంధు జనులతోడను గూడికొని లేగదూడతో యున్న గోవును అష్ట మంగళ ద్రవ్యములను, బియ్యము,

నువ్వులు, బెల్లము, నెయ్యి, మినుములు, పెసలు, తేనె, పాలు, ఉప్పు, సున్నము, గుమ్మడికాయ, టెంకాయ, అరటిపండ్లు మొదలగు సామగ్రిని (వస్తువులను) తీసికొనివచ్చి, ద్వారమునకు గప్పియుంచిన పసుపు అద్దిన వస్త్రముండిన తోరణాదులతో నలంకరించిన గృహ ద్వారమున నిలచి, మధ్య భాగమున భస్మము ప్రణవమును, ఉభయ పార్శ్వములందు (రెండువైపుల) శ్రీకారమును వ్రాసి గణపతిని ధ్యానించి

మంత్రము :- "వాస్తోష్పతి మావాహయామి"

అని యుచ్చరించి వాస్తుపురుషు నావాహించి, పూర్వోక్త సర్వపూజా ప్రకరణము విధముగా ఉపచారములతో బూజించవలెను. పిదప దేశ కాలాదులను బేర్కొని

మంత్రము :- "అస్యాం శుభతిథౌ ఉపాత్త దురితక్షయద్వారా శ్రీపరమేశ్వర ప్రీత్యర్థం ధర్మార్థ కామ మోక్ష చతుర్విధ పురుషార్థ సిద్ధ్యర్థంచ గృహప్రవేశాఖ్యం కర్మ కరిష్యే"

అని సంకల్పమును జెప్పి, ద్వారమునకు గప్పిన కాండ పటము (తెర వస్త్రము - పరదా)ను దీసి యజమానుడు తన దోసిటితో వరి మురుములరా లను దీసికొని మొదట జెప్పిన పురుష సూక్తములోని

మంత్రము :- "సహస్రశీర్షా పురుషః...సంతిదేవాః"

అనే పర్యంతము (వరకు) మంత్రముల నుచ్చరిస్తు, లోనికి (గృహము లోనికి) మూడుసార్లు చల్లి జ్యోతిష్కులచేత నిర్ణయించిన స్థిరలగ్నము సుమూహూర్తమందు లేగతోగూడిన గోవును ముందుంచుకొని మొట్ట

మొదట కుడిపాదమును బెట్టి లోనికి ప్రవేశించవలెను. తదుపరి ద్వారమునకు శాఖాధిపతులైన ధాతృ - విధాతృవులను

మంత్రము :- "ధాతృ విధాతృభ్యాం నమః"

అను నా మంత్రముచేత ఆవాహనాది షోడశోపచారములతో బూజించి, మరియు స్తంభమునుగూడ అర్చించవలయును.

మంత్రము :- "ధారయత్వం మహాభాగ నిర్మితో విశ్వకర్మణా ।
స్థాపితశ్శుభదోనిత్యం మమగేహంక్షమోభవ"

అని ప్రార్థించి, గృహము మధ్యభాగములో

మంత్రము :- "అపసర్పంతుతే భూతా - యేభూతాభువిసంస్థితాః ।
యే భూతావిఘ్నకర్తార - స్తేనశ్యంతు శివాజ్ఞయా॥"

అనే మంత్రము నుచ్చరించి తెల్లని ఆవాలువేసి (చల్లి) భూతములను బోనాడి, గోమయము, గోమూత్రము, గోరోజనము, పాలు - పెరుగు - నెయ్యి వీటితో బాహుమాత్రము (౨ మూరలు) నేలను సమ్మార్జనమొనర్చి (అలికి), రెండు మూరలు చదరపు రంగవల్లిని వదలి భద్రపీఠమున భార్యతో పూర్వపు (తూర్పు) దిక్కు ముఖముజేసి కూర్చొని, పురోహితుడు ఉత్తర ముఖముగా గూర్చుండి

మంత్రము :- "ఓం తదేవలగ్నం...తేంఘ్రియుగం స్మరామి" యస్మిన్ వా నామరూపాభ్యాం - యాదేవీ సర్వమంగళా । తయో స్సంస్మరణా త్పుంసాం సర్వతో జయమంగళం ॥౧॥ అగజానన పద్మార్కం-గజానన మహర్నిశం । అనేకదంతం భక్తానామేకదంతముపాస్మహే ॥౨॥

శుక్లాం బరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం। ప్రసన్నవదనం ధ్యాయే త్సర్వవిఘ్నోపశాంతయే॥౨॥ సుముహూర్తమస్తు। సుప్రతిష్ఠితమస్తు॥"

అని ఇష్టదేవతను సంస్మరించి

మంత్రము :- "ఆగమార్థంతు దేవానాం...సర్వేవసతు శంకర"

అని గంటను ప్రయోగించి, ఆచనము నాచరించి, చేతులు గడుగుకొని ఇంద్రియములకు ఉదక స్పర్శను గావించుకొని, తర్జనీ-మధ్యమ, ఈ రెండు వ్రేళ్ళను వదలి, అంగుష్ఠ-అనామిక-కనిష్ఠిక, ఈ మూడు వ్రేళ్ళతో ముక్కు పుటమును బట్టుకొని, గాయత్రీ మంత్రోచ్చారముతో, చంద్ర స్వరమైన వామ (ఎడమ) నాసాపుటముతో వాయువును పూరించి, అదే మంత్రముతో కుంభించి, సూర్యస్వరమైన దక్షిణ నాసాపుటముతో అదే మంత్రము ఉచ్చరిస్తు రేచకము ననుష్ఠించవలెను. ఈవిధముగా మూడుసార్లు ప్రాణాయామమును జేసి, చేతిలో పుష్పాక్షతలను బట్టుకొని దేశ కాలాదుల జెర్కొని

మంత్రము :- "అస్యాం శుభతిథౌ అస్మాకం సహకుటుంబానాం క్షేమ స్థైర్య విజయాభయాయురారోగ్య ధన కనక వస్తు వాహన పుత్ర పౌత్రాభివృద్ధ్యర్థం। మయోపాత్త దురితక్షయద్వారా శ్రీ పార్వతీ పరమేశ్వర ప్రీత్యర్థం నూతన గృహప్రవేశాఖ్యం కర్మ కరిష్యమాణః నూతన గృహప్రవేశాంగభూత నాందీశోభన దేవతా ప్రీత్యర్థం నాందీ సమారాధనాఖ్యం కర్మ కరిష్యమాణః గృహప్రవేశ లగ్నకాలే ఆదిత్యానాం నవానాం గ్రహాణాం మధ్యేయే యేగ్రహాః అరిష్టస్థానేషు స్థితాః।

తేషాం గ్రహాణామనుకూలత్వ సిద్ధ్యర్థం యేయే గ్రహ శుభస్థానేషుస్థితాః తేషాం గ్రహాణాం అత్యంత శుభ ఫలావాప్త్యర్థంచ నవగ్రహపూజాఖ్యాం

కర్మ కరిష్యమాణ । ప్రధానాంగభూత వాస్తుదేవతా ముద్దిస్య వాస్తు దేవతా ప్రీత్యర్థం వాస్తుకలశ స్థాపనం కరిష్యమాణః వాస్తుమర్మ సంధానాయ అఘోర మూర్త్యావాహనార్థం అఘోర కలశస్థాపనం కరిష్యమాణః అస్మిన్ గృహె శాశ్వతైశ్వర్య స్థిరీకరణార్థం మహాలక్ష్మి ఆవాహనంచ కరిష్యమాణః। పంచబ్రహ్మదేవతా ముద్దిశ్య పంచబ్రహ్మ దేవతా ప్రీత్యర్థం పంచకలశ స్థాపనం కరిష్య కర్మ కరిష్యమాణః । తదాదౌ శుద్ధ్యర్థం। వృద్ధ్యర్థం। అభ్యుదయార్థం। శాంత్యర్థంచ। మాహేశ్వరైసహ స్వస్తి పుణ్యాహవాచనం కరిష్యమాణః। అదౌ నిర్విఘ్నేన పరిసమాప్తిద్వారా । ఉత్తరోత్తరాభివృద్ధ్యర్థం శ్రీ మహాగణపతి పూజాం కరిష్యే ।

అని సంకల్పమును బఠించి, తదంగముగా కలశారాధనను జేయవలెను. అది యెట్లనగా

ఈశాన్యదిశలో నూతన జలపూర్ణ కలశమునుబెట్టి, దానిపై హస్తముంచి

మంత్రము :- "కలశస్యముఖేరుద్రః... సన్నిధిం కురు"

అనియుచ్చరించి తీర్థముల నావాహించి

మంత్రము :- "ఆపోవా... క్షయకారకాః"

ఈ మంత్రమును బఠించి కలశారాధన యొనర్చి, అట్టి కలశోదకముతో పూజా ద్రవ్యములపై బ్రోక్షించి, మొదట జెప్పిన రీతిగా గణపతి ఆవాహనపూజాదులను సల్పి, స్వస్తి పుణ్యాహములను, నాందీ సమారాధనము వాచరించవలెను. తరువాత నవగ్రహ కలశ స్థాపనము జేయవలెను.

## నవగ్రహ కలశ స్థాపనము

దేశకాలాదులను బేర్కొని

మంత్రము :- "అస్యాం శుభతిథౌ ఉపాత్త దురితక్షయద్వారా శ్రీపరమేశ్వర ప్రీత్యర్థం గ్రహప్రవేశాఖ్య కర్మ కరిష్యే। తదంగత్వేన శ్రీ నవగ్రహారాధనం కరిష్యే"

అని సంకల్పించి మధ్యవేదికపై బియ్యమును పరచి, పూర్వపశ్చిమ ముఖముగా నాలుగు, ఉత్తర దక్షిణ ముఖముగా నాలుగు నాలుగు రేఖల (గీతల)ను వ్రాసి తొమ్మిది కోణములనుజేసి, మధ్యకోణములో 1) సూర్యునకు వర్తులాకార మండలమును 2) ఆగ్నేయ దిక్కులో చంద్రునకు చతురస్రాకారమైన మండలమును 3) దక్షిణ దిక్కులో అంగారకునకు త్రికోణాకారమగు మండలమును 4) ఈశాన్య దిక్కులో బుధునకు బాణాకారమైన మండలమును 5) ఉత్తర దిక్కులో బృహస్పతికి దీర్ఘచతురశ్ర మండలమును 6) పూర్వ దిక్కులో శుక్రునకు పంచకోణాకారమైన మండలమును 7) పశ్చిమదిశలో శనైశ్వరునకు ధనురాకారముగల మండలము 8) నైఋత్య దిశలో రాహువునకు శూర్పాకారముగల మండలమును 9) వాయవ్య దిక్కులో కేతువునకు ధ్వజాకారమైన మండలమును వ్రాసి, ఆయాయా మండలములలోనే ఆయాయా గ్రహములను స్థాపించవలెను. నవగ్రహములకు9, అధిదేవతలకు 9, ప్రత్యధిదేవతలకు 9 మొత్తము పైసలు 27 కలశములను ఉంచుట మంచిది, యజమానుడు అశక్తుడై యున్న యెడల 9 కలశములనైనను స్థాపించవచ్చును. అథవా 9 డొప్పలనైన ఉంచాలి.

(ఇతి నవగ్రహ కలశ స్థాపన)

# దేవతా ప్రతిష్ఠా విధానము

దేవతాస్థాపన జేయ నిర్ణయించిన దినమునకంటే మొదట 7-5-3వ దినములందుగాని అథవా స్థాపన జేయు దినమునందుగాని, దేవతా స్థాపన జేయు మందిరమునకు ఉత్తరభాగములో అథవా తూర్పు భాగమునందు 16 లేదా 12 మూరల పొడుగాటి మంటపమును నిర్మించి, దాని మధ్యలో 7-5 అథవా 4 మూరల పొడుగు 1 ఒక మూర ఎత్తుగా నుండే వేదికను నిర్మించాలి. ఆ మంటపమునకు నాలుగు దిక్కులకు నాలుగు ద్వారములను గూడ నిర్మించవలెను. దేవుడి యభిషేకమునకై ఒక మంటపమును నిర్మించి, అందులో మూఁడు మూరల వేదికలను నిర్మించాలి

శిల్ప స్థానమునుండి దేవతా విగ్రహమును ఊరేగింపుతో దీసికొని (ఉత్సవముతో)వచ్చి, గుడిచుట్టు ప్రదక్షిణ యొనర్చి తీసికొని వచ్చి మంటపమునక బహిరంగణమున (బయట - వెలుపల) ఆసనమును బరచి దానిపైన విగ్రహములు బెట్టి, యజమానుడు ప్రాణాయామము నాచరించి, దేశకాలాదుల నుచ్చరించి

మంత్రము :- "అయం శివలింగస్య (ఇక్కడ యే దేవతా విగ్రహమును ప్రతిష్ఠిస్తె ఆదేవతయొక్క పేరును ఉచ్చరించాలి, శివలింగస్య అనేచోట) దేవకలా సాన్నిధ్యార్థమాయుః శ్రీ సర్వఫలాక్షయ్య సుఖ కామ -ఈశ్వర ప్రీతికామాయాః శివలింగస్య ప్రతిష్ఠాం కరిష్యే। ఆరబ్ధస్య కర్మణః నిర్విఘ్నేన పరిసమాప్త్యర్థం శ్రీ విఘ్నేశ్వర పూజామహం కరిష్యే।

అని సంకల్పము నుచ్చరించి, విఘ్నేశ్వర పూజను యథావిధితోడ నర్చించి, స్వస్తి పుణ్యాహవాచనమును ఆచరించవలెను. తరువాత

మంత్రము :- "ప్రతిమాయాగ సిద్ధ్యర్థం శ్రాద్ధమేతత్సు దుర్లభం ।
యజనాయాత్మనః శకం కరిష్యే మాతృపూర్వకర్మ ।

అను మంత్రము నుచ్చరించి, మాతృపూజా (మాతృకా పూజను గురించి మొదలు చెప్పినట్లుగా అనుష్ఠానవిధి పూర్వకముగా చేయవలెను). నాందీశ్రాద్ధలను యథా సాంగముగా నెరవేర్చి, ఆచార్యుని, 4 మంది ఋత్విజాలను, 4రు ద్వారపాలకులను వరించి పూజించవలెను.

ఆ మీదట ఆచార్యుడు ప్రార్థన యొనర్చునది.

మంత్రము :- "మంత్రమూర్తిర్భవాన్నాథ సంసారోచ్ఛేదకారకః। దేవపూజార్థాయథాస్యాత్కురు ధర్మాగతించనః । సంసారభయభీతేన అయం యజ్ఞః సుభక్తితః । ప్రారబ్దస్త్వత్ప్రసాదేన నిర్విఘ్నంమే భవత్వతి॥"

అని యుచ్చరించి ఆచార్యుని ప్రార్థించవలెను. తరువాత మంగళ వాయిద్యములు మ్రోగుచుండ, మాహేశ్వరులు మరియు సుమంగళుల (ముత్తయిదువలు)తో పూర్ణకుంభము చేతబూని "భద్రం కర్ణే..." అను మంత్రము నుచ్చరించుచు, మంటప ప్రదక్షిణ యొనర్చి, పడమర ద్వారము నుండి లోపలికి ప్రవేశించవలెను. తరువాత ఆచార్యుడు

మంత్రము :- "అపక్రామంతు భూతాని - పిశాచా సర్వతోదిశం ।
సర్వేషా మవిరోధేన - బ్రహ్మకర్మ సమారభే ॥"

ఈ మంత్రము నుచ్చరించి, అక్కడ తెల్లని ఆవాలు పరచి (వేసి)

మంత్రము :- "దేవా ఆయాంతు యాతుధానా -
అపయాంతు విష్ణోదేవయజనం రక్షస్వ"

అని రక్షామంత్రమును జెప్పి, వేదికకు ఆగ్నేయ దిక్కులో

మంత్రము :- "వసుధాయై నమః వసుదా మావాహయామి"

అని వసుదాయను స్థానమును ఆవాహించి, గంధ పుష్పాదులతో బూజించవలెను. (ఇదేరీతిగా తూర్పుదిక్కులోను)

మంత్రము :- "భద్రాయై నమః భద్రామావాహయామి"

అని ఆవాహించి పూజించునది. దక్షిణ దిశయందు

మంత్రము :- "ఆదిత్యై నమః, ఆదిత్య మావాహయామి"

అని పశ్చిమ (పడమర) దిక్కునందు

మంత్రము :- "నందాయై నమః నందా మావాహయామి"

అని యుచ్చరించి, పునః మంటపమునకు ఆగ్నేయ మూలకు

మంత్రము :- "భూత్యై నమః, భూతి మావాహయామి"

అని దక్షిణ దిశలో

మంత్రము :- "సరస్వత్యై నమః, సరస్వతీ మావాహయామి"

అని నైరుతి దిశలో

మంత్రము :- "పూర్వ సంధ్యాయై నమః, పూర్వసంధి మావాహయామి"

అని పశ్చిమ దిక్కున

మంత్రము :- "మధ్య సంధ్యాయై నమః, మధ్యసంధి మావాహయామి"

అని వాయవ్య దిక్కున

మంత్రము :- "పశ్చిమ సంధ్యాయై నమః, పశ్చిమసంధి మావాహయామి"

అని యుచ్చరించి ఉత్తర దిక్కున

మంత్రము :- "సావిత్ర్యై నమః, సావిత్రీ మావాహయామి"
అని ఈశాన్య దిశయందు

మంత్రము :- "బృహస్పత్యై నమః, బృహస్పతీ మావాహయామి"
అని తూర్పు దిక్కున

మంత్రము :- "ఆదిత్యై నమః, ఆదిత్య మావాహయామి"
అని దక్షిణాన

మంత్రము :- "పౌర్ణమాస్యై నమః, పౌర్ణమాస్య మావాహయామి"
అని పడమరలో

మంత్రము :- "శినీవాల్యై నమః, శినీవాలిమావాహయామి"

అని యుచ్చరించి, షోడశ స్థంభులను స్థాపించి, పూజించవలెను. వారివారి పేర్ల చివరలో "నమః" అని చెప్పి బలి నర్పించవలెను. పిదప "సర్వేభ్యో నమః" అని యుచ్చరించి, ద్వారములకు చేట్ల చిగుళ్ళను గట్టి పూజించాలి. తరువాత పశ్చిమ ద్వారము నుండి మంటపమునకు వెలుపలికి వచ్చి, తూర్పు దిక్కును మొదలుకొని ద్వార తోరణ (మండప) పూజను ఆరంభించవలెను.

ప్రథమతః తూర్పు దిక్కునకు

మంత్రము :- "సుదృఢ తోరణాయ నమః, అశ్వత్థతోరణేనైనం యజ్ఞం రక్ష సర్వవిఘ్నాన్నివారయ"

అని యుచ్చరించి పూజించునది, మరియు తూర్పుదిగ్భాగమునందలి ద్వారమున

మంత్రము :- "ప్రశాంత శిశిర"

నామ కలశమును స్థాపించి, పూజించవలెను. అట్టి కలశములో ఇంద్రునావాహించి, పూజించి, నమస్కరించి, పసుపు వర్ణముయొక్క ధ్వజ పతాకములను

మంత్రము :- "త్రాతార మింద్ర మవితార మింద్రగ్ం...మఘవా ధాత్వింద్రః ॥"

అను మంత్రమును పఠించి తోరణమున కానించి నిలబెట్టవలయును.

మంత్రము :- "ఇంద్రవ ఇతి ఇంద్రయ నమమ"

అని ఘృతౌదనముతో బలినొసంగి, అదే పూర్వము (తూర్పు)నందు.

మంత్రము :- "ఓం అగ్నిమీళ ఇతి ఋగ్వేదం పూజయామి"

అని ఋగ్వేదాన్ని బూజించి

మంత్రము :- "ఋగ్వేదః పద్మపత్రాక్షో గాయత్రః సోమదైవతః ।
అత్రిగోత్రస్తు విప్రేంద్ర ఋత్విక్త్వంమే మఖేభవ ॥"

అని ధ్యానించవలెను. ద్వారపాలకులు శ్రీ సూక్తము అథవా పావమానమును బఠించవలెను. తదుపరి ఆగ్నేయదిక్కున

మంత్రము :- "ఓం అగ్నయే నమః, అగ్ని మావాహయామి"

అని అగ్ని నావాహించి, పూజించునది. ఈ కోణమున (దిక్కులో) రక్తవర్ణముయొక్క ధ్వజ పతాకమును గట్టవలెను. "ఓం అగ్నిదూతాయ

నమమ" అని ఘృతోదనము బలినొసగి నమస్కరించవలెను. తరువాత దక్షిణ దిశలో

మంత్రము :- "ఓం సుభద్రతోరణాయ నమః, ఔదుంబరతోరణాయై నమః, యజ్ఞం రక్షస్సర్వ విఘ్నాన్నివారయ"

అని పూజించునది. ఈ దిక్కునందున్న ద్వారమున "పర్జన్యాశోక" నామక కలశమును స్థాపించి, పూజించునది. మరియు యముని ఆహ్వానించి, పూజించునది. నమస్కరించాలి, శ్యామ (నలుపు) రంగు గల ధ్వజ పతాకమును గట్టి

మంత్రము :- "యమాయ సోమం నమమ"

అని మాషభక్త బలిదానమును ఒసంగి నమస్కరించునది. తదుపరి "ఓం యజుర్వేదాయ నమః" అని యజుర్వేదము పూజించి,

మంత్రము :- "కాతరాక్షో యజుర్వేదస్త్రిష్టుభో విష్ణుదైవతః ।
కాశ్యపేయస్తు విప్రేంద్ర ఋత్విక్త్వంమే మఖేభవ ॥"

అని యజుర్వేదమును ధ్యానించవలెను. ద్వారపాలకులు ఆనోభద్రాను వాకమును, ఇంద్రబుచమును బఠించునది. ఆ పిదప నైరుతిదిక్కులో

మంత్రము :- "నిఋతయే నమః, నిఋతి మావాహయామి"

అని నైఋతిని ఆవాహించి, స్థాపించి పూజించునది. ఈ దిశలో (మూలకు) నలుపు వర్ణము ధ్వజ పతాకములను గట్టవలెను.

మంత్రము :- "ఓం పోషణాయ నమమ"

అను మంత్రమును ఉచ్చరించి, నల్లని ఆవాలను, అన్నము, నెయ్యి లతో గూడిన బలినొసంగవలెను. తరువాత పశ్చిమ దిక్కునందు.

మంత్రము :- "సుభీతతోరణాయ నమః, ప్లాక్షతోరణ్త్వైనం యజ్ఞం రక్షస్సర్వవిఘ్నా న్నివారయ"

అను దానితో బూజించునది. ఈ దిక్కునగల ద్వారములో "సంజీవనామృత" నామక కలశమును స్థాపించి యట వరుణుని ఆవాహించి పూజించునది. నమస్కరించి తెల్లని ధ్వజ పతాకములను గట్టి

మంత్రము :- "తత్వాయామి బ్రహణాయ నమః"

అని వెన్న, పాయసమును బలి ఇవ్వాలి. "ఓం అగ్నిఆయా సామ వేదాయ నమః" అని సామవేదమును బూజించి

మంత్రము :- "సామవేదస్తు పింగాక్షో జగతః శక్రదైవతః।
భారద్వాజస్తు విప్రేంద్ర ఋత్విక్త్వంమె మఖేభవ ॥"

అని ధ్యానించవలెను. ద్వారపాలకులు సామవేదమును బఠించాలి. పిదప వాయవ్యదిక్కున "వాయవే నమః వాయు మావాహయామి" అని వాయువు నావాహించి, స్థాపించి, పూజించునది. ఈ మూలయందు పొగ వర్ణముగల ధ్వజ పతాకములను కట్టవలెను.

మంత్రము :- "ఓం వాయవాయ నమమ"

అని యుచ్చరించి నెయ్యితోగూడిన గోధుమ పాయసమును బలివి అర్పించవలెను. ఆ పిదప ఉత్తరదిక్కులో

మంత్రము :- "సుప్రభ తోరణాయనమః, న్యగ్రోధతోరణైనం యజ్ఞం రక్షస్సర్వవిఘ్నాన్నివారయ"

"అని చెప్పి పూజించునది. ఈ దిశలోనున్న ద్వారమున "ధనశ్రీపద" నామక కలశమును స్థాపించి, సోముని ఆవాహించి, పూజించి, నమస్కరించి, సువర్ణ వర్ణముయొక్క ధ్వజపతాకములను గట్టి, "ఆప్యాయ స్వసమే తుతే" అని యుచ్చరించి, నెయ్యిలో గల్పిన కొఱ్ఱ పాయసమును బలి ఇచ్చునది.

మంత్రము :- "శంనో దేవీ ఓం అథర్వణవేదాయ నమః"

"అని అథర్వణవేదమును బూజించి

మంత్రము :- "సువర్ణ వర్ణ నయనోఽథర్వ నుష్టుప్ఛందః పురందరః।
వేదో వైతాన గోత్రస్తు ఋత్విక్త్వంమె మఖేభవ॥"

"అని ధ్యానించవలెను. ద్వారపాలకులు అథర్వ శిఖను పఠించాలి. తరువాత ఈశాన్య దిశలో "ఈశాయ నమః, ఈశాన మావాహయామి" అని ఈశానుని ఆవాహించి పూజించునది. ఈ దిక్కున రక్తవర్ణముగల ధ్వజ పతాకములను గట్టి, "ఓం క్రుద్రాయ నమః" అని నెయ్యిలో గల్పిన పాలను బలిగా సమర్పించవలెను. తరువాత ఈశానము, తూర్పు ఈ రెండు దిక్కుల మధ్యన "ఓం అనంతాయ నమః, అనంత మావాహయామి" అని అనంతుని నావాహించి పూజించునది. ఇక్కడ మేఘ వర్ణముయొక్క ధ్వజపతాకలను గట్టవలెను. "ఓం విష్ణుర్నుకాయ నమమ" అని బలి యొసగవలెను. పిదప పశ్చిమ నైఋత్య దిక్కులమధ్యన

మంత్రము :- "ఓం బ్రహ్మణే నమః, బ్రహ్మ మావాహయామి"

అని బ్రహ్మ నావాహించి, పూజించునది. ఇట రక్తవర్ణము ధ్వజ పతాకలను గట్టాలి.

మంత్రము :- "సనో భువనస్య పతయాయ నమమ"

అని పాయసమును బలినొసంగవలెను. తరువాత తూర్పుదిక్కునందు

మంత్రము :- "గణానాంత్వాగణపతిగ్ంహవామహె"

అని గణాధిపతిని బూజించి, నమస్కరించవలెను.

మంత్రము :- "నమోస్తు రుద్రరూపేభ్యోయే పృథివ్యాం యేంతరిక్ష యేదివి యేషామన్నం వాతో వర్షమిషవస్తేభ్యో నమః॥"

అని మంటపముయొక్క వెలుపలవైపునందు దశరుద్రులను స్థాపించి, పూజించి, బలినొసంగవలెను. అది యెట్లనగా

మంత్రము :- "యేకే త్విహలోకేషు ఆగతా బలికాంక్షిణః ।
తేభ్యో బలిం ప్రయచ్ఛామి నమస్కృత్య పునః పునః॥"

అని బలి నొసంగి ఆచమనమును వదలి

( ఇతి మంటపపూజ )

ఆ పిదప గురువు హోమ కుండమును పూజించి అగ్ని స్థాపన జేయాలి. ఋత్విజులందరు అగ్ని ప్రజ్వలించునటుల ఆహుతుల నొసంగవలెను. హోమ ప్రకరణమున జెప్పినట్లుగా సమస్తాహుతుల నొసంగి పూర్తి గావించి లింగమును స్థాపించే పీఠమును బూజించునది.

తరువాత బంగారముతో జేయబడిన వాస్తు ప్రతిమను పెరుగు, గరిక - సప్తధాన్యము శైవాల (నాచు) - గంధము - అక్షతలు - పుష్పములు కాల్చని మట్టిపాత్రలో బెట్టి, లింగమును స్థాపించే గుడికి ఆగ్నేయ మూలకు, ఉత్తరభాగమున మోకాలువరకు గుంత త్రవ్వి నీటితో నింపి, గంధ పుష్పాదులను, మట్టి పాత్రను ఉంచి, ఆ గుంతను అదే మట్టితో మూయవలెను (అట్టి మన్ను అధికమైన శుభప్రదం) ఈ ప్రకారముగా వాస్తు పూజను గావించి, ఆచార్యుడు మంటపము యొక్క ఈశానభాగములో గ్రహములను, అధిదేవతలను ప్రత్యధి దేవతలను, వినాయకుని, పంచలోక పాలురను పూజించవలెను.

ఋత్విజులు, సమిత్తు, చరు, ఆజ్యములతో వేయిన్నూటా యెనమిదిసార్లు అథవా నూటా యెనమిదిసార్లు ఆహుతుల నొసఁగి, విశ్వ కర్మని కొరకు కేవలము నెయ్యితో హోమము నాచరించి, బలినొసఁగి, పూర్ణాహుతి నివ్వవలయును.

తదుపరి గురువు స్నాన మంటపమున

మంత్రము :- "మహాదేవోమర్త్యాగ్ం ఆవివేశ"

అని యుచ్చరించి పంచగవ్యములతో భూమిని, వేదికలను, సంప్రోక్షించి, అందులో కుడివేదికపై పరచిన (వేసిన) ఇసుక అక్షతలలో స్వస్తిచిహ్నమును వ్రాసి, అట విశ్వకర్మని

మంత్రము :- "విశ్వకర్మాతు కర్తవ్యఃశ్మశ్రులోమాం సలాధరః ।
సందంశ పాణిర్ద్విభుజస్తేజోమూర్తిః ప్రతాపవాన్ ॥"

అని ధ్యానించి, సప్తవిధ ధాన్యముపై భద్రమగు పీఠనుంచి, వేదికకు పశ్చిమ భాగమున నీటితో నింపిన చిగుళ్ళతో గూడియున్న ఆరు

కలశములను (వృత్పల్లవ - వృక్షయ - కషాయ - గోమూత్ర - గోమయము-భస్మము - గంధము) నీటితో నింపి, వేరే అయిదు కలశములను సుగంధమైన జలముతో నింపిఉంచి, ఉత్తరదిక్కున వరుసగా ఉంచవలెను.

అక్కడ అంత్యస్థపతి కలశము, మధ్యవేదికకు పశ్చిమమున స్థాపించిన కలశములను దప్ప ఎనమిది కలశములను పూర్వాది క్రమముగా క్షారోదకము - క్షీరము - దధి - సర్పిష్ (నెయ్యి) ఇక్షురసము - నారికేళోదకము - స్వాదూదకము - గర్భోదకములను - నింపిఉంచి, హిరణ్యగర్భాది అష్ట మంత్రములను న్యాస మొనర్చవలెను.

ఇంక వేదికకు పడమర దిశలో ౧౦ కలశములను ఉంచి, వాటిలో మట్టి (పుట్టమన్ను) గోమయము - గోమూత్రము - భస్మము - గర్భిన పంచ గవ్యము - క్షీరము - దధి - ఘృతము - మధువు - శర్కరోదకములను నింపవలెను.

ఇదిగాక శుద్ధ జలమును నింపిన పదైదు (15) కలశములను సమీపమందుంచవలెను. సూక్ష్మ వస్త్రము - (జిలుగుబట్ట) సుగంధ తైలము - ఎవలు-బియ్యము - గోధుమలు - సిరిసెనగలు - బిల్వచూర్ణము-పిటిపిండి, నెల్లిబెట్టు? (ఉసిరికొమ్మ), మిశ్రగంధము - జటామాంసి - గంధెణ్ణె - సుగంధతైల మిశ్రిత గంధం - వీటిని సంగ్రహించుకోవాలి, తన వద్ద నుంచుకోవాలి. ఆ మీదట అన్ని కలశములలోను

మంత్రము :- "సర్వే సముద్రాః సరితస్తీర్థానిజలదానదాః ।
ఆయాంతుయజమానస్య దురితక్షయ కారకాః ॥"

అని తీర్థములను ఆవాహించవలెను. అనంతరము యజమానుని, ఆచార్యునితోబాటు లింగమూర్తిని దీసికొని, దాన్ని ప్రతిష్ఠించే స్థానమునకు వెళ్ళి, స్థలశుద్ధి గావించి దేశకాలాదుల నుచ్చరించి

మంత్రము :- "ప్రతిమా నిర్మాణే ప్రాణివధాది దోషనిరాసార్థం ఘృతేన। తిలైర్వాహోమం కరిష్యే ॥"

అని సంకల్పించి, ఆజ్యభాగాంతము హోమముజేసి "శ్రీ మహా దేవాయ నమః" అని యుచ్చరిస్తు నెయ్యితో రెండు (200) వందల ఆహూతులనిచ్చి లింగమూర్తిని దర్భ (కుశ)చేత సమ్మార్జన యొనర్చి, మధు ఘృతములతో అభిషేకము గావించి, పూజించి, పంచ గవ్యముచేత వేర్వేరుగా స్నానము జేయించి, మరల పూజించి, మట్టి (పుట్టమన్ను), గోమయము, గోమూత్రము, భస్మము-క్షీరము మొదలగు జల కలశములతో పునః స్నానము జేయించి, పూజించి, శంఖమును పూరించి (ఊది). మూర్తిని రథము - పల్లకి మొదలైన వాటిలో ఉంచి, మంటపమునక ప్రదక్షిణ యొనరింపజేసి, స్నాన మంటపమునకు గాని రావలయును అక్కడ శ్రీ గురువునకు కుడివైపున వేదికపై

మంత్రము :- "భద్రం కర్ణే..."

అను మంత్రమును పఠించుచు తూర్పు ముఖముగా గూర్చుండి, దేవుడిని భద్రాసనమున గూర్చుండబెట్టి మొదలు స్థాపించిన, ఆర కలశములను మొదలుకొని అంత్య కలశమువరకును కలశములందు బంగారమును వేసి, దేవుడి సామీప్యముందుంచి

మంత్రము :- "కాశికుశస్థలీ మా(ల్యో)యానంత్యయోధ్యామధోఃపురీ। శా(సా)లగ్రామం సగోకర్ణం నర్మదాచ సరస్వతీ। తీర్థాన్యేతాని కుంభే స్మిన్ విశంతు బ్రహ్మశాసనాత్। ఝుషారూఢా సరోజాక్షీ పద్మహస్తా శశిప్రభా। ఆగచ్ఛతుసరిజ్జేష్ఠా గంగా పాప ప్రణాశినీ। నీలోత్పల దలశ్యామా పద్మహస్తాంబుజేక్షణా। ఆయాతు యమునే దేవీ కూర్మ

యానస్థితౌస్సదా। ప్రాచీన సరస్వతీ పుణ్యాపయోష్ణీ గౌతమీ తథా। ఊర్మిళా చంద్రభాగాచ సరయూర్గండకీతథా। జంబూకాచశతద్రుశ్చక లింగా సుప్రభాతథా। వితస్తాచవిపాశాశ్చ శర్మదాచ పునః పునా। గోదావరీ మహావర్తా శర్కరా వర్తమార్జనీ। కావేరీ కౌశికీ చైవ - తృతీయాచ మహానదీ। విటంకా ప్రతికూలాచ సోమానందాచ విశ్రుతా। కరతోయా వేత్రవతీదేవికా వేణుకాచయా। ఆత్రేయ గంగా వైతరణీ కాశ్మీరీ హ్రాదినీచయా। ప్లావతీచ శవత్రాసా కల్మాషా శంఖినీ తథా। వశిష్ఠాచ అపాపాచ సింధువత్యారుణీ తథా। తామ్రా చైవత్రిసంధ్యాచ తథా మందాకినీపరా। తైలకాహ్వాచ పారాచ దుందుభీ నకుత తథా। నీలగంధాచ బోధాచ పూర్ణ చంద్రా శశిప్రభా। అమరేశం ప్రభాసంచ నైమిషం పుష్కరం తథా। ఆషాఢిం డిండి భారత్నం భారభూతం బలాకులం। హరిశ్చంద్రపరం గుహ్యం గుహ్యం మధ్యమకేశ్వరం। శ్రీ పర్వతం సమాఖ్యాతం జలేశ్వరమతః పరం। ఆమ్రాతకేశ్వరంచైవ మహాకాలం తథైవచ। కేదార ముత్త మంగుహ్యం మహాభైరవమేవచ। గయాంచైవ కురుక్షేత్రం గుహ్యం కనఖలం తథా। విమలం చంద్రహాసంచ మహేంద్రం భీమమష్టకం। వస్త్రాదం రుద్రకోటించ అవిముక్తం మహాలయం। గోకర్ణం భద్ర కర్ణంచ మహేశస్థానముత్తమం। భాగలాహ్వం ద్విరండంచ కర్కోటం మండలేశ్వరం। కాలంచరవనంచైవ దేవదారువనం తథా। శంకువర్ణం తద్వైవేహ స్థలేశ్వరమతఃపరం। ఏతాన్యద్యశ్చ తీర్థాని గుహ్యక్షేత్రాణి సర్వశః। తాని సర్వాణి కుంభేఽస్మిన్ విశంతు బ్రహ్మశాసనాత్ ॥"

(ఇతి మంత్రేణ తీర్థాన్యావాహయామి)

అని యుచ్చరించి తీర్థముల నావాహించి, పూజించి మంత్రపూత కలశస్థ జలముతో లింగమూర్తికి అభిషేకము జేయవలెను. యజమానుడు శిల్పిని యథాశక్తితో బూజించవలెను.

తరువాత ఆచార్యులు వెలుపలికివచ్చి ఆవాలు - నెయ్యి - పాయసము గల్పిన దానిని బలినొసఁగుతు "త్ర్యంబక" మంత్రముతో ప్రాగాది దిక్కులందు సమర్పించవలెను. ఆచమనమును వదలి దేవుడి (ఇలవేల్పు) వద్దకు వెళ్ళి "త్రాతారమింద్రాది దశలోక పాల" మంత్రములతో మంటపాంతర్గత దిక్కులలో రక్షకులుగా నియమించి, దేవుడి సమ్ముఖమునందు నలుగురు మహేశ్వరులను గూర్చుండబెట్టి, స్వస్తివాచనమును జేయించి, ఆచార్యుడు దేవుడికి అభిషేకము జేయవలయును. మహేశ్వరులకు దక్షిణ తాంబూలములను సమర్పించవలెను. "అగ్నిమూర్ధ్నా..." ఈ మంత్రమును పఠిస్తు మృదోదకముచేత "యజ్ఞాయజ్ఞావ..." ఈ మంత్రముతో కాషాయోదకముచేతను గాయత్రీ మంత్రముతో గోమూత్రోదకముతోడను "గంధద్వారాం..." ఈ మంత్రము నుచ్చరిస్తు గోమయోదకముతోను "మానస్తోక్తే తనయేమాన..." అను మంత్రముచేత భస్మోదకముతోడను

మంత్రము :- "తత్సవితు..."

అను మంత్రము నుచ్చరిస్తు గంధోదకముచేత అభిషేకించి పంచ కలశములకు "పంచదైవత్యై నమః" అని నమస్కరించి, "శంభవేనమః" అని మొదటి కలశమునుండియు

మంత్రము :- "హంగ్ంసఃశుషిషః"

అని రెండవ కలశము నుండియు,

మంత్రము :- "యాతే రుద్ర శివాతనూ"

అని మూడవ కలశము నుండియు

మంత్రము :- "విష్ణోర రాటమసీ"

అని నాలుగవ కలశము నుండియు

మంత్రము :- "బ్రహ్మజ జ్ఞానం"

అని అయిదవ కలశము నుండియు

మంత్రము :- "శతంజీవశరదోవర్ధమాన"

అని గరిక - అక్షత - పుష్పములతో పూజించి, వస్త్రముతో మూసి రెండవ వేదికపై "భద్రకర్ణేభిః" అని భద్రాసనమును బరచి

మంత్రము :- "స్తీర్ణం బర్హిరుపనోయాహివీతయ"

అని తూర్పుదిక్కున అగ్రములు (మొదళ్ళు) ఉండునట్లుగా దర్భలను బరచి, అక్కడ ప్రణవమును లిఖించి, మూర్తిని బెట్టి, తూర్పు ముఖముగా నిల్చుండి, కుంకుమను లేపించి (పూసి)న దారమును లింగ మూర్తికిఁజుట్టి, లింగనేత్ర స్థానములో "చిత్రం దేవానాం" అని బంగారు సలాకుతో గుర్తుంచవలెను. పైన - క్రింద - ప్రక్కలందు "ఆకృష్ణేన" అని గుర్తుంచవలెను. నేత్రస్థానమునందు యువ (కనురెప్ప) స్థానమునను గుర్తుంచవలెను. ఆ మీదట లింగమూర్తికి సువర్ణము - పాయసము - భక్ష్యములు - అన్నము దర్పణములను వెంటనే జూయించవలెను. తదుపరి మధూదకముచేత,

మంత్రము :- "ఇమంమె గంగె..."

అను మంత్రముతో నభిషేకించి, మరల వృదాది ౧౧ కలశములందలి జలముతో పూర్వోక్త మంత్రములతో అభిషేకింపవలెను. యజమానుడు సువర్ణశలాకను స్నాన వస్త్రాదులను శిల్పికి సమర్పించి, బంగారుతో గూడిన గోవును గురువునకు సమర్పించవలెను.

గురువు ఉత్తర వేదికయందు భద్రాసనమును బరచి, దేవుడిని స్థాపించి, పంచ దశాంతర్గత కలశములతో "సముద్ర జ్యేష్ఠా..." అను మంత్రముతో నభిషేకించి, పూజించి, గరిక, అక్షతలను ముఖంపైన జల్లి "నమస్తేర్చే సురేశాని ప్రకృతో విశ్వకర్మణః । ప్రభావితాశేషజగత్ ధాత్రి తుభ్యం నమోనమః । త్వయినం పూజయామీశం మహాదేవ మనామయం। రహితాశేష దోషైస్త్వం బుద్ధియుక్తా సదాభవే" అని ప్రార్థించి తదుపరి "సర్వసత్వమయం శాంతం, పరబ్రహ్మ సనాతనం । త్వామేవాలం కరిష్యామి త్వంవందేభవతే నమః" అని యుచ్చరించి, దేవుని కుడిచేతికి ఉన్నిదారమును ధరించవలెను. (లింగమూర్తికైనచో మంత్రమును మాత్రమే చెప్పవలెను) తరువాత లింగమూర్తికి పంచ దశాంతర్భూత నాలుగు శుద్ధ జల కలశములతో నభిషేకించవలెను. ఎట్లనగా

మంత్రము :- "ఇదమాపః"

అను మంత్రముతో మొదటి కలశముతోను

మంత్రము :- "ఆపోదేవిరితి"

అను మంత్రముతో రెండవ కలశమునుండి

మంత్రము :- "ఇమంమె గంగె"

అను మంత్రముతో మూడవ కలశముతో కనభిషేకించి

మంత్రము :- "తత్వాయామి..."

అను మంత్రముచేత పాలుగవ కలశముతో నభిషేకించి

మంత్రము :- "అగ్నిమూర్ధా"

అను మంత్రముతో అష్టపల మృత్తికా కలశముతోను

మంత్రము :- "సముద్రజ్యేష్ఠా"

అను మంత్రముతో శుద్ధోదకముతో నభిషేకించవలెను

మంత్రము :- "గంధద్వారం..."

అను మంత్రముతో సప్త ఫలమిత గోమయోదక కలశముచేత

మంత్రము :- "వరుణస్యోత్తం భనమసి..."

శుద్ధోదక కలశముతో నభిషేకించాలి. ద్వాదశపల గోమూత్రమును వేసిన కలశోదకముతో "తత్సవితు..." అను మంత్రముచేత శుద్ధ జలము నుండి అభిషేకించాలి. ఆపోహిష్ఠేతి ।

అను మంత్రము శుద్ధోదకముచేత నభిషేకించునది. తరువాత

మంత్రము :- "ప్రసద్యేతి..."

అను మంత్రముతో పిడికిలియంత భస్మ మిశ్రితము గావించిన కలశోదకముతో నభిషేకించి, "యోవశ్శివతమోరసః..." అను మంత్రముతో శుద్ధోదకము నుండి అభిషేకించవలెను. ఆమీదట త్రిఫల పరిమితమగు పంచగవ్య మిశ్రిత కలశోదకముచేత "పయః పృథివ్యా..." అను మంత్రముతో స్నానము జేయించి

మంత్రము :- దేవీరాపః సంమధుమతీర్మధుమతీభిః సృజ్యధ్వం"

అను మంత్రము నుచ్చరిస్తు అభిషేకించునది. "ఆప్యాయస్వ..." అను మంత్రమునుచ్చరిస్తు షోడష పల క్షీర మిశ్రిత కలశోదకముతో నభిషేకించవలెను. "తస్మా అరంగమావవ..." అను మంత్రము నుచ్చరించి శుద్దోదకముతో నభిషేకించవలెను. తరువాత "దధిక్రావ్ణో..." అను మంత్రముచేత వింశతి పల పరిమితదధి మిశ్రిత జలముతో స్నానము జేయించి, "యుంజానం..." అను మంత్రముచేత అభిషేకించవలెను. ఆ పిదప సప్త పల ఘృతమిశ్రితము కలశోదకముతో "ఘృతవతీ భువనా..." అను మంత్రమునుజెప్పి అభిషేకించవలెను. "దేవస్యత్వా..." అను మంత్రము చేత శుద్ధజలోదకమునుండి అభిషేకించునది. తదుపరి త్రిపల తేనెవేసిన కలశో దకముతో "మధువాతా ఋతాయతే..." అను మంత్రముతో నభిషేకించి, "ఆపోఽస్మాని..." అను మంత్రముతో శుద్ధోదకముచేత స్నానము జేయించి (అభిషేకించి), "ఆయం గౌరీ" మంత్రముతో త్రిపల శర్కర మిశ్రిత కలశోదకముతో నభిషేకించి, "ఆపోహయ బృహతీ" మంత్రముచేత శుద్ధో దకమునుండి మజ్జనము (స్నానము) జేయించి, ఆపైన "యజ్ఞాయజ్ఞావ" మంత్రముతో లింగమూర్తిని వస్త్రముతో తడివత్తి (తూడ్చి) సుగంధ తైలమును బూసి, "దృపదాదివే..." అను మంత్రము నుచ్చరిస్తు శనగ పిండితో రుద్ది (రాచి) "మానస్తోకేత..." మంత్రముచేత రెండు శుద్ధ జల కలశములతో నభిషేకించి, "ఆప్యాయసోమ మమృతా..." అను మంత్రము నుచ్చరిస్తు పంచామృతముతోడ నభిషేకించి, "గంధద్వారాం..." మంత్రముతో గంధోదకమునుండి, "హిరణ్యగర్భ" మంత్రముతో సువర్ణో దకముచేతను "ఇమంమే గంగే" అను మంత్రముతో తీర్థోదకమునుండియు అభిషేకించి, సుగంధముతోను వస్త్రమునుండి తడియొత్తి (తూడ్చి)

మంత్రము :- "ఏహ్యేహి భగవాన్ శంభో లోకానుగ్రహకామ్యయా ।
యజ్ఞభాగం గృహాణేమం సదాశివ నమోస్తుతే ॥

ఇట్లు ఇలవేల్పు నాహ్వానించి - పూజించి - పుష్పాంజలి నుచ్చరించి సమర్పించి, స్తోత్రముచెప్పి, (ప్రార్థించి), స్నానము - వస్త్రము - నైవేద్యాదులను వీటినన్నింటిని శిష్యకి సమర్పించవలెను.

తరువాత దేవుడిని రథములో గూర్చుండబెట్టి, ప్రాసాదమును (ఇంటికి) ప్రదక్షిణ యొనర్చి, పడమరద్వారమునుండి మంటపమును ప్రవేశింపజేసి, మండపము పడమరదిశలో తూర్పు ముఖముగా గూర్చుండి, మధుపర్కమును వదలి, వేదికపై దర్భలను వేసి (పరచి) దానిపై దేవుడి కొరకు ఆసనమును వైచి, "నమః శంభవాయ" అను మంత్రముచేత ఆసనముపై దేవతను ప్రతిష్ఠింపజేయవలెను.

## అనుబంధములు

### (విశేష విషయములు) ముద్రలు

పతాక ముద్ర :- కుడి చేతి వ్రేళ్ళను చక్కగా చాచి నిలుపవలెను. మూలబంధము మరియు ఉడ్యాణబంధములను గురుముఖమున దెల్పికొనవలెను.

కురంగముద్ర :- "మధ్యమానామికా సమ్య గంగుష్ఠాగ్రేనియోజయేత్ మృగీ (కురంగము) ముద్రేతి విఖ్యాతా"

శక్తిముద్ర :- కుడిచేయి సంపుటమును ఎడమచేయి సంపుటమున బోరలగానుంచుట, సృష్టి-స్థితి-లయ, ముద్రల విశేషములను గురు ముఖమున తెలియవలెను.

అంకుశముద్ర : శ్లో॥ ఋజ్వీచ మధ్యమాంకృత్వా-తర్జనే మధ్యపర్వణి।
సంయోజ్యా కుంచయేత్కించి న్ముద్రైషాంకుశ సంజ్ఞికా॥

చిన్ముద్ర : శ్లో॥ అంగుష్ఠతర్జనీ భ్యాంతు - సంయోగ స్తత్వ ముద్రికా।
జ్ఞానముద్రాపిసైవైషా స్యాదజ్ఞాన తమోపహా॥

శాంభవీముద్ర :- షట్స్థల ముద్రనే శాంభవీముద్రయందురు.

## మహామంత్రన్యాసము మరియు జపక్రమము

జపకాలమున పాటింపదగు పద్ధతులు :-

శ్లో॥ ఉష్ణీషీ కంచు కీనగ్నో - ముక్తకేశో మలావృతః।
అపవిత్ర కరోఽశుద్ధః - ప్రలపన్న జపేత్ క్వచిత్॥

క్రోధో మదః క్షుధా తంద్రా - నిష్ఠీవన విజృంభణే।
శ్వానీచ దర్శనం నిద్రా - ప్రలాపాస్తైజ పద్విషః॥

ప్రసార్య పాదౌవజపేత్ - కుక్కుటాసన యేవచ।
అనాసనః శయానోవా। రథ్యాయాం శూద్ర సన్నిధౌ॥

రక్త ధూమ్ర్యాంచ ఖట్వాయాం । నజపేజ్జా పకస్తథా ।
ఆసనస్థో జపేత్ సమ్యక్ - మంత్రార్థగత మానసః ॥

జ్యోతిష ప్రకరణం (529 స్వ-పు) (లింగ, పు, పూ, అ. ౧౬)

## శుభా శుభ వారములు

"ఉదయా దుదయం వారః"

"సూర్యోదయము మొదలుకొని మరల సూర్యోదయము వరకు మధ్యగతించిన కాలమునకు వారమని పేరు"

శ్లో॥ గురుశ్చంద్రో బుధశ్శుక్రః - శుభ వారా శ్శుభేస్మృతాః ।
క్రూరాస్తు క్ర్యూరకృత్యేషు - గ్రాహ్యాభౌమార్క సూర్యజాః ॥8॥

శ్లో॥ వార దోషాశ్చయే ప్రోక్తా - రాత్రౌన ప్రభవంతితే ।
శని భౌమార్క వారేషు - విశేషాదితికేచన ॥ (10)

తా॥ వీటిలో సోమ - బుధ - గురు - శుక్ర ఈ నాలుగు వారములు సాధారణముగా సమస్త శుభకార్యములకు శుభదాయకములు. మంగళ మరియు శనివారములు క్రూర కృత్యములకు (వేట, మల్లయుద్ధము, భేదము, యుద్ధము, శస్త్రాస్త్ర ప్రయోగములకు) ఉపయుక్తములు. దుష్టవార దోషములు రాత్రులందుండవు. శని, మంగళ, భాను వారములు క్రూరవారములైయున్నను, రాత్రులందు వీటివలన దోషము లుండనని కొందరియభిప్రాయమున్నది.

# శుభా శుభ నక్షత్రములు

శ్లో॥ మఘా, మృగశిరో హస్తః స్వాతీ మూలానురాధయోః ।
రోహిణీ రేవతీ చైవ - ఉత్తరాణాం త్రయంతథా ॥ (11)

ఆవాహేచ వివాహేచ - కన్యా సంవరణే తథా ॥
వాపయేత్సర్వబీజాని - గృహం గ్రామం ప్రవేశయేత్ ॥ (12)

పుష్యోఽశ్వినీ తథాచిత్రా - ధనిష్ఠా శ్రవణం వసుః ।
సర్వాణి శుభకార్యాణి - సిద్ధ్యంతేతె శుభేమచ ॥ (13)

తా॥ మఘా, మృగశిర, హస్త, స్వాతీ, మూల, అనూరాధా, రోహిణి, రేవతి, ఉత్తరా, ఉత్తరాషాఢ మరియు ఉత్తరాభాద్ర ఈ పదునొకండు నక్షత్రములు కావల్సిన శుభకార్యారంభములకు వివాహమునకు, కన్యను నిశ్చయించుటకు, సమస్త విత్తనములను నాటుటకు, కావల్సినవస్తువులను సంగ్రహించుటకు, గృహప్రవేశము మరియు గ్రామప్రవేశమునకు ప్రశస్తములు, అదే విధముగ అశ్వని, పుష్య, చిత్త, ధనిష్ఠ, శ్రవణ, పునర్వసు ఈ యారు నక్షత్రములు శుభకార్యములకు యోగ్యములైనవని చెప్పఁబడినది. ఐనప్పటికిన్ని ఈ నక్షత్రములందు వివాహమును మాత్రము జేయగూడదు, ఇవిగాగ మిగతా నక్షత్రములలో త్రిపూర్వ, జేష్ఠ, ఆర్ద్రా శతతార, ఇవి మధ్యమములు, భరణి, కృత్తిక, ఆశ్లేష. ఈ మూఁడు నక్షత్రములు అత్యుగ్రములైనవి, కనుక ఈ నక్షత్రములలో శుభ కార్యములనెప్పుడు చేయ గూడదు.

## అశుభ యోగములు

శ్లో॥ వైధృతి, వ్యతీ పాతాఖ్యా - సంపూర్ణౌ వర్జయేచ్ఛుభే ।
వజ్ర, విష్కంభయోశ్చైవ - ఘటికాత్రయ మాదికం ॥ (14)

పరిఘార్ధ, పంచశూలె - వ్యాఘాతే ఘటికానవ ।
గండాతి గండయోః షట్చహేయాః సర్వేషు కర్మసు ॥ (15)

తా॥ వైధృతి మరియు వ్యతిపాత, ఈ రెండు యోగములు కేవలము అశుభములు. కనుక వీటితో ఏ శుభకర్మములు చేయగూడదు. విష్కంభము, వజ్ర ఈ యోగముల ఆది యందు 3 ఘటికా కాలము మాత్రమే దోషము. పరిఘా నామ యోగములో పూర్వార్ధము ముగిసే వరకు అశుభము. శూల నామ యోగములో ఆది యందు 5 (ఐదు) ఘటికలు మాత్రము వ్యాఘాతమున 9 (తొమ్మిది) ఘటికలు, గండ-అతి గండ, యోగములలో ఆరారు (6-6) ఘటికలు, అశుభదాయకములు, మిగతకాలము శుభప్రదము, మిగత యోగములు నామానుగుణ్యముగ ఫల ప్రదములని దెలియవలెను.

## అశుభ కరణములు

చతుష్పాద-నాగవ-కింస్తుఘ్న, భద్రవా ఈ నాలుగు కరణములు అశుభములు.

జన్మ నక్షత్రములతో రాశి పరిజ్ఞానము

శ్లో॥ మేషో౽శ్వనీచ భరణీ - కృత్తికా ప్రథమందలం ।
త్రి కృత్తికా రోహిణీచ - మృగార్థం వృషభస్తథా ॥ (16)

మృగార్ధార్ద్రా పునర్వస్వ - త్రి పాద మిథునాభిధః ।
వస్వంత్య చరణం పుష్యో - హ్యాశ్లేషా కర్కాటాభిధః ॥ (17)

మఘా పూర్వోత్తరా పాదం - సింహ రాశిః ప్రకీర్తితః ।
ఉత్తరాత్రితయహస్త - శ్చిత్రార్థం కన్య కాస్మృతః ॥ (18)

చిత్రార్థం స్వాతి నక్షత్రం - విశాఖ త్రితయంతులా ।
4 విశాఖాంత్యాను రాధాచ - జేష్ఠాంతం వృశ్చికాభిధః ॥ (19)

మూల పూర్వోత్తరాషాడ - పాద మేకం ధనుఃస్మృతం ।
5 నక్రస్తు 6 షాఢా శ్రవణం - ధనిష్ఠార్థం తథైవచ ॥ (20)

కుంభో ధనిష్ఠ 7 తారచ పూభా పాదత్రయం యథా ।
పాదం 8 పూభా 9 ఉభారేవత్యంతతం మీనః ప్రకీర్తితః ॥ (21)

1. మొదటి చరణము 2. కృత్తికా నక్షత్రము యొక్క చివరి మూడు చరణములు 3. వసుః, అనగా పునర్వసు 4. విశాఖా నక్షత్రము యొక్క చివరి చరణము 5. మకర 6. త్రి + ఉ, షాఢా అనగా ఉత్తరాషాఢ నక్షత్రము యొక్క మూడు చరణములు 7. శత తారకా 8. పూర్వా భాద్రపదా 9. ఉత్తరా భాద్రపద.

పై శ్లోకములకు సరియైన కోష్టకము.

| నక్షత్రము | | నక్షత్రము | | నక్షత్రము | | రాశి |
|---|---|---|---|---|---|---|
| అశ్విని | పూర్తి | భరణి | పూర్తి | కృత్తికా | ౧/౪ | మేషము |
| కృత్తికా | ౩/౪ | రోహిణి | ,, | మృగశిర | ౧/౨ | వృషభము |
| మృగశిర | ౧/౨ | ఆర్ద్ర | ,, | పునర్వసు | ౩/౪ | మిథునము |
| పునర్వసు | ౧/౪ | పుష్య | ,, | ఆశ్లేష | పూర్తి | కర్కాటకము |
| మఘా | పూర్తి | పుబ్బ | ,, | ఉత్తర | ౧/౪ | సింహ |
| ఉత్తర | ౩/౪ | హస్త | ,, | చిత్త | ౧/౨ | కన్య |
| చిత్త | ౧/౨ | స్వాతి | ,, | విశాఖ | ౩/౪ | తుల |
| విశాఖ | ౧/౪ | అనూరాధా | ,, | జేష్ట | పూర్తి | వృశ్చిక |
| మూల | పూర్తి | పూర్వాషాఢ | ,, | ఉత్తరాషాఢ | ౧/౪ | ధనుస్సు |
| ఉత్తరాషాఢ | ౩/౪ | శ్రవణ | ,, | ధనిష్ఠ | ౧/౨ | మకర |
| ధనిష్ఠ | ౧/౨ | శతతార | ,, | పూర్వభాద్రపద | ౩/౪ | కుంభ |
| పూ.భాద్రపద | ౧/౪ | ఉ.భాద్రపద | ,, | రేవతి | పూర్తి | మీన |

# వీరశైవుల గోత్ర సూత్రములు

1. శ్రీ రేవణారాధ్యులవారు :- శ్రీ శివుని సద్యోజాత ముఖము కొలనుపాక శ్రీ సోమేశ్వరలింగము నుండి జననము. బాళేహళ్ళి (రంభాపురి) సింహాసనము, వీరగోత్రము, పడ్వడి సూత్రము (బగి) ఏకాక్షర శివాచార్య ప్రవర, అతివర్ణము, రేణుకశాఖ, ఋగ్వేదగానము, పృథ్వీ తత్వము, ఆదిశక్తి, ఆచారలింగము, దక్షిణావర్త ముద్ర, శివపంచాక్షరీ జపము, పూర్వదిక్కులో హరిద్వర్ణ ధాతువు యొక్క కలశము, హరిద్వర్ణవస్త్రము. "గురు ధర్మభిక్షా వాక్యము" అశ్వత్థ దండము, నకారప్రణవము,

ఈ పాడ్వడి మహాసూత్రము యొక్క ఉపసూత్రములు ౧౨ పురాణ, పచ్చకంథె, షడింగి, సురగి, మహిషి, దిగంబర వేణీభిత్తి, మోరటి, నటున, శౌరి, మసడి, ఇత్యాది.

2. శ్రీ మరుళారాధ్యులవారు :- వామదేవ ముఖము, వటక్షేత్రము, సిద్దేశ్వర లింగమునందు జననము, ఉజ్జయిని సింహాసనము, నందిగోత్రము, వృష్టిగోత్రము, (మరేభగి) ద్వ్యక్షరశివాచార్య ప్రవరం, అతివర్ణము, దారుకశాఖ యజుర్వేద గానము, అప్పు తత్త్వము, ఇచ్ఛాశక్తి, గురు లింగము, వామవర్త ముద్ర, హంస మంత్ర జపము, దక్షిణ దిక్కునందు తామ్ర కలశము, ఎఱ్ఱని వస్త్రము, సోముగ దండము. "భవతి భిక్షా వాక్యము" మకార ప్రణవము.

ఈ వృష్టి మహాసూత్రముయొక్క ఉపసూత్రములు ౧౨ కార్పాస కంథె, స్వర్ణకంథె, శృంగి, మసణి, కుఠారము, ఛైత్రి కఠారము, చామరి, కపాట, కుక్షకంథె, జ్వాలత్కంథె, సింహ ఇత్యాది.

3. శ్రీ ఏకోరామారాధ్యులవారు :- అఘోర ముఖము, ద్రాక్షారామ క్షేత్రమురామనాథ లింగము నందుద్భవము, హిమవత్కేదార సింహాసనము, భృంగిగోత్రము, లంబన సూత్రము, (ఉద్ధానభగి) త్ర్యక్షరశివాచార్య ప్రవరము, అతివర్ణము, ఘంటా కర్ణశాఖ, సామవేదము, అగ్ని తత్వము, జ్ఞానశక్తి, చరలింగము, శ్రీకార ముద్ర, పంచాక్షరీజపము, పశ్చిమ దిశ యందలి లోహ కలశము, నీలివస్త్రము, వేత్రదండము, లింగార్పిత భిక్షా వాక్య శి' కార ప్రణవము.

ఈ లంబక మహాసూత్రము యొక్క ఉపసూత్రములు ౧౨ త్రిపుటి రజ్జుకంథే, భస్మి, సిఖరి, శావ్యక, చంద్ర గుండము, మృత్కంథే, కాష్మక, పవన, రామగిరి, గిరీశ, ఖడ్గి ఇత్యాది.

4. శ్రీ పండితారాధ్యులవారు :- తత్పురుష ముఖము సుధాకుండ క్షేత్రము, మల్లికార్జున లింగమురో జననము. శ్రీశైల పర్వత సింహాసనము, వృషభ గోత్రము, ముక్తాగుచ్ఛ సూత్రము, (ముత్యపు పెండి, భగి) చతురక్షర శివాచార్య ప్రవరము, అతివర్ణము, గోకర్ణశాఖా, అథర్వణ వేదగానము, వాయు తత్వము, క్రియాశక్తి, శివలింగము, ఆవర్తన ముద్ర, శివగాయత్రీ జపము, ఉత్తర దిక్కులోని కంచుకలశము, తెల్లని వస్త్రము, మఱ్ఱి(వట) దండము. "దయాధర్మ భిక్షా వాక్యము" వకార ప్రణవము.

ఈ ముక్తా గుచ్ఛ మహాసూత్రము యొక్క ఉప సూత్రములు. ౧౨ గోణికంథే, దంతి, జఠర, అగ్ని, కేశకంథే, లలాట, వ్యాఘ్ర కంథె, లోచనభగి, జాలంధకంథె, నట బోదడి ఇత్యాది.

5. శ్రీ విశ్వారాధ్యులవారు :- ఈశాన ముఖము, కాశి క్షేత్రము, విశ్వేశ్వర లింగము నందు జననము, కాశి సింహాసనము, స్కంధ

గోత్రము, పంచవర్ణము సూత్రము (బగి) పంచాక్షర శివాచార్యప్రవరము, అతివర్ణము, విశ్వకర్ణశాఖ, అజప వేదగానము, ఆకాశ తత్వము, పరాశక్తి, ప్రసాదలింగము, కుండలాకార ముద్రా, మూల పంచాక్షరీ జపము, మధ్య నుండు బంగారు కలశము, పసుపువస్త్రము, బిల్వ దండము "కేవల మాత్రకమైన భిక్షా వాక్యము" "య"కార ప్రణవము.

ఈ పంచవర్ణమునకు మహాసూత్రము యొక్క ఉపసూత్రములు ౧౨ క్షోభాంశము, వృషభము, దశాస్యము, జర్ఝురకంఠ, పంచవక్త్రము, గుహాగ్రకము, గోచరము, గగనము, ముసలము, లగుడి, శిథిలము, పశుపతి. ఇత్యాది.

వి. సూ. :- ప్రతియొక్క వీరశైవుడు జన్మ గురువునకు ఏ గోత్ర సూత్రములుండునో అవే వారికి గూడ ఉండునని దెలియవలెను.



# ముక్తి పంచకం

శ్లో॥ ఆచార్యః పరిసేవ్యతాం, శివకరం లింగం సదాధార్యతాం
నిత్యం జంగమ మీడ్యతాం, పరతరం పాదోదకం పీయతాం ।
శుద్ధాన్నం పరిగృహ్యతాం - భవహరం భస్మానుసం లిప్యతాం
పంచాచార్య పదాంబు జేషు - సతతం చేతస్స మాధీయతాం ॥౧॥

రుద్రాక్షః పరిధార్యతాం - ప్రియకరీ పంచాక్షరీ జప్యతాం
పంచాచార చయోఽర్జ్యతాం - పశుపతిః పంచాననః పూజ్యతాం ।
పంచ క్లేశగణోఽర్ద్యతాం - భ్రమకరః పంచాయుధో భ్రస్యతాం
పంచా చార్య పదాంబు జేషుసతతం - చేత స్సమాధీయతాం ॥౨॥

ధర్మే దుర్మతి రుజ్జ్యతాం శృతిమతం - కర్మస్వనుష్ఠీయతాం
శర్మత్వం పరిధార్యతాం - దృఢతరం - ప్రాక్కర్మ సంహార్యతాం ।
శాంతింసంతత మీప్స్యతాం - గురుకులే భక్తిః సమాశ్రీయతాం
పంచాచార్య పదాంబు జేషు సతతం - చేతః స్సమాధీయతాం ॥౩॥

వేదార్థో హివిచార్యతాం - గురుకృతం సూత్రం సమాలోచ్యతాం
తద్భాష్యం సుసమీక్ష్యతాం - గురు ముఖాచ్ఛ్రైవాగమః శ్రూయతాం ।
దుస్తర్కః పరిభూయతాం - శివమయం. జ్ఞానంచ సంపాద్యతాం
పంచాచార్య పదాంబు జేషు - సతతం చేతస్సమాధీయతాం ॥౪॥

మోహం బ్రహ్మణి బధ్యతాం - తదపరే బాఢం సముత్సృజ్యతాం
సర్వ శైవమి తీర్యతాం - పరశివ ద్వైతె మతి ర్యుజ్యతాం ।
కైవల్యం పరిమృగ్యతాం - పరశివ బ్రహ్మేత్యహం భావ్యతాం
పంచాచార్య పదాంబు జేషు సతతం - చేత స్సమాధీయతాం ॥౫॥

శ్రీ కాశినాథ కవిప్రోక్తం - పంచకం భక్త కంచుకం ।
యఃపఠేత్పరయా భక్త్యా - సయాతి పరమంపదం ॥

# పాదోదక మహాత్మ్యము

శ్లో॥ ప్రక్షాళ్యతోయై శివ మంత్ర పూత -
స్సంపూజ్య పాదౌచర లింగమూర్తేః ।
గంధాక్షతాభిర్వి విధోపచారైః -
పాదోదకం పుణ్యమహంపిబావిత్ ॥౧॥

గంగాది తీర్ధాని సముచ్ఛయాని -
ఆశ్రిత్య పాదౌచర లింగమూర్తేః ।
తిష్ఠంతి తస్మాదఘ పంక హారి -
పాదోదకం పుణ్యమహంపిబామి ॥౨॥

పాపాద్రి వజ్రం పరమం పవిత్రం -
దారిద్ర్యపీడా భవదావదాహం ।
దుఃఖాబ్ధిపోతం దురితాలవిత్రం -
పాదోదకం పుణ్యమహంపిబామి ॥౩॥

ఆద్యంత శూన్యశ్చ పరాత్పరశ్చ -
సంసార మాయా మలవర్జితస్య ।
ఈశావతారం శృతి జంగమశ్చ -
పాదోదకం పుణ్యమహంపిబామి ॥౪॥

నందీశ ముఖ్య ప్రమథైః ప్రసేవ్యం -
శ్రీ వీరభద్ర ప్రముఖైశ్చ ముద్రైః ।
ఆది ప్రసీదం శృతి బోధి తవ్యం -
పాదోదకం పుణ్యమహంపిబామి ॥౫॥

కుష్టఘ్న మేత ద్విషమ జ్వరఘ్నం -
యాక్ష్మాదినానారుజ సంగఘాతం ।
విస్ఫోటకఘ్నం భగం దరఘ్నం -
పాదోదకం పుణ్యమహంపిబామి ॥౬॥

యద్బ్రహ్మ హత్యా శిశు గోష్ఠ హత్యా -
ద్యనేక జన్మార్జిత పాపరాశి ।
హేమాద్రితుల్యం చదహంతి సద్యః -
పాదోదకం పుణ్యమ హంపిబామి ॥౭॥

పాదాంబు మహాత్మ్య మిదం ప్రణీతం -
శ్రీశాంత మల్లేశ్వర దేవనామ్నా ।
శ్రీ వీరశైవా మృత వార్ధి లగ్నం -
శివై కనిష్ఠం వ్రతమేూతు చిత్తం ॥౮॥

మంగళము

మంగలమయ మహాలింగోద్భ వరిగే - మంగల వెన్నిరి సొంగదలి ।
అంగజభంగ శివాంగ సంగ గురులింగ - జంగమాచార్యరిగే ॥పల్లి॥

క్షోణియొళురుతర లీలావి సరది - క్షోణియ పావనగైదవరిగే ।
అణుతృణ కాష్ఠ దొళనుదిన నెలెసిహ - గణకుల నాయక రేణుకగె ॥౧॥

భూరి మహిమ భవ దూరనిగమ సువి - చారకలుష సంహారకగే ।
వీరశైవ సయాంబుధి శశిధర - పారకరుణి గురు దారుకగే ॥౨॥

లోకదొళుత్తమ ఖ్యాతియ ధరిసుత - కాకుమతంగళ జయసిదనె ।
నాకభవర్చిత నాకగమనయుత - శోకహరై కోరామనిగే ॥౩॥

చండ మతంగళ ఖండిసి బ్రహ్మ - ఖండతత్త్వవ బోధిసగే ।
ఖండ పరశువిన తుండజనితచిద - ఖండ పండితారాధ్యరిగే ॥౪॥

ఈశ్వర భక్తియ శాశ్వత గొళసుత - విశ్వకె గురువాగిర్పనిగే ।
విశ్వనాథనొళగుద్భ విసిద మహా - విశ్రుత విశ్వారాధ్యనిగే ॥౫॥

## జ య మ ం గ ళ ం

జయమంగళం నిత్య శుభమంగళం। జయజయతు [illegible]మహాంత [illegible] ।
ధరేయభక్తరు మహేశ్వరుగళ పుత్రనిగే। శరణబసవాది ప్రమథ[illegible]
పరశివనపార్వతియ తొడెయ మేలాడుతల। [illegible]రుషాడ్డి [illegible]
గురు పుత్రనే ౧

ఆకాశవను మోడ ముసుకిదరు కెడదంతే। ఏకాగ్రచిత్త[illegible] [illegible]
బెకుబేడెంబెరడు భవ బీజగళహారిదు। లోక[illegible] [illegible]
[illegible] ౨

హ్యాగే మాళ్పరు హాగే సకల ఉపచారగళు [illegible]
బంగారు కబ్బునవహిరి కిరిదు సమ[illegible] [illegible] మహా[illegible] [illegible] -
[illegible]త్రనే ౩

సత్యం పుష్పం క్షమాపుష్పం - వస్తుషూచ్చావ చేష్వపి |
అవవ్య పీడనం పుష్పం - పరోపకృతి ముత్తమం |
స్వమతే విమతై మూఢే - పఘారోవుప కర్తరి |
సర్వత్ర భావయే దేకం - వీరశైవ మతె శివే |
యఃపూజయేన్స్వామీశానం - పుష్పైరేతై రతంద్రితః ||

(పార.ప.౧౦-౬౦-౬౭)

## శివ పంచాక్షరీ స్తోత్రము

నాగేంద్రహారాయ - విలోచనాయ - భస్మాంగరాయ మహేశ్వరాయ |
నిత్యాయ శుద్ధాయ దిగంబరాయ - తస్మై "న" కారాయ నమః శివాయ ||౧||

మందాకినీసలిల చందనచర్చితాయ - నందికేశ్వర ప్రమథనాథ మహేశ్వరాయ|
మందార ముఖ్యబహుపుష్పసుపూజితాయ - తస్మై "మ" కారాయ నమః శివాయ ||౨||

శివాయ గౌరీ వదనాబ్జబృంద - సూర్యాయ దక్షా ధ్వరనాశకాయ |
శ్రీనీలకంఠాయ వృషధ్వజాయ - తస్మై "శి" కారాయ నమః శివాయ||౩||

వశిష్ఠ కుంభోద్భవ గౌతమార్య - మునీంద్ర దేవార్చితశేఖరాయ |
చంద్రార్క వైశ్వానరలోచనాయ - తస్మై "వ" కారాయ నమః శివాయ ||౪||

యక్షస్వరూపాయ జటాధరాయ - పినాకహస్తాయ సనాతనాయ |
దివ్యాయదేవాయ దిగంబరాయ - "తస్మై" యకారాయ నమః శివాయ ||౫||

# శివ మానస పూజా స్తోత్రము

రత్నైఃకల్పిత మానసం హిమజలైః స్నానంచ దివ్యాంబరం
నానారత్న విభూషితం మృగమదామోదాంకితం చందనం ।
జాతీచంపక బిల్వపత్రరచితం పుష్పంచ ధూపం తథా
దీపందేవ దయానిధే పశుపతే హృత్కల్పితం గృహ్యతాం ॥౧॥

సౌవర్ణే నవరత్నఖంచరచితే పాత్రే ఘృతం పాయసం
భక్ష్యం పంచవిధం పయోదధియుతంరంభా ఫలం పానకం ।
శాకానామయుతం జలం రుచికరం కర్పూర ఖండోజ్జ్వలం
తాంబూలం మనసామయా విరచితం భక్త్యాప్రభో స్వీకురు ॥౨॥

ఛత్రం చామరయోర్యుగం వ్యజనకంచాదర్శకం నిర్మలం
వీణా భేరిమృదంగకాహలకలా గీతంచ నృత్యం తథా ।
సాష్టాంగ ప్రణతిర్బహువిధా హ్యేతత్సమస్తం మయా
సంకల్పేన సమర్పితం తవవిభో పూజాం గృహాణ ప్రభో ॥3॥

ఆత్మాత్వం గిరిజామతిః సహచరాః ప్రాణాశ్శరీరం గృహం
పూజాతెవిషయోపభోగరచనా నిద్రాసమాధి స్థితిః ।
సంచారః పదయో ప్రదక్షిణ విధిఃస్తోత్రాణి సర్వాగిరో
యద్యత్కర్మ కరోమి తత్తదఖిలం శంభో తవారాధనం ॥౪॥

కరచరణ కృతం వాక్కాయజం కర్మజంవా
శ్రవణ నయజంవామానసంవాఽపరాధం ।
విహితమవిహితంవా సర్వమేతత్ క్షమేథాః
శివశివ కరుకరుణాబ్దే శ్రీ మహాదేవ శంభో ॥౫॥

(ఇతి శ్రీ శంకరాచార్యకృతం శివమానసపూజా స్తోత్రం సమాప్తం)

## గురుశంకరేశ్వరా

పరపురుషార్థమం పరహితార్థమనర్గళ పారమార్థమం
నిరుపమ లింగనిష్ఠెయమహా గణతుష్టియనీశగోష్ఠియం
సురుచిర సత్యశాంతి దమెయం క్షమెయన్నభయ ప్రసాదమం
కరుణిసుదేవమూజగదజీవరిగుం గురుశంకరేశ్వరా (శ్రీశంకరదేవరు)

## శ్రీ శైలజావల్లభా

శ్రీమత్పూర్ణ సుఖాబ్ధి నిత్య నిరుపాధి జ్యోతి విఖ్యాత
మాయా మోహామయ దూరపార నిగమాంతాభేద్య సద్రూపని ।
ద్యోమాకారయమీంద్ర మానస ముల్లాసాస్పదా వాసని ।
ష్కామప్రేమ మహేశరక్షిసాలవింశ్రీశైలజావల్లభా ॥౧॥

శివనిన్నంఘ్రియనావ వొర్మెనెనెవం సద్భక్తియిందా తనం
దివిజర్కాళ్ నెనెవర్ త్వదంఘ్రిగెరపంతానావనాతంగెయో ।
గివరవర్తా వెరవర్ భవన్నుతియ నావం మాళ్పనాధన్యనం
సవివాతింనుతిగైవుదాగమచయం శ్రీ శైలజా వల్లభా ॥౨॥

కరదోళ్ళత్తు నిజేష్టలింగదెమనం పంచాక్షరం వక్త్రదోళ్
కొరళోళ్ళత్తు శివాక్షమాలె భసితాలేపం లలాటాగ్రదోళ్ ।
గురుపాదాంబుజసెవెకాయదొళ్ కొడంబట్టిర్పభక్తం
గదార్పరినీనాతన ఫనసల్తె సతతం శ్రీ శైలజావల్లభా ॥౩॥

(శ్రీ షడక్షరదేవరు)

శ్లో॥ వాగాతీతం మనోతీతం - భావాతీతం నిరంజనం ।
సర్వం శూన్యం నిరాకారం - నిత్యత్వం పరమం పదం ॥

(1424, చన్నబసవ వచనము)

శ్లో॥ లింగంతు త్రివిధం ప్రోక్తం - స్థూలం సూక్ష్మం పరాత్పరం ।
ఇష్టలింగమిదం స్థూలం - యద్దేహె ధార్యతేత్యసౌ ॥ (పి, శి)

శ్లో॥ త్రికాలమర్చయెల్లింగ - మేకకాలేతు భావయేత్ ॥

తా॥ లింగమును త్రికాలములందు బూజించాలి, లేదా ఉదయం ఒక పూటనైన తప్పకుండ పూజించాలి.

శ్లో॥ అరుణోదయవెలాయాం - యఃకరోతి శివపూజనం ।
ఋణత్రయ వినిర్ముక్త - స్తస్యాంతే బ్రహ్మతత్పదం ॥

తా॥ సూర్యోదయ కాలమునందు శివలింగాన్ని బూజించినచో ఏడు జన్మల పాపము నశించును. శివసాయుజ్య పదవిని బడయుదురని శివరహస్యము బోధించుచున్నది.

శ్లో॥ పూజయా భక్తిమాప్నోతి - పూజయా ముక్తిమాప్నుయాత్ ।
పూజయా సదృశం పుణ్యం - నాస్తిలోకత్రయెష్వపి ॥ (లిం, పు)

# జగద్గురు శ్రీ రేణుకాచార్య స్తోత్రము

శ్లో॥ నమోనమస్తె శివభక్త పక్ష - నమోనమస్తె సుజనాళి రక్ష
నమోనమస్తె పరవాది రూక్ష - నమోనమస్తె విజితాఖిలాక్ష ॥౧॥

నమో నమో మోక్ష విచార దక్ష - నమో నమో వేదవిధాన శిక్ష।
నమో నమః పాపకృతాం విపక్ష - నమో నమో రేవణ కల్పవృక్ష ॥౨॥

భద్రాంకురాయ భజతామభయంకరాయ
మోహాంధకారాయ రవయే కవయే మనూనాం।
కైవల్య కల్పతరవే గురవే గురూణాం
శ్రీ రేణుకాయ గణపాయ నమోఽస్తు తుభ్యం ॥3॥

నసేవేరమేశం నసేవే ప్రజేశం - నసేవే సురేశం నసేవే గణేశం।
మహేశం ప్రభావం మహాచార్య దేవం -
అహోబద్ధదేహం భవంతం భజేహం ॥౪॥

సంసారమయ సద్వైద్య - జ్ఞానసాగర వర్ధన -
సర్వజ్ఞ సకలాధార, సర్వాభీష్ట ఫల ప్రద।
కేన చిత్కారణే నాహం శివవాక్యాను సారతః -
గురోస్త్వదంతికం ప్రాప్తః ప్రసీదకరుణానిధే ॥౫॥

ఇతి శ్రీ శంకరాచార్య కృతం శ్రీ భగవత్పాద రేణుకాచార్య స్తోత్రం
సంపూర్ణము



వీరశైవ ధర్మ సంస్థాపకులైన
జగద్గురు శ్రీ రేణుకాచార్యులవారు శ్రీ ఆదిశంకరాచార్యులకు
చంద్రమౌళీశ్వర లింగమును అనుగ్రహించుట.

# అంత్యేష్టి విధి

లింగాంగ సంబంధముండిన మాహేశ్వరుడుగాని, అథవా శివ శరణుఁడుగాని, తనయొక్క అంతిమ సమయములో భక్త మాహేశ్వరులను రప్పించుకొని తానుగాని, లేదా తన కర్తృవైన (ఆచార్యుడుగాని అథవా శిష్యుఁడు - కుమారుడు, అన్నదమ్ములు, భక్తుడు, బంధువు, స్నేహితుడు, శివజ్ఞానిగాని) ఎవరైనను ఒకరు స్నానము శుద్ధాచమనము నాచరించి, మడిదుస్తులను ధరించి, విభూతి రుద్రాక్షలను దాల్చి వచ్చియుండిన భక్త మాహేశ్వరుల సమ్ముఖములో, విభూతి వీళ్యము (తమ్మలపాకు)లనుంచి నమస్కరించి వారి యాజ్ఞనుబొంది, ఆ మాహేశ్వరుడు శివైక్యమగు కాలమును గుర్తించి, జంగమ పాద పూజ యొనర్చి, తీర్థప్రసాదముల నొసఁగి, పూజించినట్టి జంగమ[1] శ్రేష్ఠుని పాదము యొక్క కొలతను దీసికొనియుంచి, భూమిపైషట్ సమ్మార్జనముతో పరిశుద్ధపరచి, రంగవల్ల్యాది ముగ్గులతో నలంకరింపఁజేసి, భస్మపు ఆసనమును గల్పించి, దానిపై ఆ లింగ శరీరమును గూర్చుండబెట్టి, భవిజనులు జూడకుండఁజేసి లింగైక్యమగు నాతని శరీరమునందు భస్మ రుద్రాక్షలను ధరించి కుడి ప్రక్కన చెవిలో ప్రణవ సహితమగు పంచాక్షరీ మంత్రమును ముప్పదియారు (36) మారులు జపించవలెను.

మరియు భక్త మాహేశ్వరులతో గూడుకొని, శ్రీ రుద్రము శ్వేతాశ్వతరము, అథర్వశిరము, అథర్వశిఖా కైవల్యములనుపంచ రుద్రములను ఉన్నత స్వరముతో (గట్టిగా) జెప్పవలెను.

---

[1] ఈ పాదము యొక్క కొలతను సమాధిని సిద్ధగించునప్పుడుగాని, మరియు విమానమును సిద్ధగించునప్పుడుగాని, దీనినుపయోగించవలెను.

ఆపైన లింగమునందైక్యమైన సంగతిని దెలిసికొని స్నానమును జేయించుటకై సంకల్పము నుచ్చరించవలెను. ఎట్లనగా దేశకాలాదులను బేర్కొని.

మంత్రము :- "అస్యాం శుభతిథౌ లింగస్య పితుర్గోత్రస్య[1] (అముక) శర్మణః లింగ పురస్సరం లింగరూప శరీరం, సహస్రశీర్షాః, నమస్తే రుద్రమన్యవ పంచబ్రహ్మ మంత్రైస్సహస్నాపయిష్యే"

అని సంకల్పమును జెప్పి.

మంత్రము :- "ఓం సహస్రశీర్షా...వృణీమహే" "ఓం నమస్తే రుద్ర మన్యవ...ఓం జంభే దధామి" "ఓం సద్యోజాతం ప్రపద్యామి...బ్రహ్మ శివోమే అస్తు"

అను మంత్రములతో ఆలింగపూర్వకమగు లింగస్వరూపంబైన శరీరమునకు స్నానమును జేయించి, తెల్లని వస్త్రములను ధరింపజేసి శరీరమునకు భస్మమును లేపించి (పూసి) జలమిశ్రితమగు భస్మముతో ఉక్త స్థానములందు త్రిపుండ్ర ధారణమొనర్చి, రుద్రాక్షలతో నలంకరింపజేసి, శుద్ధమగు స్థలములో గాయత్రీ మంత్రముచేత జలమును బ్రోక్షించి గోడకు సమీపమున భస్మమును బరచి యా శుభాసనములో నా లింగ శరీరమును గూర్చుండబెట్టి గంధాద్యుపచారములతో సర్వపూజా ప్రకరణములో జెప్పిన విధముగా, పూజించవలెను.

అలా పూజ యొనర్చిన పిదప

---

1 శివైక్యమైనవారు స్త్రీలైనచో "లింగస్య మాతుర్గోత్రాయాఃదేవ్యాః" అని చెప్పవలెను.

మంగలహారతి గీతము :-

జయమంగళం నిత్య శుభమంగళం । జయ జయతు శివలింగ వరమూర్తిగె ॥పల్ల॥ నరజన్మదలిపుట్టి గురుదీక్షెయంపడెదు । హారిదు భవబళ్ళియనుకిత్తొడ్యాడుతె ॥ శరణగణ సాక్షిముంతాగి మంత్రదరువిందే హరలోకక్కైది పరమనొళుబెరెదగె ॥౧॥

హిందె హారిదు ముందే మురిదునడువిరువ గొందణవ, కడిదుళిదుసత్క్రియగళా । అందవనుతిళిదు శివ శివయెనుత మందరా గిరిగైది కందుగొరళనొళ్ బెరెదగె ॥౨॥

అనుభవదహాదియంతిళిదు మహాఘనవాద అనుభవద రచనెయంచరిసుత్తలి । మనవు బొమ్మదినిందు సత్యదిం తను సహ శివలింగమూర్తియాదవరిగె ॥౩॥ ॥ జయ మంగళం నిత్య శుభ మంగళం ॥

మంగళ నీరాజనమిచ్చి పుష్పాంజలి యొనర్చవలెను. విచ్చేసియున్న భక్త మాహేశ్వరులు విమానము మరియు సమాధి సిద్ధమగువరకు, శివశాస్త్రము- శివకథాశ్రవణము. అథవా భజన (సంకీర్తనము) జేయుచు కాలక్షేపమును జేయవలెను.

విమాన రచనా క్రమము :-

5 పాదముల కొలత మేరకు చౌకము. మూలలకు నాలుగు నాలుగు చొప్పన నాలుగు మూలలు గల్పి 16 కలశములు, వాటిపై నాలుగు పాదము, మూలకు మూడు చొప్పన 12వ కలశములు, దానిపై 3 పాదము, నాలుగు మూలలకు గల్పి పది (10) కలశము, దానిపై

3 పాదము నాలుగు మూలలు గల్పి 6 కలశము, దానిపై 2 పాదము రెండు కలశము దానిపై నొక్క పాదము దానిపై నొక పెద్ద కలశము, ఈ విధముగా విమానమును నిర్మించాలి. ఇట్లు సాధ్యపడనిచో నాల్గు స్తంభాలు, తోరణము, చిత్రపటాదులతో నలంకరించిన విమానమును సిద్ధ పరచవలెను.

## సమాధి క్రమము

దేవస్థానము స్థలములోగాని, లేదా మఠముయొక్క స్థలములోగాని, శివ సంబంధితమైన తోటల సమీపములోగాని, శివ సంబంధితమైన తీర్థ క్షేత్రముల సమీపమందుగాని, నదీతీరమున, పుష్ప వాటికలోగాని, వీటిలో నొకదానిని శుభ స్థలముగా నిర్ణయించి, అట్టి స్థలమును గోమయముతో సమ్మార్జనంబొనర్చి (అలికి)

"ఓం హ్రాం పృథివ్యై నమః" అను మంత్రముచేత గంధ, అక్షత, పుష్పాదులతో భూమిని పూజించి,

5 అడుగులుచుట్టు చౌకము, (చతురస్రాకారము)

9 అడుగుల లోతు (ఇట్లు ప్రమాణము మేరకు తప్పకుండ త్రవ్వి) సోపానములను ఉత్తరదిశలో పొడవు-వెడల్పు-ఎత్తు, ఒక అడుగు మాత్రము ఒక సోపానమును, పొడుగు, వెడల్పు, ఎత్తు రెండడుగులు 2వ సోపానము, పొడుగు, వెడల్పు, ఎత్తు మూడడుగుల 3వ సోపానములను సిద్ధగించవలెను.

సమాధి మధ్యన మూడడుగులంత వెడల్పు, మూడడుగులంత పొడుగు, ఒక అడుగు ఎత్తు వేదికను నిర్మించి, ఈ వేదికకు దక్షిణమున-

తూర్పున - పడమరలకు రెండడుగులు వదలి, పొడుగు - వెడల్పు ఎత్తు 3 అడుగులంత పరిమాణము త్రికోణమువలె గూడును త్రవ్వి

సమాధిని త్రవ్వే మంత్రము :-

మంత్రము :- "మావోరిషత్ఖనితా యస్మై చాహంఖనామివః ।
ద్విపచ్చతుష్పదస్మాకగ్ం సర్వమస్త్వనాతురం ॥

అను మంత్రముతో సమాధిని త్రవ్వాలి

ఆ మీదట సమాధి సిద్ధము కాగానె అందు గోమయముతో అలికి (సమార్జనము జేసి) సున్నము - ఎఱ్ఱమట్టితో బూసి, అరటిబోదెలతోను, టెంకాయ చెట్టుకొమ్మలతోను, మామిడాకుల తోరణములతోను, అలంకరించి, ఆ త్రికోణమును గాయత్రీమంత్రముచేత ఉదకమును ప్రోక్షించి,

మంత్రము :- "యాతెరుద్రశివాతనూరఘోరా పాపకాశినీతయా ।
సస్తనువాశంత, మాయాగిరిశంతాభిచాకశీహి ॥

రంగవల్లి (ముగ్గులు) వేసి, దీపమును వెలిగించి, ధూపముచేత సుగంధ విశిష్టముగా నొనర్చవలెను.

మంత్రము :- "అగ్నిరితి భస్మ, వాయురితిభస్మ, జలమితిభస్మ, స్థలమితి భస్మ, వ్యోమేతిభస్మ, సర్వగ్ం హవాఇదంభస్మ, మనఇత్యేతాని చక్షూంసి కరణానిభస్మ"

అను మంత్రముతో త్రికోణమునందు భస్మమును ఆసనముగా బరచి (ప్రోక్షించవలెను)

మంత్రము :- "అగ్నిరస్మిజన్మనాజాతవేదా ఘృతంమే చక్షురమృతంవా ఆసన్ । ఆర్కస్త్రిధామో రజసో విమనోజసో ఘర్మోహవిరస్మినామ"

అను మంత్రముతో

పత్రి పుష్పములను వేయవలెను (ఉంచవలెను) ఈ నవాధికి మంత్రా క్షరములతో గూడిన రాగిరేకులను అమర్చవలెను. అవిలేని పక్షమున తాటి యాకులపై గాని లేదా భూర్జ పత్రములపైన గాని వ్రాయవలెను.

ఈ విధముగ విమానము - సమాధి సిద్ధమైనపిదప అట్టి లింగ శరీరమునకు మరల పుష్పాంజలి యొనర్చి, విమానమువద్దకు దీసికొనివెళ్ళి

మంత్రము :- "ఆపోహిష్ఠా మయోభువ...ఆపోజనయథాచనః"

ఈ మంత్రముచేత విమానమునకు జల సంప్రోక్షణముగావించి

మంత్రము :- "సుర్కిసుర్కి శల్మలిన్ విశ్వరూప హిరణ్యవర్ణాన్। సుక్రతిన్ సుచక్రన్ ఆరోహవదమృతస్యసుర్క్యస్యోనం పత్యావహంతుం కృణుష్వా- సుగన్షఃనమాబుక్షమరిష్టన్ స్వస్తివాహనం యస్మిత్విరోనరిష్యత్యేనేషా విదంతే వసు"

అను మంత్రముతో ఆ లింగ శరీరమును విమానము మధ్యన గూర్చుండబెట్టవలెను.

మంత్రము :- "తీక్ష్ణశృంగాయ విద్మహే వేదపాదాయ ధీమహి-
తన్నో వృషభః ప్రచోదయాత్"

ఈ మంత్రము నుచ్చరించి విమానమును మోయుటకు నల్గురు మహేశ్వరులనుగాని, అథవా భక్తులనుగాని వరించవలె (నియమించ వలయు)ను. వీరికి కొత్త విభూతితో గూడిన వస్త్రాదుల నొసగవలెను.

మంత్రము :- "మూర్ధానం పత్యురారోహ వ్రజయాచ విరాడ్భవ"

అను మంత్రము నుచ్చరించి విమానము నెత్తించి అత్యం త్యుత్సవముతో (వైభవముతో) రాజవీధులందు మంగళ వాయిద్యములతో ఊరేగించుతు సమాధి మార్గము ననుసరించి వెళ్ళి సమాధి స్థలమునకు పదహారడుగుల దూరముండగా శుద్ధ స్థలములో విమానమును దించి

మంత్రము :- "స్యోనాపృథివీభవాన్నృక్షరానివేశినీయచ్ఛానశ్శర్మ సప్రథాః"

అను మంత్రము నుచ్చరిస్తు విమానమును క్రిందికి దింపవలెను.

తరువాత "ఉఘేఉఘే" యనుకుంటు "జయ శంకర" శబ్దము నుచ్చరిస్తు, ఘంట, శంఖానాదము, వాయిద్యములు మ్రోగుచుండ పుష్ప వర్షమును గురిపిస్తు ఆ లింగ దేహమును మంగళాసనమున ఉత్తరాభి ముఖముగా వేదికపై గూర్చుండబెట్టి

మంత్రము :- "యోరుద్రోఅగ్నౌ యో అప్సు యఓషధీషు - యోరుద్రో విశ్వాభువనాని వివేశ తస్మై రుద్రాయ నమో అస్తు"

అను మంత్రము నుచ్చరించి ఆ లింగదేహమున (తామ్ర) రాగి రేకులను ధరించవలెను.

అవి యెట్లనగా

"ఓం"కారమును వ్రాసిన రేకును నాలుకపైన, "న" కారముండిన రేకును కుడి భుజముపైన, "మ" కారముగల రేకును ఎడమ భుజముపైన, "శి" కారమున్న రేకును నాభియందు, "వ" కారమున్న రేకును కుడి పాదముపైన, "య" కారమున్న రేకును ఎడమ పాదముపైన, "ఉ" ౧, బసవా క్షరములు ౩, గల్సి నాలుగు "ప్రణవము"ను వ్రాసిన రేకును ఎద గుండెపైన, "మ" కారము ౧, అ, ఉ, మ ౩, గల్సి ఈ నాలుగు, ప్రణవములను వ్రాసిన రేకును వెనుక వీపుపైన, "అ" కారము ౧, ఓం నమః శివాయ ౬ ఈ ౭ ప్రణవముతో గల్సిన రేకును ఎడమ తుంటిపైన, "ఓం" కారము ౧ హ్రాం హ్రీం హ్రూం హ్రైం హ్రౌం హ్రౌం హ్రః ఇవి ఏనమిది ప్రణవమును వ్రాసిన రేకును కుడి తుంటిపైన ధరింపc జేయవలెను. ఈ రీతి రాగిరేకులను ధరించిన పిదప లింగ శరీరమునకు సరిపడునట్లు ఒక తెల్లబట్టతో సంచిని గుట్టించి యుంచవలెను. ఆ సంచిని లింగ శరీరమునకు దొడగించవలెను.

## ಪು ಷ್ಪಾ ಂ ಜ ಲಿ

ಗುರುದೀಕ್ಷೆಯಂಪಡೆದು ಶರೀರಧರ್ಮವನೀಗಿ ಗುರು - ಲಿಂಗ - ಜಂಗಮದಗುಪ್ತ ಭಕ್ತಿಯಮಾಡಿ ವರತೀರ್ಥಪ್ರಸಾದವಂ ಪಡೆದು ಸೇವಿಸುತ್ತಂ । ಶಿರದೊಳಿಹಾಕಳೆ ಇಷ್ಟವೆ ಪರಬ್ರಹ್ಮವೆಂಬುದು ಹಿಡಿದು ಸತ್ಕ್ರಿಯಗಳಿಂದಾಚರಿಸುತ್ತ ಧರೆಯ ಭೋಗ ವನಳಿದು ಹರಲೋಕಕ್ಕೈದಿ ಮರ್ತ್ಯಕೆ ತಿರುಗದಿರು ಎಂದುರಜತಪುಷ್ಪವನೀ ಯುವೆ ॥೧॥

ಶಿವ ಜನ್ಮದಲಿಹುಟ್ಟಿ ಶಿವದೀಕ್ಷೆಯಂ ಪಡೆದು ಶಿವಶೇಷವನೆ ಸವಿದು ಭವವ ಪರಿಹರಿಸುತ್ತ ಶಿವಮಂತ್ರದರುಹಿಂದೆ ಸಂಸಾರನಿಃಪ್ರಿಯನಾಗಿ । ತವೆ ಹರುಷ ದಿಂದ ಷಟ್ ಸ್ಥಲವನಂ ಗೊಂಡುತ್ತಂ । ಸವಿಕಲ್ಪತೆ ತತ್ತ್ವದಾದಿ ಇದೆ ಎಂದುನ ವಸ್ಥಾನದೊಳಿಹನವವರ್ಣವನು ವಿನೊಳಗೆ ಶಿವ ಶಿವಾ ಶಿವ ಎನುತ ಶಿವಲೋಕಕ್ಕೈದಿ ಭುವನವನುಬಯಸಬೆಡೆಂದು ಸುವರ್ಣ ಪುಷ್ಪವನೀಯುವೆ ॥೨॥

ತನು ಗುರುವು ಆಯತದೀಕ್ಷೆಯಂ ಶುದ್ಧತಾನಾಗಿ, ಪ್ರಾಣಚರ ಸನ್ನಿಹಿತ ದೀಕ್ಷದಿಂ ಪ್ರಸಿದ್ಧನು ತಾನಾಗಿ ಸನ್ನುತದುಪದೇಶ ದನುಗ್ರಹವನುಪಡೆದು ಮತ್ತಂ । ಮನ ಬುದ್ಧಿಚಿತ್ತ ಅಹಂಕಾರವನುಳಿದು ಇನಿತು ವಂಚನೆ ಇಲ್ಲದೆ ಗಣಸಾಕ್ಷಿ ಯುಂತಾಗಿ ಘನಲಿಂಗ ತಾನಾಗಿ ಗಗನಕ್ಕೈದುತ್ತ ಬಳಿಕಮನುಜ ಜನ್ಮಕ್ಕಿಳಿಯದಿರು ಎಂದು ಸರ್ವ ಪುಷ್ಪವನೀಯುವೆ ॥೩॥ ಇತಿ



## ముద్రిత గ్రంథములు

1. వీరశైవధర్మ భావగీతికలు (నూతన ఫక్కిలో, తెలుగు, కన్నడ, హిందీ, సంస్కృతములలో నున్నవి) రూ. 15-00
*2. శ్రీ బసవేశ్వరతత్త్వములు (సంపాదకీయ వ్యాసాలు) రూ. 5-00
*3. వీరశైవ ధర్మాన్వేషణము (కన్నడకు తెనుగుసేత) రూ. 3-00
4. నేనెవరు ? (వీరశైవ సమాజోద్యమము జి. మెదకు). రూ. 5-00
5. రత్నత్రయము, (నీతిబోధక వ్యాసములు) రూ. 6-00
*6. మహాజ్ఞాని చన్నబసవన్న (కన్నడకు తెనుగుసేత) రూ. 0-50
7. అల్లమప్రభు విజయము (నాటిక)
8. వీరవిరాగిణి అక్కమహాదేవి (నాటిక)
9. ప్రతిజ్ఞాపూర్తి (నాటిక)
(7–9) రూ. 15-00
10. షష్టిపూర్తి విశేష సంచికలో శ్రీ బసవేశ్వర కన్నడ వచనాలకు తెనుఁగుసేత, సూక్తిసుధా, సంస్కృత శ్లోకములకు తెలుగుసేత రూ. 15-00
11. ఇష్టలింగార్చనావిధిః (అర్చక పరీక్షార్థులకొరకు వ్రాసినది) రూ. 6-00
12. శ్రీ రేణుకాచార్య జయంత్యుత్సవ సందర్భమున శ్రీ స్వామి వీరభద్ర శివాచార్య మహాస్వాములవారి కన్నడకు తెలుగుసేత రూ. 1-00
13. జ॥ శ్రీ రేణుకాచార్యుల చరితామృతము (వచనకావ్యము) రూ. 20-00
14. ప్రాచీన వీరశైవము రూ. 20-00
15. వీరశైవులాచరింపదగిన సూచనలు రూ. 0-50
16. వీరశైవ గోత్ర సూత్ర పటము రూ. 1-00
17. జగద్గురు పంచాచార్యుల సంక్షిప్త పరిచయము రూ. 12-00
18. స్వయం పురోహితము (తెలుగు) రూ. 50-00

* ఈ పూవు గుర్తులు గల ప్రతులు అయిపోయినవి.

19. జీవిత చరిత్ర (గ్రంథకర్తది) రూ. 30-00
20. ఆం. ప్ర. వీర మాహేశ్వర (జంగమ) మహాసభ బైలాసు రూ. 5-00

అ ము ద్రి త ము లు

1. శివానుభవ వ్యాస సంపుటి. భా. 1-2.
2. వీరశైవ గత వైభవము.
3. విరాగి (నవల)
4. దారిద్ర్య పెనుభూతము (నాటకము)
5. ఆదర్శపు వివాహము (నాటకము)
6. జగజ్జ్యోతి బసవన్న (నాటకము)
7. బసవ గాంధి తత్వసామ్యము.
8. శాంత (నాటిక)
9. ఆదర్శపు విద్యార్థులు (నాటిక)
10. పోలీసు దద్దమ్మ (చిన్న నాటిక)
11. జగద్గురు శ్రీ రేణుకాచార్యులు (నాటిక)
12. అద్భుత ప్రేమ అందని తేమ (కథానిక)
13. వీరశైవ ధార్మిక వ్యాసములు.

ఇంకను ననేక వ్యాసములను ధార్మిక-సాంఘిక-సాహిత్యక-సాంస్కృతికములకు సంబంధించినవి, కన్నడ-తెలుగు-సంస్కృతములలో అనేక పత్రికల ద్వారా ప్రకటించడమైనది. మరియు ఆలిండియా రేడియో (ఆకాశవాణి) ద్వారా సిద్ధాంత శిఖామణి, శివ శరణులు, సంఘ సంస్కర్త శ్రీ బసవన్న అను ప్రసంగములను అమరవాణి, సంస్కృతములోను కన్నడ తెలుఁగులోను ప్రకటించనైనది. "వీరశైవధర్మ" అను పత్రికను తెలుగులో ధర్మ ప్రచారమునకై నిరర్గళముగా వరుసగా పది సం॥ములు నిర్వహించఁబడినది.

# గ్రంథకర్త పరిచయము

తెలంగాణ మెదకు మండలాంతర్గతమైన ఆందోలు తాలూక జోగిపేట నగరమున సదాచార సంపన్నులైన వీరశైవ సత్కుటుంబములో శ్రీ వీరయ్యగారు మరియు శ్రీమతి నాగమాంబల పుణ్యగర్భశుక్తిక యందు పం॥ రాచవీరదేవరగారు స్వస్తిశ్రీ రుధిరోద్గారి నామ సం॥ 1925 న జన్మించిరి.

శ్రీ రాచవీర దేవరగారిని నిరతాన్న దాన ప్రవర్తకులునైన జ్యేష్ఠ పితృవ్యులు పూజ్య శ్రీ గొల్లాళప్పగారు (షడక్షరి మహస్వాములవారు) ను తమ సదాశివపేట మరియు జోగిపేట పెద్దమఠములకుత్తరాధికారిగా స్వీకరించి స్వస్తిశ్రీ రక్తాక్షినామ సం॥ ఫాల్గుణ బహుళ ౧, పాడ్యమి బుధవారమునాడు కారణ సంస్కారములతివైభవముగా జరిపించిరి.

వీరు సంస్కృతమున "కావ్యతీర్థ", కన్నడ "జాణ", హింది "భూషణ" మరియు ఉస్మానియా యూనివర్సిటీ M.O.L., సంస్కృతములో "భాషాప్రవీణ" పరీక్షలో నెగ్గి పట్టభద్రులై యున్నారు.

కుటుంబపోషణకై ప్రభుత్వోపాధ్యాయ వృత్తినవలంభించియున్నారు. అవకాశమును బురస్కరించుకొని వీరశైవ సమాజమునకుదుతాభక్తి సేవ జేయుచున్నారు. హైదరాబాదు, సికింద్రబాదు ఉపాధ్యాయ పండిత పరిషత్తునకు ప్రధానకార్యదర్శిగాను తరువాత అధ్యక్షులుగాను ఉండి సాహిత్యసేవ యొనర్చియున్నారు.

వీరు స్వభావముచేత నిరాడంబరజీవులు. మృదుస్వభావము, దయార్ద్ర హృదయులు. సదాచార సచ్ఛీల సద్గుణసంపన్నులు. వీరశైవ సమాజమునకు సాహిత్య, సాంఘిక, వైజ్ఞానిక, ధార్మికముల ననుసరించి యెల్లపుడు వీరు సేవ జేసి యున్నారు. చేయుచున్నారు గూడ.

7-3-1959 లో శివానుభవగోష్ఠిని ప్రారంభించి
18-4-1960 హైదరాబాదునగర వీరశైవతరుః
12-8 1963 హై. నగర వీరశైవ సమాజముః
1-12-1965 ఆంధ్రసారస్వత పరిషత్తు ప్రాచ్య
సమితి, హైద్రాబాద్‌కు అధ్యక్షు
6-8-1967 హైదరాబాదు, సికింద్రబాదు
పరిషత్తునకు ప్రధాన కార్యదర్శి
11-3-1970 నగర వీరశైవ సమాజమునకు ప్ర
14-4-1971 జంటనగరముల ఉపాధ్యాయ పం
సారి "ప్రధాన కార్యదర్శిగను" 
16-1-1973 హైదరాబాదు వీరశైన సా
సంఘాధ్యక్షులుగను.
1973 లో ఆంధ్రప్రదేశ్ వీరమాహే
సభాధ్యక్షులుగను.
24-3-1982 వరకు ఉ. పం. పరిషదధ్యక్షులు
అత్యంత వైభవోపేతముగ నెర
డా॥ దివాకర్ల వేంకటావధానిగా
25-5-1987 అరువది మూడు మంది పురాత
వీరమాహేశ్వర (జంగమ) మహా
హైద్రాబాద్‌లో జరిపిరి.

ఇట్లీయాసంస్థల ద్వారా ఎన్నుకొనబడి వీరు త
చున్నారు.

ప్రభులింగదే

లో శివానుభవగోష్ఠిని ప్రారంభించి నడిపియున్నారు.

1 హైదరాబాదునగర వీరశైవతరుణ సంఘాధ్యక్షులుగను.

3 హై. నగర వీరశైవ సమాజమునకు ఉపాధ్యక్షులుగను.

5 ఆంధ్రసారస్వత పరిషత్తు ప్రాచ్యకళాశాల విద్యార్థిసాహిత్య సమితి, హైద్రాబాద్‌కు అధ్యక్షులుగను.

7 హైదరాబాదు, సికింద్రబాదు ఉపాధ్యాయ పండిత పరిషత్తునకు ప్రధాన కార్యదర్శిగను.

0 నగర వీరశైవ సమాజమునకు ప్రధాన కార్యదర్శిగను.

1 జంటనగరముల ఉపాధ్యాయ పండిత పరిషత్తునకు రెండవ సారి "ప్రధాన కార్యదర్శిగను" పిదప "అధ్యక్షులుగను".

3 హైదరాబాదు వీరశైన సాహిత్య — సాంస్కృతిక సంఘాధ్యక్షులుగను.

3 లో ఆంధ్రప్రదేశ్ వీరమాహేశ్వర (జంగము) మహా సభాధ్యక్షులుగను.

2 వరకు ఉ. పం. పరిషదధ్యక్షులుగా నుండి రజతోత్సవాన్ని అత్యంత వైభవోపేతముగ నెరవేర్చిరి. సంస్థ తరపున డా॥ దివాకర్ల వేంకటావధానిగారిని సన్మానించిరి.

7 అరువది మూడు మంది పురాతనుల పూజలు, ఆం. ప్ర. వీరమాహేశ్వర (జంగమ) మహాసభపక్షాన V. V. హాస్టలు హైద్రాబాద్‌లో జరిపిరి.

స్థల ద్వారా ఎన్నుకొనబడి వీరు తమ యథాశక్తి సేవలొనర్చు

ఇట్లు

ప్రభులింగదేవర, M.A., M.Phil.